శ్రీరస్తు.

# హరిశ్చంద్రోపాఖ్యానము.

శంకరకవి ప్రణీతము.



వావిళ్ల, రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్‌వారిచే

ప్రకటితము.

చెన్నపురి.

కాపీరైటు.] 1910. వెల 0-8-0.

శ్రీరస్తు.

# హరిశ్చంద్రోపాఖ్యానము.

## ప్రథమాశ్వాసము.

శా. శ్రీవాణీవరవాసవాదివిబుధశ్రేణీశిరోరత్నశో
భావిభ్రాజితపాదపంకజుఁ డుమాభామామనోభర్త కా
శీవిశ్వేశ్వరుఁ డిందుశేఖరుఁడు రక్షించు న్మహాపారవి
ద్యావర్ధిష్ణుని బాచయప్రభుని యెల్లామాత్యచూడామణిన్. 1

చ. జలనిధికన్యక్రొమ్మెఱుఁగుసంతతకౌస్తుభవైజయంతికా
విలసితకాంతివాసవునివిల్లుకృపారసధారవృష్టిగా
నెలమి వహించుచుం బొదలుకృష్ణపయోదము ప్రోదిసేయుస
త్ఫలితవిభూతులిం బెసఁగ బాచయయెల్లనికీర్తిసస్యమున్. 2

శా. నీరేజప్రభవుండు వాక్పతిజగన్నిర్మాణదక్షుండు జం
భారాతిప్రముఖామరార్చితుఁడు వేదార్థప్రబోధక్రియా
పారీణుండు విరించిదానజితదేవక్ష్మారుహుం డైనయీ
డూరెల్లక్షితిపాలమంత్రిని జిరాయుష్మంతునిం జేయుతన్. 3

ఉ. అల్లదె మాతులుంగఫల మంచు నవోదయభానుమండలం
బల్లనఁ జూపుచుం బృథులహస్తమునం గబళింపఁ గోరువా
గ్వల్లభముఖ్యదేవగణవంద్యపదాబ్జుఁడు కుంజరాననుం
డెల్లనమంత్రిశేఖరున కీప్సితసిద్ధికరుండు గావుతన్. 4

మ. కరపద్మంబులఁ బుస్తకంబు శుకముం గంజాతము న్వీణయుం
గర మొప్పం బ్రమదంబుతో నుపనిషద్ఘంటాపథశ్రేణిహం
సరథం బెక్కి చరించుచంద్రముఖి భాషాదేవి సర్వజ్ఞఁ జే
యురతీశప్రతిమానరూపనిధి నీడూరెల్లనామాత్యునిన్. 5

ఉ. నల్లవివేల్పుజోటి రతినాథునికూరిమితల్లి యామినీ
వల్లభుతోడఁబుట్టువు శివాచతురాస్యవధూవయస్య యు

సీ. తనయశోమహిమ గంధర్వభామాహస్తవల్లకీసంగీతవర్ణనంబు
తనవదాన్యత యర్థిజనమనోరథదానపారీణగీర్వాణపాదపంబు
తనవిలాసంబు దంతావళగామినీదృక్చకోరకనిశాధిపమరీచి
తనభుజావిక్రమం బనతారిదుర్మంత్రిదందశూకాచ్యుతస్యందనంబు
గాఁగ వెలసినచంద్రశేఖరపదార, విందసేవాకళాలబ్ధవిభవశాలి
మాన్యుఁ డీడూరియెల్లయామాత్యమౌళి, యుల్ల మానందమునుబొంద నొక్కనాఁడు.

సీ. అలయుగంధరుసాటి యగునీతికార్యక్రియాధురంధరు లైనయాప్తసచివు
లలపరాశరసూతిఁ దలఁపించువేదశాస్త్రార్థవిద్యాధురీణార్యవితతు
లలబాణు నొరయుకావ్యక్రియావైఖరీసారస్యనిఘు లైనసత్కవీంద్రు
లలపురందరసూతి గెలువంగ నూహించువిక్రమక్రమధుర్యవీరభటులు
అప్సరస్త్రీలఁ బోలెడునబ్జముఖులు, కలితసంగీతధౌరేయగాయకులును
మహిమఁ గొలువంగ నిజసభామందిరాంత,రమునఁ బేరోలగంబుండి ప్రమదలీల. 18

మ. ననుఁ గౌండిన్యమునీంద్రగోత్రజు సుధాంధస్సింధుకల్లోలతు
ల్యనిరాఘాటవచోధురంధరుని దేచామాత్యసత్పుత్రుఁ బా
వనచారిత్రు శశాంకమౌళిపదసేవాలబ్ధసాహిత్యస
ద్ధనుని స్బంధువిధేయు శంకరకవి న్దాక్షిణ్యపుణ్యాధికున్. 19

తే. మమత రావించి యర్హాసనమున నునిచి, తత్పరత మీఱ గంధాక్షతంబు లాది
గాఁగఁ గర్పూరతాంబూలకనకభూష, ణాంబరంబులు దనియ నందంద యొసఁగి.

తే. సప్తసంతానములలో యశస్కరంబు, కృతియె కావున నీవొనరించునట్టి
నిరుపమానహరిశ్చంద్రనృపచరిత్ర,మంకితము సేయు నాపేర ననఘచరిత. 21

వ. అనుటయు నట్ల కాక యని యంగీకరించి సరససంగీతసాహిత్యవిద్యావినోదగోష్ఠీవి
హారుండును వసుంధరాభారభరణదక్షదక్షిణభుజాచతుశ్శ్రవోధ్యత్తుండును నవార్య
తరచతురశౌర్యహార్యక్షుండును మత్తమరాళగామినీవిశాలనయనచకోరసంపూర్ణపూర్ణి
మాచంద్రుండును భోగదేవేంద్రుండును గపటరిపుదుర్మంత్రిజనాఖర్వగర్వపర్వత
కులిశాయమానకౌక్షేకుండును వనీపకమనోరథార్థదాయకుండును శంభుసేవావిశేష
లబ్ధవిజృంభమాణశాశ్వతైశ్వర్యుండును శాండిల్యముని చక్రవర్తిగోత్రప్రవర్ధనక్రియా
ధుర్యుండును నగు నీడూ రెల్లయామాత్యవంశావతారం బభివర్ణించెద.

శా. కల్యాణాత్మకమూర్తి జృంభితతపోగాంభీర్యధుర్యాత్మ సా
కల్యామ్నాయరహస్యవేది బుధలోకస్తుత్యు నంభోజభూ

త్పుల్లసరోజహర్మ్యములఁ బొల్పెసఁగ న్విహరించులక్ష్మి మా
మల్లనమంత్రిశేఖరునియింట వసించుమనోహరాకృతిన్. 6

. చేటిక లేవధూటికి శచీముఖసర్వసుపర్వభామినీ
కోటులు పద్మ మేపటిలకుంతల కీశ్వరుమేను పుష్ప మే
పాటలగంధికిం జికురభారము పై నుడురాట్కిశోరమా
జోటిభవాని చాలఁ గృపఁ జూచును బాచయయెల్లధీమణిన్. 7

తే. అర్క హిమధామ భౌమ సౌమ్య గురు శుక్ర, తోయజాప్తజరాహుకేతుగ్రహంబు
లెలమి నేకాదశస్థానఫలము లిత్తు, రెపుడు నీడూరియెల్లమంత్రీశ్వరునకు. 8

వ. అని యిష్టదేవతాప్రార్థనపూర్వకంబుగాఁ గృతీశ్వరున కాశీర్వచనంబులొసంగి. 9

తే. సరవి దీపింప నామ్నాయసరణిఁ దఱిసి, పాలునీరును బోలె నేర్పఱిచినట్టి
యనఘుతరమూర్తి గీర్వాణవనచరిష్ణు, బాదరాయణహంసంబుఁ బ్రస్తుతింతు. 10

శా. తారానాథమరీచికాచ్ఛయకృతోద్యన్నూత్నరంగత్పయః
పారావారవినిర్మలోర్మిపటలీపర్యాయవాఙ్నిర్మిత
శ్రీరామాయణకావ్యసృష్టికవితాసిద్ధాంతశుద్ధాంతవి
ద్యారాశిష్ఠను వామ్మలూరుభవుఁ జేతఃప్రీతి వర్ణించెదన్. 11

క. ధీరుల బాణమయూరుల, భారవులై వెలయుమాఘభారవుల సుధా
ధారాపాణింధమకవి, తారచనావాసుఁ గాళిదాసుఁ దలంతున్. 12

క. విమలకవిత్రయనిర్మిత, సమధికరసవత్ప్రబంధసాహిత్యకళా
సుమనస్తటినీకల్లో, లములం గ్రీడింతు నిష్కళంకప్రతిభన్. 13

ఉ. పైకొనుకాంతుచేఁదగిలి పల్కులు భీకరలోభిగేహవ
ల్మీకములందుఁ బాయనియమేయమదోద్ధతదుష్కవీంద్రద
ర్వీకరరాజికి న్వివిధవిశ్రుతకావ్యకళావిశేషదీ
క్షాకుశలార్యతంత్రములు గారుడమంత్రము లెందు నారయన్. 14

చ. వడియును బ్రాసము న్వెదకువాఁడు ప్రబంధము పూని యేమి చె
ప్పెడి నగుఁబాటగు న్సుకవిబృందముముందట మాటలాడు వెం
బడి నవి తమ్ముఁ దామె సులభస్థితితో నుచితస్థలంబులన్
బడిబడి వచ్చి నిల్చి బహుభంగులఁ ద్రోవలఁ జూపకుండినన్. 15

వ. అని సకలసుకవిజననమస్కారంబును గుకవినికరతిరస్కారంబునుం గావించి యే
నొక్క నవీనప్రబంధం బనుసంధింపం బూనుసమయంబున. 16

చ. వినుతచరిత్ర చిక్కమకుఁ బెద్దనమంత్రికిఁ బ్రాభవాధికుల్
తనయులు సంభవించిరి ముదంబున బాచయదండనాథుఁడున్
మనసిజవాసవాత్మజసమానవిలాసుఁడు ప్రెగ్గడయ్యయున్
వినుతవివేకభూషణుఁడు వీరనయుం జరితార్థు లెంతయున్. 32

వ. అం దగ్రజుండు. 33

సీ. కాంతాజనస్వాంతసంతోషకరరూపహసితలతాంతబాణాసనుండు
సుకవిసందోహసంస్తూయమానాశ్రాంతవిశ్రాణనక్రియావిబుధశాఖి
నిఖిలవిద్యాకళానిరవద్యవైఖరీలీలావివేకనాళీకసూతి
భర్గకోటీరత్రిమార్గగానర్గళోర్మిచ్ఛటాసన్నిభస్వచ్ఛకీర్తి
బంధుజాతపయోజాతభాస్కరుండు, భూరిగాంభీర్యవినయవిభూషణుండు
ప్రబలె వాణీశవంశవారాశితుహిన, ధాముఁ డీడూరిబాచప్రధానమౌళి. 34

ఉ. యాచకలోకరక్షణసమంచితభూరిదయాగుణక్రియా
ఖేచరు వంశపావను మృగీనయనాజనపంచబాణు వి
ద్యాచతురాస్యు నీశ్వరపదాంబురుహద్వయచంచరీకముం
బాచయమంత్రిపుంగవుని బ్రస్తుతిఁ జేయుదు రార్యు లెప్పుడున్. 35

క. ప్రెగడనమంత్రియశోరుచి, నగుఁ దుహినాచలముఁ బక్షినాయకకులమున్
నగభిద్దంతావళమును, గగనధునీజలముఁ జంద్రకాంతోపలమున్. 36

చ. మకరపతాకు నాకృతి హిమద్యుతి నిర్మలకాంతి విష్ణుసా
యకు విభూతిఁ బాండుతనయాగ్రణిధర్మగుణప్రశస్తి హా
టకగిరిధైర్యవృత్తిఁ గపటప్రతిపక్షతమోదినేంద్రు బ
ల్లికురువ పెద్దమంత్రిసుతులీల నుతించెద వీరనార్యునిన్. 37

వ. వీరిలోన. 38

చ. అనఘుఁడు మల్లెపూడికొమరాధిపుకూరిమిపుత్త్రి నద్రినం
దన కెనయైనపద్మనయనం బెదలింగముఁ బెండెకట్లశా
సనుఁ డగుపర్వతయ్యసుతఁ జంద్రముఖిం బినలింగమాంబ నిం
పెనయ వివాహ మయ్యె విభవేంద్రుఁడు బాచయమంత్రి యున్నతిన్. 39

సీ. అవనీసురశ్రేణి కమృతాన్న మొసఁగెడిమెలఁతల కీయింతి మేలుబంతి
ధవునియానతి యొక్కలవము లంఘింపనిసకియల కీభామ జన్మసీమ
పరమపాతివ్రత్యగరిమంబు నొందెడుతాటంకవతుల కీజోటి మేటి
ధన్యలఁ బుత్త్రిరత్నములఁ గాంచినవధూతతుల కీకాంతామతల్లి తల్లి

తుల్యప్రాభవశాలిఁ బంకరుహబంధుస్వచ్ఛ తేజస్వి శాం
డిల్య స్వంయమిచక్రవర్తిఁ దగు వర్ణింపంగ నశ్రాంతముక్. 23

తే. ఆమునీశ్వరువంశదుగ్ధాంబునిధికిఁ, బూర్ణనీహారకిరణుఁడై వర్ణనీయ
మహిమ విలసిల్లె లింగనామాత్యవర్యుఁ, డనఘమతిబల్లిసురువపురాంకుఁడగుచు. 24

క. ధర లింగమంత్రితనయులు, సరసులు పెగడనయు గౌరసచివుఁడును గుణా
భరణుం డమరయ్యయు సు, స్థిరకీర్తుల వెలసి రర్థి చింతామణులై. 25

చ. పెగడనమంత్రి బంధుజనబృందము పేర్కొన నుండిశాసనుం
డగుమతిశాలి వీరసచివాగ్రణిపుత్రికఁ దిప్పమాంబికం
దగుమహిమ న్వివాహ మయి ధన్యచరిత్రులఁ గాంచెఁ బుత్త్రులన్
జగదభివర్ణనీయుల విశాలయశోవిభవాభిరాములన్. 26

సీ. స్వర్ణదీలహరికాసందోహవిమలయశస్స్ఫురచ్ఛ్రీశాలి భాస్కరయ్య
ధారాధరామరక్ష్మారుహోజ్జ్వారాతివితరణగుణహారి వీరశౌరి
చేతోభవారాతిసేవాధురీణుండు భూతలాధిపమంత్రిపోతవిభుఁడు
సంగీతసాహిత్యచతురవిద్యాకళాలీలాప్రగల్భుండు లింగరాజు
పెద్ద లౌ నన దనరిన పెద్దవిభుఁడు, మహిమ వెలసిరి రాజన్యమాన్యు లగుచుఁ
గల్పతరుపంచకమురీతిఁ గవిజనార్థి, యూథముల కిష్టఫలముల నొసఁగఁ జాలి. 27

వ. వారిలోన. 28

సీ. యాచకదారిద్ర్యహారణకారణగుణశ్రేణి యెవ్వానివిశ్రాణనంబు
శాతోదరీజనచేతోముదాపాదివర్ణితస్ఫూర్తి యెవ్వానిమూర్తి
కపటశాత్రవమంత్రిగర్వపాథోరాశిబాడబం బెవ్వానిబాహుబలము
దిగ్దంతిదంతకాంతిప్రహాసిప్రభావిలసనం బెవ్వానివిమలయశము
దందశూకాధినాథమందాక్షదాయి, రూఢి నెవ్వానిచాటువాక్ప్రౌఢిశయ్య
యతఁడు పెంపొందు లోకవిఖ్యాతి బల్లి, సురువపెద్దన యనుమంత్రికుంజరుండు.

ఉ. అద్దివిజాధినాయకునియంతటివాఁ డురువైభవంబునన్
గద్దఱివైరులం దృణముగాఁగఁ గనుంగొను శౌర్యరేఖ నే
ప్రొద్దును బాంధవార్థిజనపోషణ మేమఱఁ డెట్టిధన్యుఁడో
పెద్దన తద్దయుం బ్రబలె విద్వదనీకవనీపకస్తుతిన్. 30

తే. ప్రాజ్ఞుఁడై కీర్తిగనినట్టి పట్టమెట్ట, పోతనార్యునిపుత్త్రి సంభోజనేత్రఁ
బరిణయం బయ్యెఁ జిక్కమాంబావధూటి, నింపు సొంపొంద పెద్దమంత్రీశ్వరుండు.

క. వనరాశిఘనగభీరుని, బినరామనమంత్రివర్యుఁ జేరొక్కనఁగఁ దగుం
జనరాయవేడ్క యాచక, జనరాధాతనయు బాచసచివాత్మజునిన్. 47

క. పర్వతమంత్రిని హిమవ, త్పర్వతఘనధైర్యధుర్యు భామాజనదృ
క్పర్వతనూసౌందర్యు సు, పర్వతరుత్యాగశీలుఁ బ్రణుతి యొనర్తున్. 48

క. అం దగ్రజుండు లోకా, నందకరుం డొప్పు నింద్రనందనధనరా
జ్ఞాందనలక్ష్మీనందన, సౌందర్యస్ఫూర్తి యెల్లసచివుఁడు ధాత్రిన్. 49

సీ. ఆర్యానుకూలకృత్యంబు శంభునియందుఁ దనయందుఁ గలుగంగఁ దనరినాఁడు
భూరిసుదర్శనస్ఫూర్తి కృష్ణునియందుఁ దనయందుఁ గలుగంగఁ దనరినాఁడు
చతురాననప్రౌఢి జలజాసనునియందుఁ దనయందుఁ గలుగంగఁ దనరినాఁడు
ప్రబలభోగోన్నతి ఫణివల్లభునియందుఁ దనయందుఁ గలుగంగఁ దనరినాఁడు
మతి వితర్కింపఁ గేవలమంత్రిమాత్రుఁ, డే ధనంజయబాహుశౌర్యాధికుండు
సత్యవర్తనుఁ డీడూరిశాసనుండు, హితజనచోహరి బాచయయెల్లశౌరి. 50

వ. అమ్మంత్రినిధానంబునకు నిజస్థానంబు. 51

మ. అరవిందాసనవాసవాద్యమగలోకారాధ్యకరోత్కటికే
శ్వరకారుణ్యపదాభిరక్షితము భాస్వద్దీప్తిమద్భూసురో
త్కరనిత్యశ్రుతిపాఠనిస్వనముదాత్తశ్రీ నజస్రంబు లి
ద్ధరణిం జేరొక్కన నొప్పుఁ గారొక్కలను గోదావర్యుపాంతంబునన్. 52

సీ. ప్రాలేయశైలేంద్రబహుశృంగసంగతస్ఫటికోపలప్రభాపటిలములకుఁ
జంద్రోదయారంభసంతోషితామృతాంభోనిధానతరంగఫేనములకు
వాసంతసమయగీర్వాణసర్వంసహాజాతశాఖాసుమవ్రాతములకు
వారిజాసనవధూవక్షోజపాటీరజంబాలచర్చామచర్చికలకు
విందు లీడూరియెల్లపృథ్వీకళత్ర, దండనాథయశఃకాంతిమండలములు
దిక్సరోజాతలోచనాదీర్ఘకర్ణ, కోణముక్తాఫలభ్రాజికుండలములు. 53

శా. వేదార్థప్రతిపాదనప్రకటచిద్విద్యాధురీణుండు సా
క్షాదర్ధేందుకళావతంసుఁడు సమగ్రప్రౌఢవాద్యుండు నై
కేదారేశగురుండు సత్కృపఁ గటాక్షింపంగ వర్ధిల్లు ని
ర్భేదారప్రతిభాగుణాభరణుఁ డీడూరెల్లనార్యుం డిలన్. 54

శా. చూడం డన్యసుధాంశుబింబవదనాస్తోమంబు దా నెట్టిచో
నాడం జాలఁ డసత్యవాక్యములు గర్వాయత్తుల న్మెత్తులం

పుణ్యములప్రోవు గాంభీర్యమునకు నెలవు, మహితసౌభాగ్యగుణముల మందిరంబు
వినుతలావణ్యలక్ష్మికి నునికి యనఁగ, లీల విలసిల్లె బాచయలింగమాంబ. 40

చ. పతి తనపాలిదైవ మని భావనసేయుపురంధ్రి బంధుసం
తతులకు సంతతంబును సుధామధురాన్నము లన్నపూర్ణయా
కృతిఁ బరితుష్టిగా నొసఁగు నిం పెసఁగం బినలింగమాంబ కీ
క్షితిఁ బ్రతి సేయ లేరు సరసీరుహలోచన లెన్నిచూచినన్. 41

సీ. అనఘువర్తనుఁడు బాచయమంత్రివర్యుండు హరిణాక్షి పెదలింగమాంబవలన
నిద్ధతేజోనిధి నెల్లయామాత్యుని హేమాద్రిసమధీరు సోమఘనునిఁ
బినలింగమాంబికావనరుహాననయందు రసికశేఖరుఁ బెదరామవిభునిఁ
బినరామధీమణిఁ బ్రియవచోవైఖరిఁ బ్రతిభాసమగ్రునిఁ బర్వతయ్యఁ
గనియె వారలు వంశమాకందవాటి, కావసంతులు హరిదంతకరటిదంత
కాంతినివహానుకారినితాంతకీర్తి, రుచివిభూషణు లర్థార్థిఖచరపతులు. 42

ఉ. రామభుజాబలాఢ్యునిఁ బురందరవైభవధుర్యు బాంధవా
రామవసంతమూర్తి నమరద్రుమపుష్పగళన్మరందధా
రామధురోక్తివైభవధురంధరు నెన్నెద వీరమంత్రి శ్రీ
రామనదండనాయకుని రాజసభాభవనాంతరంబునన్. 43

శా. ఈడూరీకృతసాధురీతికలనాహృద్యాసవధ్యంబు లీ
యీడూ రెల్లనమంత్రిశేఖరువచోహేవాకము ల్తాండవ
క్రీడాకౌతుకజృంభమాణఫణిరాట్కోయూరకోటీరగం
గాడోలాయితనిర్మలోర్మిపటలీగాఢధ్వనిప్రౌఢికిన్. 44

సీ. గాంగేయవిస్ఫూర్తి గాంగేయవిస్ఫూర్తి నమరె దేహప్రభావిమలమతులఁ
బంచాననాకృతిఁ బంచాననాకృతిఁ బోలు పొందె శౌర్యవిభూతులందు
నాగేంద్రవైఖరి నాగేంద్రవైఖరి విలసిల్లె బలవచోవిభవములను
హరిజృంభణంబున హరిజృంభణంబునఁ బొదలె లక్ష్మీయోగభోగమహిమ
నతఁడు కరహాట లాట కర్ణాట యవన, కుంత లావంతి నృపసభాభ్యంతరాళ
సుకవిగాయకలోకసంస్తుత్యకీర్తి, నిత్యుఁ డీడూరి సోమనామాత్యమౌళి. 45

మ. పెదరామయ్యను బాచమంత్రిసుతు గాంభీర్యాంబుధిం గామినీ
మదనుం బేర్కొన వచ్చు రాజసభల న్మందాకినీచందన
త్రిదశక్ష్మారుహతారహారనిభకీర్తిస్ఫూర్తిసంపూర్ణస
ర్వదిశాభాగుని మేరుశైలధృతి గీర్వాణాధిపప్రాభవున్. 46

క. పాటీరహీరహిమకర, కోటీరతుషారహారగోక్షీరమరు
త్స్ఫోటికహాటకగర్భభవ, ధూటీసమవిమలకీర్తిధుర్యోన్నతికిన్. 65

క. నిరుపమనృపకార్యధురం, ధరునకు శాండిల్యగోత్రునకు బాచమహీ
వరమంత్రితనూభవునకు, హరిహయవిభవునకు నెల్లనామాత్యునకున్. 66

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంగడంగినహరిశ్చంద్రచరిత్రం బనుమహా
ప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన. 67

ఉ. శ్రీతరుణీమనోహరవిరించిసమానమహాతపోధన
వ్రాతనివాసయోగ్య మమరద్రుమతుల్యసమస్తపుణ్యభూ
జాతలతానికేతనవసత్త్వికముఖ్యశకుంత మెంతయున్
ద్వైతవనంబు పొల్చు వసుధారమణీహరినీలభూషయై. 68

చ. మదనవిరోధిఁ దాపససమాజము పూజ యొనర్చు దాఁక ష
ట్పదములు పుష్పగుచ్ఛములపై భ్రమరింపవు చంద్రశేఖరున్
ముదమున మజ్జనంబు మునిముఖ్యులు సేయకమున్న హంసము
ల్గదియఁగఁ బోవు తామరకొలంకుల కవ్విపినాంతరంబులన్. 69

సీ. వికసితకుముదారవిందసౌగంధికవిస్ఫురద్వాసనావిలసితంబు
చంచరీకమరాళచక్రవాకక్రౌంచబకసంచయారావభాసురంబు
తీరద్రుసుమగుచ్ఛవారనిర్యన్మకరందసమేతాంబురాజితంబు
మత్స్యకచ్ఛపమహామకరాదిజలజంతుసంతానసంచారసలలితంబు
సతతకేళీవనాసక్తసంయమీంద్ర, బాలికాకుచకాశ్మీరపంకసురభి
రంగదుల్లోలకల్లోలసంగతంబు, రుచిరమై పొల్చు నొక్కసరోవరంబు. 70

తే. ఆసరోవరతటమున నమరవిటపి, కరణి నుడివోనిపల్లవోత్కరలతాంత
చయశలాటుఫలాలులఁ జాలివిజ్జి, వీఁగు నొక్కరసాలపృథ్వీరుహంబు. 71

శా. ఆమాకందముక్రింద ధర్మజుఁ డరణ్యావాససంశీలుఁడై
భీమాదు ల్నిజసోదరు ల్నలువురుం బ్రేమంబుతోఁ గొల్వఁగా
భామారత్నము చేరి ద్రౌపది మహాభక్తి న్భజింపంగ నా
నామౌనీంద్రకథాప్రసంగముల నానందంబుతో నుండఁగన్. 72

వ. ఆసమయంబున. 73

శా. గండూషీకృతవేదశాస్త్రనిఖిలగ్రంథార్థసారుండు మా
ర్తాండానూనతనుప్రభాంచితుఁడు సుత్రామాదిగీర్వాణసే

గాఢం బెన్నఁడుఁ బూర్ణచంద్రసుమనఃకోదండరూపాధికుం
డీడూరెల్లనమంత్రిఁ బోలఁ గలరే యెవ్వారు నిద్ధారుణిన్. 55

చ. సరసజనాగ్రగణ్యుఁడును సత్యవచోరచనాధురీణతా
భరణుఁడు నైనయట్టిసును బాచయయెల్లనికీర్తికామినీ
కరతలమల్లికాప్రసవకందుక మంబురుహాభియాతి త
త్పరిమళలోలషట్చరణపంక్తియె లాంఛన మెన్ని చూచినన్. 56

గీ. సరసపారసదినరాజు సత్త్రిరాజు, లింగయామాత్యపుత్త్రి నాళీకనేత్ర
రూపగుణశీల నుతభవానీపురంధ్రి, నెలమిఁ బరియించె నీడూరియెల్లమంత్రి. 57

సీ. పరమపాతివ్రత్యగరిమ నరుంధతీసంపూర్ణపూర్ణిమాచంద్రవదన
సదమలసత్యభాషావిశేషంబుల రాజీవగర్భమరాళయాన
యపరిమితం బైనయట్టితాలిమికల్మి ధాత్రీసరోజాతపత్రనేత్ర
శాశ్వతైశ్వర్యవిస్తారవిస్ఫూర్తుల నమృతపాథోరాశియాఁడుబిడ్డ
బాంధవాశ్రితభూసురప్రకరసంత, తాన్నవిశ్రాణనంబున నన్నపూర్ణ
యనఁగ నీడూరియెల్లనార్యునిపురంధ్రి, వినుతిఁ గాంచె భవాని పావనచరిత్ర. 58

ఉ. భావజరూపవిభ్రమవిభాసితుఁ డెల్లనమంత్రికి న్భవా
నీవరవర్ణనీమణికి నిర్మలకీర్తులు గల్గి రాత్మజుల్
కోవిదవర్ణనీయు లతికోమలమూర్తులు బంధులోకసం
భావనదక్షు లెంతయును బాచనయుం గఱకంఠమంత్రియున్. 59

షష్ఠ్యంతములు.

క. ఈదృగ్విధమహిమాయతి, కాదిత్యాపత్యఖేచరాదిత్యగవీ
సాదృశ్యవితరణశ్రీ, మోదితవిబుధేంద్రతతికి ముఖ్యస్థితికిన్. 60

క. ఆరాధితశంభునకును, సారబలాన్వితఘనభుజాస్తంభునకున్
దూరీకృతదంభునకు ద, యారచనాబంధురతాసారంభునకున్. 61

క. సతతాన్నదానసంర, క్షితనానాధరణిలోకగీర్వాణునకున్
జతురవచోరచనాతి, ప్రతిభాసుకవిత్వతత్త్వపారీణునకున్. 62

క. గురుచరణయుగళసేవా, గురుతాత్పర్యునకు మంత్రికులవర్యునకున్
గురుతరమతికి న్గౌరీ, గురుసన్నిభధృతికి వినుతకోవిదతతికిన్. 63

క. మానిజనవంద్యగౌరీ, జానిపదాంభోజయుగళసదమలసతత
ధ్యానవిలీనస్వచ్ఛమ, నోనాళీకునకు సతతనుతలోకునకున్. 64

క. అని యివ్విధమున నడిగిన, విని మార్కండేయమౌనివృషభుఁడు కుంతీ
తనయాగ్రజునకు ని ట్లను, ఘనకరుణాపాంగదృగ్వికాసము లడరన్. 82

క. మనుజేశ నీవు నను వేఁ, డినమాటకుఁ దేటపడఁగ డెందంబు ముదం
బును బొంద సదుత్తర మగు, విను మొకపృథ్వీశుకథ వివేకస్ఫురణన్. 83

సీ. ఆకాశవాహినీ నీకాశపర్యంతభూసరయూనదీభాసురంబు
పవనభుగ్భామినీపాథోవిహారయోగ్యానేకపరిభూజితార్ణవంబు
సౌధశృంగన్యస్త జలజరాగప్రభాపాటలీకృతదిఙ్నభస్స్థలంబు
నికటలీలారామవికచనానావిధప్రసవసౌరభ్యవిభ్రాజితంబు
కరము కొనియాడఁదగు నహంకారవైరి, ధారుణీధరజలదసమీరణంబు
ప్రబలవిభవాకరము వీరభటనికాయ, కేసరిక్షోణిధరము సాకేతపురము. 84

తే. ముక్తిదము లైనపురములు మూఁడునాల్గు, వానిలో నగ్రగణ్య యై వసుధమీఁదఁ
బరఁగుధనదునిపురి కనుప్రాస మగుచు, నఖిలసిద్ధజనారాధ్య యగునయోధ్య. 85

క. ఆపంకజసంభవునకు, నాపవనభుగీశ్వరునకు నాగుహునకు నా
భూపాల పొగడఁ దరమే, యాపట్టణమహిమ షోడశాంశం బైనన్. 86

శా. ఆకాశస్పృగనేకభూరిశిఖరవ్యాసక్తవైమానికా
నీకం బప్పురివప్ర మొప్పెసఁగు వర్ణింపంగ నిర్మాణలీ
లాకేలీరతిఁ జక్రవాళగిరిఁ బోల న్నేర్పు సంధిల్ల భా
సాకాంతుండు సృజించి నిల్పినమహాశైలంబు చందంబునన్. 87

శా. సాలస్థూలమనోజ్ఞశృంగఘటితస్వర్ణాభనీలప్రభా
జాలంబు ల్గలయంగ నంబరమునన్ సాంద్రంబుగాఁ బర్వ నం
గాళిందీనది పేర్మిఁ గన్గొనెడివేడ్క న్వచ్చెనో కాక యం
చాలోకింపుచు సంశయింతురు సుధాహాశేందుబింబాననల్. 88

తే. నల్లగలువలు దొగలు కెందామరలును, నీలమణిశుక్తివిద్రుమలీలఁ దనర
శీకరంబులు మౌక్తికశ్రీ వహింపఁ, బరఁగు రత్నాకరముఁ బోలెఁ బురముపరిఖ. 89

ఉ. శ్రీవిలసిల్లునప్పురివిచిత్రపుహర్మ్యతలంబులందుఁ బుం
భావరతిప్రసంగములఁ బల్మఱుఁ జొక్కి శ్రమంబుఁ జెందురా
జీవదళాయతేక్షణలచెక్కులఘర్మపయఃకణావళు
ల్పోవఁగఁ జేయు నభ్రనదిలోపలి మెల్లనిచల్లఁదెమ్మెరల్. 90

క. సురశిఖరిశిఖరసమవి, స్ఫురదున్నతశృంగఘటితశుంభన్మణిసం
భరరుచిపరిపూరితాఖిల, హరిదంతరములు పురంబు హరిహరగృహముల్. 91

వృ్యం డంహఃకరిసింహపోతము ఋషివ్యూహాగ్రగణ్యుండు మా
ర్కండేయుండు ద్వితీయబాలశశిరేఖాశేఖరుం డిమ్ములన్. 74

సీ. భసితత్రిపుండ్రాంకఫాలభాగముతోడ రుద్రాక్షమాలికారుచులతోడఁ
బల్లవారుణజటాపటలభారముతోడ నవ్యపలాశదండంబుతోడ
నుత్తమవ్యాఘ్రాజినోత్తరీయముతోడ రమణీయదర్భాంకురంబుతోడ
నతినిర్మలస్ఫటికాక్షసూత్రముతోడ ధవళయజ్ఞోపవీతములతోడఁ
బుణ్యకల్లోలవత్యంబుపూర్ణఘనక, మండలువుతోడ వినయసంపదలు పొదలఁ
గదిసి భజియించువరశిష్యగణముతోడ, గరిమ నేతెంచెఁ బాండవాగ్రజునికడకు. 75

సీ. అరుగుదెంచుటయుఁ దా నల్లంత దవ్వులఁ బొడగాంచి యెదురుగాఁ బోయి భక్తి
ననుజసమేతుఁడై యందంద పెక్కువందనము లొనర్చి తోడ్కొనుచు వచ్చి
పావనసలిలార్ఘ్యపాద్యాదివిధులఁ బూజించి కుశాసనాసీనుఁ జేసి
హస్తాబ్జములు మోడ్చి యంతరంగంబునఁ బ్రేమ ముప్పిరి గొన నేమ మడిగి
సమయసముచితమృదువాక్యసరణి వెలయఁ, గోరి సుఖగోష్ఠి నడపుచుఁ గొంతప్రొద్దు
జరపి కుంతీసుతాగ్రణి సంయమీంద్రుఁ, బలికె నిట్లని వినయసంపదలు పొదల. 76

శా. అర్కభ్రాజితతేజకల్మషసమూహాంభోజహేమంతదు
స్తర్కాతీతమతిప్రభావసుమనస్సందోహకోటీరసం
పర్కానేకమణిప్రభాళివిలసత్పాదాంబుజద్వంద్వ గో
మార్కండేయమునీంద్ర శక్యమె భవన్మాహాత్మ్యము ల్వేర్కొనన్. 77

క. విమలతపఃపరిపోషిత, కమలాసనకమలనాభకమలారికిరీ
టి మహానుభావ నినుఁ బో, ల మహాత్ములు ముజ్జగంబులను లే రరయన్. 78

మత్తకోకిల. ఆలపోతును జింకయున్ గరశాంకము న్గజచర్మమున్
శూలముం జదలేఱుఁ దామరచూలి భూరికపాలమున్
ఫాలనేత్రముఁ బూపచంద్రుఁడుఁ బాపపేరును డాఁపుచున్
హేలమైఁ జరియించుదేవుఁడ వీవు కేవలమానివే. 79

క. ఇత్తాపసపుంగవులకు, ముత్తాతవు నీవు గావె ముజ్జగముల నీ
చిత్తముల కెఱుకపడనిన్ను, పోత్తమవృత్తములు గలవె యూహింపంగన్. 80

ఉ. కావునఁ దొల్లి మీ రరసి కాంచినయట్టినృపాలకోటిలో
నీవసుధాస్థలిం దొలుత నేమటి రాజ్యము కోలుపోయి మో
హావహలీలఁ గ్రమ్మఱఁ బ్రజాభినుతి న్ధర నేలినట్టిధా
త్రీవరు నాన తీవలయుఁ దేటపడం గృపతో మునీశ్వరా. 81

దామరసంబులఁ దన్మృణాళంబుల హసియించు మొగములు హస్తములును
నంబువీచికలఁ దదావర్తకంబుల నగువళిత్రయములు నాభితతులుఁ
గలువపువ్వులఁ దత్పరాగములఁ గెల్చు, వాలుఁగన్నులుఁ దనువులవాసనలును
గలిగి యొప్పుదు రప్పురాంగణములందు, లలితగతులైనవారవిలాసవతులు. 103

ఉ. పౌరనితంబినీజనులపయ్యెద లొయ్యనఁ దూఁటి పీనవ
క్షోరుహాలిప్రసంకుమదకుంకుమచందనపంకవిస్ఫుర
త్సౌరభము ల్మనోజ్ఞగతి సారెకుఁ గ్రోలి పటీరభూమిభృ
న్మారుత మప్పురి న్మెలఁగు మాంద్యముఁ జల్లఁదనంబుఁ జూపుచున్. 104

క. ఏతాదృశమహిమంబుల, భూతలమున జనులచేతఁ బొగ డొందినసా
కేతమునకు నిధినివహని, కేతనమున కధిపు లమితకీర్తిస్ఫూర్తుల్. 105

ఉ. మానుగ నేపునం బగలు మాపుఁ బితామహమన్మథద్విష
ద్దానవవైరిమూర్తుల నుదారగతి న్విహరించు వేల్పు తే
జోనిధి వంశకర్త యయి సూర్యుఁడు మే లొసఁగంగ నిత్యల
క్ష్మీనుతవైభవస్ఫురణఁ జెందినదానకళాధురంధరుల్. 106

సీ. వాసవనిభుఁడు వైవస్వతుండును వికుక్షియును నిక్ష్వాకునృకేసరియును
బాణుండు ననరణ్యపార్థివుండును వైన్యదుంధుమారులు పరిపంథిజయులు
యువనాశ్వమాంధాతృకువలయేశులు పురుకుత్సాహ్వయుండు కాకుత్స్థవిభుఁడు
నంబరీషుఁడు త్రిశంక్వవనీరమణుండు సారపుణ్యుఁడు హరిశ్చంద్రవిభుఁడు
ప్రణుతిఁ జెందిరి జలజాతబంధువంశ, చూతవనచైత్రు లత్యంతశుభచరిత్రు
లహితజైత్రులు సకలలోకైకమిత్రు, లబ్ధివలయితసర్వంసహాధిపతులు. 107

వ. వారిలోన. 108

సీ. నిత్యసత్యవ్రతస్తుత్యచారిత్రుఁడై గౌరీమనోనాథుకరుణ వడసె
సమదశాత్రవలోకజయరమాకాంతుఁడై రాజసూయమహాధ్వరం బొనర్చె
ధారాధరత్యాగధౌరేయుఁడై వనీపకులదారిద్ర్యంబుఁ బాయఁ జేసె
భుజగనాయకతుల్యభూరిదోర్దండుఁడై వసుమతీభరము సర్వము వహించె
నవనిలోఁ బదునాల్గుమహాయుగములు, పూజ్యసామ్రాజ్యపదవివిభూతి నెగడె
సకలకకుబంతగాశప్రశస్తకీర్తి, చంద్రమూర్తి హరిశ్చంద్రచక్రవర్తి. 109

ఉ. ఏనుగుల న్హయంబుల మృగేక్షణల న్మణిభూషణంబులం
గానుక లిచ్చి కొల్తు రతికౌతుకలీల నిరంతరంబు నం

తే. గగనగంగాతరంగిణీకనకకమల, హరణగమనార్థజనకల్పితాతిహృద్య
విమలశశికాంతసోపానవితతు లనఁగఁ, బొలుచుఁ గలధౌతగోపురములు పురమున. 92

తే. దానవారిప్రశస్తి నెంతయును వెలసి, భూరిపద్మాభిరమ్యవిస్ఫురణ గలిగి
ధేనుకాహితమతి వసుదేవసుతుని, బోలు నప్పురిభద్రశుండాలతతులు. 93

క. నాకస్వామితురంగము, కోకనదప్రియునిరథముగుఱ్ఱంబులు నే
మోకాని యితరతురగము, లాకటకములోనఁ గలుగుహరులకు నెనయే. 94

తే. తత్పురస్యందనములయందములు హృదయ, వీధి నిడుకొని మఱి సుమీ విశ్వకర్మ
కమలవనబాంధవునిశతాంగముగఁ జేసి, పుష్పకంబును సృజియించెఁ బోలుపుదొలఁక.

క. గుణులు శ్రుతిశాస్త్రపారా, యణులు తనూదీప్తివైభవాధరితనభో
మణులు వచశ్శేషమహో, ఫణు లప్పురవరములోనిబ్రాహ్మణు లెల్లన్. 96

క. చాపాద్యాయుధవిద్యా, నైపుణగాంగేయు లర్థి నవరాధేయు
ల్బాపట్టుదు రాపురమున, భూపకుమారులు భుజావిభూతికుమారుల్. 97

క. భిక్షాటనుఁ డగుశివుతోఁ, బక్షంబై మైత్రి నెపుడుఁ బాయం డని యా
యక్షేశ్వరుఁ బ్రహసింపుదు, రక్షీణైశ్వర్యధుర్యు లప్పురివైశ్యుల్. 98

ఉ. భద్రవితీర్ణిసంపదలఁ బ్రస్తుతిఁ గాంచినయట్టినూత్నక
ల్పద్రులు బాహుసత్త్వబలభద్రులు సంతతవిప్రభక్తిని
ర్నిద్రులు సద్గభీరగుణనిర్జితదుగ్ధసముద్రు లార్యతా
క్షుద్రులు తత్పురిం గలుగుశూద్రులు ధైర్యసురాద్రు లెన్నఁగన్. 99

క. చటులరణరంగవీథీ, నటులు మదారాతివీరనవజయలక్ష్మీ
విటులు భయంకరశౌర్యో, ద్భటులు పురిం గలుగువీరభటులు దలంపన్. 100

ఉ. కీరకిశోరభాషలును కేసరిమధ్యములుం బ్రఫుల్లపం
కేరుహపత్రనేత్రములుఁ గెంపుల నీనెడుతియ్యమోవులున్
వారణరాజయానములు పన్నెలు గాని విభూషణావళుల్
పౌరవిలాసినీతతికిఁ బల్మఱు వన్నెలు గావు చూడఁగన్. 101

ఉ. క్రొవ్విన గట్టినిబ్బరపుగుబ్బచనుంగవలున్ మృగంబులన్
నవ్వువిశాలలోలనయనంబులుఁ బున్నమచందమామపైఁ
జివ్వకుఁ గాలుద్రవ్వు నునుఁజెల్వపుమోములుఁ గల్గి మవ్వపుం
బువ్వులయెత్తు లమ్మదురు పొందుగ నప్పురిఁ బుష్పలావికల్. 102

సీ. దాడిమీఫలములఁ దద్బీజవితతుల దట్టించుకుచములు దంతములును
ధారాధరంబులఁ దత్తటిద్వల్లుల నదలించుకురులును నంగములును

క. దేవేంద్రునకు బృహస్పతి, కైవడిఁ దగుమంత్రి యయ్యెఁ గమనీయయశ
శ్రీవెలయ హరిశ్చంద్ర, క్ష్మావరునకు సత్యకీర్తిచాలఁగ హితుఁడై. 120

క. జననియు జనకుండును నై, మనుజేంద్రుఁడు భూప్రజాసమాజంబుల న
త్యనుకంపను బ్రోచుచు నిం, పెనయ మహీచక్ర మెల్ల నేలుచు నుండెన్. 121

వ. తత్కాలంబున. 122

ఉ. శ్రీకరవైభవాఢ్యుఁడు హరిత్పతిముఖ్యుఁడు సర్వదేవతా
నీకశిరఃకిరీటమణినిర్మలపాదసరోజుఁ డర్జునా
నేకపవాహనుండు పవినిర్దళితాద్రి శచీకళత్రుఁ డా
నాకమునందు వేడ్క నొకనాఁడు మహామహిమాభిరాముఁడై. 123

సీ. స్ఫుటవిమలచంద్రికాధవళదుకూలాంబరము పొందుగాఁ గటి రమణఁ గట్టి
నవరత్నమయభూషణవ్రాతములు గళశ్రవణహస్తాదుల సరవిఁ దాల్చి
మంజులవాసనాపుంజరంజితమైన చందనంబును దేహమం దలంది
తుమ్మెదగమికి విందులు సేయుమందారకుసుమదామము మౌళిఁ గుదురుకొల్పి
పృథులచింతామణీభద్రపీఠికాగ్ర, మున హుతాశనసమవర్తిదనుజవరుణ
గంధవాహకుబేరశంకరులు గొలువ, గరిమ విలసిల్లెఁ బేరోలగమున నుండి. 124

వ. నితాంతసంతోషంబుఁ జెంది శతానందనందనుండు కరారవిందాంగుళీనఖశిఖాంకురంబులఁ గరంబు సంగీతప్రపంచపారంగతుండై విపంచి వాయించుచుం గర్ణపుటంబులకు నుదీర్ణసౌఖ్యంబు సంపాదింప నత్యంతసంరంభంబున రంభాదినిలింపవధూపరంపరలు నానావిధమృదంగడిండిమాదిధ్వానానుకారితాళకాహళవేణుప్రముఖనిస్వనంబులం గలసి చరణసరోజనూపురారావంబులు చెలంగ ననేకవిధనృత్యవిశేషంబులు చూపుచు నయనోత్సవక్రియాకలాపంబులొనర్ప బృందారకసందోహంబులు సేవాంజలిపుటంబులు ఫాలభాగంబులం గీలించి కైవారంబులు సంఘటింపఁ బ్రియంబునం గదిసి సుపర్వనితంబినీజనంబులు కరపంకజసంకలితకంకణఝుణఝుణత్కారంబులు తోరంబులై విజృంభింపం బూని చామరంబు లిడఁ దదీయకోమలపవమానప్రకంపితరోలంబవినీలకుంతలుండై యామఖవంతుండు వసిష్ఠ వామదేవ వ్యాస వాల్మీకి పులస్త్యాగస్త్య జైమిని జాబాలి జమదగ్ని కణ్వ కౌశిక కపిల కశ్యప కౌండిన్య శాండిల్య గౌతమాదితపోధనవ్రాతంబులతోఁ గూడి వినోదగోష్ఠిం దగిలి యున్నయెడ నమ్మహామునులం జూచి యింద్రుం డిట్లనియె. 125

ఆ. మౌనులార స్వర్గమర్త్యపాతాళలో, కములయందు మీరు గన్గొననివ్వ
పాలు రెండు లేరు పరికింపఁ గావున, వలయు నడుగ నొక్కపలుకు మిమ్ము. 126

భోనిధివేష్టితక్షితివిభుత్వముఁ జెందినరాజులెల్ల నా
భానుకులాగ్రణిం గని సభ స్తుతిసేసిరిభక్తిపుణ్యునిన్. 110

ఉ. కేళి దలిర్ప నాక్షితిపకేసరి బాహుపరాక్రమంబునం
గోలుమసంగి వైరిగజకుంభనిపాటన మాచరింపఁగా
రాలినముత్యము ల్కదనరంగమునం గనుపట్టువీరల
క్ష్మీలలనాకరగ్రహణసీమ రచించినముగ్గులో యనన్. 111

క. ఆతనిబాహాదండము, వాతాశనరాజస్తవసుధాధరది
గ్జాతంగకమఠకిటులకు, నాతతవిశ్రాంతి యొసఁగు నశ్రాంతంబున్. 112

సీ. సమధికబాహుపీఠమున సర్వంసహ యాననంబున నమృతాకరుండు
భూరిప్రతాపవిస్ఫురణ హవ్యవహుండు తేజోవిభూతి నంభోజహితుఁడు
నయనారవిందకోణంబుల నిందిర వర్ణితసూనృతవాణి వాణి
ప్రచురవైభవకళాప్రౌఢి జంభారాతి సౌందర్యరేఖ మత్స్యధ్వజుండు
చారుజవసత్త్వవిస్ఫూర్తి మారుతంబు, రమ్యవితరణసంపత్తి రాజరాజు
సతతమును నుండఁగాఁ దనసర్వదేవ, తామయత్వంబు దెలుపు నాధరణివిభుఁడు.

మ. కవిదారిద్ర్యమహాంధకారము మడఁగెం గ్రొత్తై సుహృద్బంధుకై
రవకల్హారచరప్రతానములకు స్రమ్యత్వ ముబ్బె న్విలా
సవతీనేత్రచకోరికాతతి హరిశ్చంద్రుండు దిక్పూర్ణకీ
ర్తివికాసోజ్జ్వలకౌముదీపటలకాంతిం జాల దీపించినన్. 114

తే. శశవిషాణంబు బ్రాహ్మణస్వాపతేయ, హరణబుద్ధి నభఃపుష్ప మనృతవాక్య
సరణి వివరించి చూడ సద్ధరణిపతికి, హాటకగ్రావసమని రాఘాటధృతికి. 115

క. ఇంద్రనిభుం డైనహరి, శ్చంద్రమహీరమణుగృహిణి సాధ్వీమణి ని
స్తంద్రమతి చంద్రమతి యను, చంద్రానన చెప్ప నొప్పు శచికిం బ్రతియై. 116

క. ఆజంపతులకు నొక్కత, నూజుఁడు శశిబింబనిభమనోహరతనువి
భ్రాజితుఁడు లోహితాస్యుఁడు, భూజనసుతిభాజనైకపుణ్యుం డగయన్. 117

చ. గిరిసుతయుం బినాకియును గేకిపవాహనుచేత లక్ష్మియున్
సరసిజనాభుఁడుం గుసుమసాయకుచేతఁ బులోమజాపురం
దరులు జయంతుచేతఁ బ్రమదంబును జెందినరీతి ధారుణీ
శ్వరుఁడును సాధ్వియుం గని రవారితసౌఖ్యము లోహితాస్యుచేన్. 118

క. పతిహితమతి గలసచివ, ప్రతతులలో మునుపు ధరణిఁ బ్రణుతింపఁగ ను
న్నతిఁ గన్న మంత్రిరత్నము, కృతపుణ్యుఁడు గలఁడు సత్యకీర్తి యనంగన్. 119

వ. అనుటయు నవంధ్యకోపాటోపంబున నరుంధతీమనోహరుం డిట్లనియె. 156

క. మతిఁ బరికింపఁగ నాత్మ, స్తుతియును బరనిందయును విశుద్ధాత్ములు దా
మతికలుష మండ్రు తగ ద, ద్భుత మొదవఁగ నన్ను నేనె పొగడుకొనంగన్.

తే. పంకరుహబాంధవుండును బాఁపఁడేఁడు, కలశజాతుండు నెఱుఁగంగఁ గమలసూతి
మనతపశ్శక్తితారతమ్యంబు లెల్ల, నిశ్చయింపఁడె యెంతయు నేర్పు మెఱసి. 158

తే. ఆర్యుఁ డడిగినపలుకుల కాక్షణంబ, యుచితభంగుల నొసఁగుఁ బ్రత్యుత్తరంబు
నెట్టుకొని నీవు నాతోడ వట్టిజగడ, మునకు నేటికిఁ బూనెదు మూఢవృత్తి. 159

ఉ. చంద్రకళావతంసుఁడు భుజంగమభర్తయు నైన నాహరి
శ్చంద్రనరేంద్రుప్రాభవము సన్నుతి చేయఁగ శక్తులే శర
చ్చంద్రపురందరద్విరదచందనకుందమరాళమల్లికా
చంద్రమృగేంద్రులన్ గెలువఁ జాలుఁ దదీయయశోవిలాసముల్. 160

శా. సత్యశ్రీనిధి రాజమాత్రుఁడె హరిశ్చంద్రుం డహంకారవ
త్ప్రత్యర్థిక్షితిపాలసైన్యతిమిరప్రాభాతమిత్రాయమా
ణాత్యంతోగ్రభుజాకృపాణజనితోద్యత్కీర్తిగంగానదీ
నిత్యక్షాళితసర్వలోకదురితానీకుండు వీక్షింపఁగన్. 161

క. పరిహాసమునకు నైనను, మఱి కలలో నైనఁ గాక మఱపున నైనన్
ధరణిపయి హరిశ్చంద్రుఁడు, హరహర పరికింప ననృత మాడెడువాఁడే. 162

మ. మదిరాపానసమంబు గాఁ దలఁచు నమ్మార్తాండవంశోత్తముం
డు దయాంభోనిధి పల్కు బొంకుటలు దుష్టుం గూడి వర్తించుటల్
తుదిఁ జండాలునితోడిసంగతిగఁ జేతోవీధి భావించు స
ర్వదిగంతస్ఫుటకీర్తి మూలధనమై వర్తించు నత్యున్నతిన్. 168

క. పరకాంతోదరులు సహో, దరులుం దల్లులును భూతదయ యెల్లపుడుం
గర ముల్లసిల్లుమిత్రుఁడు, వరధర్మము దలఁచి చూడ వర్మ మతనికిన్. 164

తే. అంతకంతకు రోషంబు లలమఁ బ్రియము, దక్కి నీ వొక్కటియన నేనొక్కటియన
వట్టిమాటల నిటు జాలిఁ బెట్ట నేల, వినుము కౌశిక యొకపల్కు విశదముగను.

సీ. అపరదిక్తటమునఁ దపనుండు పొడిచిన గాంగేయశైలంబు గ్రుంగఁబడిన
సొరిది నంభోనిధు ల్శుష్కీభవించినఁ దమ్మిచూలివరంబు దప్పి చనిన
జంభారిదంభోళిసరణి వమ్మైనను ధరణిమండలము దిర్దిరఁ దిరిగిన
హవ్యవాహనుఁడు శైత్యంబు వహించిన బ్రహ్మాండభాండంబు పఱియలయిన

మాన్యునిగాఁ దలంచితె సమస్తసుపర్వతతుల్ వినంగఁ బ
ర్జన్యసభాంతరంబునను సారెకు నింద యొనర్చి తెంతయున్. 147

ఉ. కొంచక నీవు గర్వమునఁ గ్రూరతయుం బొదలంగ మించి నిం
దించినయంతమాత్రముననే తదనూనయశోగుణప్రభా
వాంచితనిత్యసత్యమహిమాధికధైర్యగభీరశౌర్యముల్
కొంచెము లయ్యెనే యకట కోపమె కాని యెఱుంగ వేమియున్. 148

తే. ఆహరిశ్చంద్రసార్వభౌమాగ్రగణ్యుఁ, దొడరి దూషించెదవు విన దోష మనుచుఁ
గర్ణపుటములఁ బాణిపంకరుహయుగముఁ, జేర్చి శివశివ యనియె వసిష్ఠమౌని. 149

క. అప్పుడు విశ్వామిత్రుఁడు, ముప్పిరి గొనునట్టికోపమునఁ గన్గొనలన్
నిప్పులు రాలఁగ నమ్మునిఁ, దప్పక వీక్షించి పలికె దారుణభంగిన్. 150

ఉ. ఏటికి నో వసిష్ఠ తగ దీక్రియ సారెకు వట్టివాదము
లాటికి మాటికిం బెనఁచి మచ్చరికంబున నాడ నీకు నా
హాటకగర్భవిష్ణుకుసుమాయుధవైరులతోడ నైనఁ దా
నోటమిఁ బొందునే కలహ మొందినఁ గౌశికుఁ డెట్టివేళలన్. 151

సీ. ఒకనృపాధముని మదోన్మత్తుఁ జంచలు సనృతభాషాశీలు నధికజడునిఁ
బూని యెంతో మేటిఁబోలెఁ బేర్కొనియెదె మాటికి నాతోడ మచ్చరమున
లవమాత్రమైన నాయవనిపాలునియందుఁ బొడమనిసూనృతస్ఫురణ మిగులఁ
బ్రకటించి పుచ్చకాయకుఁ జేవఁ దెచ్చుచుఁ గీర్తించెదవు వందిక్రియఁ జెలంగి
నీవ కాని హరిశ్చంద్రుఁ డేనెఱుఁగనె, యాతఁ డేయూరు సత్యవాక్యప్రశస్త
గరిమ యేయూరు నీమాట గట్టిపెట్టు, వాక్పరిశ్రాంతిఁ బొందంగ వలదు నీకు.

సీ. ఎవ్వాఁడు వింధ్యాచలేంద్రంబుగర్వంబు సర్వంబు నడఁచె నిర్జరులు మెచ్చ
నెవ్వాఁడు సక్రోధహేతువీక్షణ నింద్రునొడ లెల్లఁ గన్నులై యుండఁ జేసె
నెవ్వాఁడు వేదంబు లేర్పాటు గావించి యన్నియుఁ గ్రమ మొప్ప నచ్చుకట్టె
నెవ్వాఁడు హైమవతీశుతో నెదిరించి గర్వించి యఱకాలఁ గన్నుఁ జూపె
నట్టికుంభజ గౌతమ వ్యాస భృగువు, లుండ బ్రహ్మీభవించి యఖండగరిమఁ
దనరు నే నుండ వెండియుఁ దక్కనట్టి, యిమ్మునీశ్వరు లుండ నీ కేల పెనఁగ. 153

క. ఈహానులకంటెను నీ, వేమిటి నధికుండ వరయ నెఱిఁగింపుము సు
త్రామునితోడను మునుకొని, యేమిటి కాడితివి గర్వ మిటులుం దగునే. 154

తే. వేయు నేటికిఁ బార్వతీవిభునియాన, గరుడగంధర్వయక్షరాక్షససుపర్వ
దందశూకావలులలోన మందు నసును, సూనృతాలాపనియతు లెచ్చోట లేరు. 155

సంధ్యాద్యనుష్ఠానసత్క్రియ లొనరింపక కటి నారచీరలు కట్టు టుడిగి
బోడిపై జన్నిదంబులు ద్రెంచి పోవైచి యపవిత్ర మగుబూది నలఁది మేన
వారుణీపూర్ణమనుజకపాలపాణి, నగుచు ఖరవాహనుండ నై యామ్యదిశకు
నభిముఖంబుగ గమనింతు నఖిలజనులు, రోసి తొలఁగంగ భీభత్సరూపమునను.

వ. అని యివ్విధంబున నవ్వసిష్ఠమునిశ్రేష్ఠుండు పలుకునిష్ఠురప్రతిజ్ఞావచనంబులు విని రెండవకుసుమకోదండవైరి యగునక్కౌశికుండు నాసికాపుటంబు లదర మహోత్కటక్రోధమానసుం డై యధర్మారంభవర్జితం బగుసుధర్మామధ్యంబున లేచి నిలుచుండి పురందరాదిబృందారకబృందంబులు తాపసజనసందోహంబులుమదీయప్రతిజ్ఞ వినుం డని ప్రచండరవంబున నిట్లనియె. 177

తే. చలము దళముగ నాహరిశ్చంద్రుఁ జేరి, భూరికోపాగ్ని కింధనంబుగ నొనర్చి
పెక్కుమాయలు పన్ని గాంభీర్యధైర్య, హీనుఁ గావించి బొంకింతుఁ బూనియేను.

సీ. బొంకింపలేకున్న భుజగకంకణుఁగూర్చి యనిలజలాహారి నగుచుఁ దొల్లి
హిమవన్నగంబున నమితహాయనములు తపము చేసినసుకృతంబులోన
నర్ధాంశ మొసఁగి లోకైకవిఖ్యాతిగాఁ దగఁ జతుర్దశమనోయుగము లవనిఁ
బూజ్యసామ్రాజ్యవిస్ఫూర్తులఁ బొందించి తదనంతరంబ యాత్రిదివమునను
రమణబదునాల్గుమన్వంతరములదాఁక, నముచిసూదను నర్ధాసనంబునందు
నీరజారాతికోటీరనీరజాక్షు, నీరజాసను లెఱుఁగంగ నిలుపువాఁడ. 179

వ. అని యివ్విధంబున నమ్మునికుంజరంబు లన్యోన్యభీకరక్రోధాతిరేకంబులం బ్రతిజ్ఞలు పలుకుటయు. 180

ఉ. కుంభిని దిర్దిరం దిరిగెఁ గుమ్మరిసారెవిధంబున న్దిశా
కుంభులు మ్రొగ్గ మేరుగిరి క్రుంగె విరించి మతిం జలించె వి
శ్వంభరుఁ డెంతయు న్బెదరె సాగరము ల్గలఁగంగఁ బొంగె సం
స్తంభితతేజుఁ డయ్యె రవి తారలు రాలె మహాద్భుతంబుగన్. 181

తే. తలలువేయును ముడిచెఁ బృదాకువిభుఁడు, మాన కదరంగఁ జొచ్చె నంబరతలంబు
దిక్కులన్నియు నొక్కట వ్రక్కలయ్యెఁ, బెల్లు బలిమందిరంబు ఘూర్ణిల్లఁదొడఁగె.

వ. అప్పుడు సునాసీరుండు ప్రకంపితశరీరుండును విన్యస్తభయచేతసుండును విస్రస్తహస్తశతకోటియు నై పేరోలగంబు చాలించె బృందారకబృందంబులు డెందంబుల నమందంబు లగు భయంబులం బొంది వికలతం బెగడు గుడుచుచు నొక్కరుండు చనినతెరువునఁ గదిసి వేఱొక్కరుండు చనక నలుదిక్కులకుంబఱువందొడంగిరి ముని జనంబు లన్యోన్యముఖావలోకనంబులు సేయుచు నాహాకారంబులు చెలంగ జట్టా

నాహరిశ్చంద్రమనుజేంద్రుఁ డన్నృత మాడఁ, డనిన నమ్మునివరునిశ్చయార్థమునకుఁ
గనలి వెండియు నిట్లనుఁ గౌశికుండు, ఘనతరాంగారములు కన్నుఁగవను వెడల.

తే. బాపురే నీదుపలుకుల కీపురండ, రాదిబృందారకులును సంయములు మెచ్చి
రింకఁ జాలింపు మలసితి వెంతసేపు, వాక్పరిశ్రాంతిఁ బొందంగ వచ్చునీకు. 167

క. పలుమఱు నీరీతి వృథా, కలహంబుల కేమిఫలము గలిగెడు నీమా
టలు మేము విశ్వసింపము, తెలియంగా వలయు వానిదృఢసూనృతముల్. 168

ఉ. ఏవిధి నైనఁ జుట్టుకొని యేఁ జలపట్టి త్రిశంకుపట్టి నా
నావిధలీలలం గపటనాటకము ల్పచరించి ధైర్యల
క్ష్మీవిభవంబు మాపి చలచిత్తునిఁ జేసి యసత్యవాక్యముల్
కేవలదుర్మనీషఁ బలికించినఁ బన్నిద మేమి చెప్పుమా. 169

ఉ. ఎంతకుఁ జాలి నిల్చెద వహీనత నా కెదిరించి నీవు నీ
పంతము చూపుమా ధరణిపాలునిపాలికిఁ బోయి యీతెఱం
గంతయుఁ జెప్పి ధైర్యమహిమాన్వితుఁ జేయుము నా నరుంధతీ
కాంతుఁడు నవ్వి యిట్లనియె గాధితనూజునితోడఁ గ్రోధి యై. 170

ఆ. ఇపుడు నాకుఁ జేయ నేటికి నామహీ, కాంతు నధికధైర్యవంతుఁగా నొ
నర్చినాఁడు మున్ను నాళీకగర్భుండు, మాఱులేనిధృతి హిమాద్రి యతఁడు. 171

క. కప్పురము పుట్టుతోడనె, యొప్పుగపరిమళముఁ గూడ నుదయించినయా
చొప్పున నతఁడు జనించిన, యప్పుడె సత్యవ్రతంబు నంకుర మయ్యెన్. 172

తే. ఆనరేంద్రునిసత్య మే నరసిచూడ, కనిమిషాధిపుతోడ నే నాడ నింత
కెడఁగు నే నీకు నిట్లు గర్వించి నన్నుఁ, జనునె యెకసక్కెములు నుల్లసములుఁ బలుక.

ఉ. నీవును నిన్నుఁ బోలెడుమునిప్రవరు ల్పదివేలు గూడి మా
యావనరాశి ముంచి హృదయంబు గలంచి మహోగ్రదుఃఖసం
భావితుఁ గాఁగఁ జేసినను భావములో నణుమాత్ర మైన నా
భూవరవంశవర్ధనుఁడు బొంకమి కెంతటి కైనఁ జాలెడన్. 174

మ. తనసామ్రాజ్యము వాసినం గులవధూత్తంసంబు వర్జించినం
దనయుం డీల్గిన హీనకృత్యములచేత న్దుర్దశం బొందినన్
వనటం గుందిన నానరేంద్రుఁడు మనోవాక్కాయకర్మంబులం
దనృతం బాడిన నాప్రతిజ్ఞ విను విశ్వామిత్ర చిత్రంబుగన్. 175

సీ. పలుమాఱు నను నీవు పరిహాస మొనరింప నేటివిప్రత్వంబు పీటఁబుచ్చి
తపమును జపమంత్రతంత్రము ల్దిగనాడి వేదశాస్త్రాభ్యాసవిధులు విడిచి

తే. బ్రహ్మతోడను సహమించి ప్రాభవమున, మించి ప్రతిసృష్టి చేసి బ్రహ్మీభవించి
విమలతరకీర్తిఁ గాంచినవేదమూర్తి, వగుచుఁ బొగ డొందితివి తాపసాగ్రగణ్య.

ఉ. కౌశికమానివర్య కడఁక న్నను ధన్యునిఁ జేయఁ గోరి వేం
చేసితి రేఁ గృతార్థమతిఁ జెందితి సాంగమహాధ్వరక్రియా
కౌశలపుణ్యసంపదలు గాంచితి మించితి రాజకోటిలో
వాసికి నెక్కితిం దగినవాంఛిత మెయ్యెది వేఁడుఁ డిచ్చెదన్. 196

వ. అనిన విశ్వంభరాకళత్రునకు విశ్వామిత్రుం డిట్లనియె. 197

క. నరవరరూపముఁ దాల్చిన, పురుహూతమహీరుహమవు పురుడింపఁగ నీ
సరి లేరు వనధిపరివృత, ధరణీచక్రంబులో వదాన్యులు ధన్యుల్. 198

క. వేలుపుటావును గుమ్మడు, పా లడిగెడురీతి ధరణిపాల యశశ్శ్రీ
లోల యొకయల్పదానము,వాలాయము గాఁగ నడుగ వచ్చితి నిన్నున్. 199

వ. అది యెయ్యది యనిన. 200

క. సితకరమౌళికిఁ బ్రియముగఁ, గ్రతు వొక్కటి యాచరింపఁ గడఁగితి నీ వా
క్రతుతంత్రము సాంగంబుగ, హితమతి నీడేర్ప వలయు నినకులతిలకా. 201

క. జనుడు కరి నెక్కి దేహం, బనయము నిక్కించి రత్న మంబరమునకై
చన విడిచినంతప్రోవిడు, ధన మిచ్చిన నధ్వరము యథావిధి నడచున్. 202

వ. అనుటయు నా రాజన్యుం డతిధన్యుండనైతి నన్ను మీ రడిగినవిత్తంబు చిత్తంబు రం
జిల్లఁ ద్వరితంబ యిచ్చెదఁ గొనుం డనిన నగ్గాధినందనుండు శిరఃకంపంబు చేసి మహా
శ్చర్యంబును బొంది యాహా యిమ్మహాభావుని యనూనదానప్రభావం బింత యొప్పు
నే యని వక్కాణించుచు నమ్మహీవల్లభున కిట్లనియె. 203

తే. క్షోణినాయక నీమనశ్శుద్ధిఁ దెలియ, వలసి యడిగితిఁ గాక నీవంటిదాత
నిండువేడ్కఁ బ్రసన్నుఁడై యుండ మాకు, నిట్టిసమయంబులను ధనం బేమిప్రాఁతి.

తే. చాల నక్కఱ యొదవినవేళ వచ్చి, పుచ్చుకొనియెద నుంచు నీ విచ్చువిత్త
మింక మాఱుత్తరంబు నీ వేమి పల్కు, నను సదాశివునాన భూనాథతిలక. 205

వ. నీకుం జిరాయుర్నిరామయంబులు నభిరామక్షేమంబు లగుఁ బోయి వచ్చెద నని
యచ్చోట ముహూర్తమాత్రంబునుం దడయక నిజాశ్రమంబునకుం జనియె నంత
నమ్మహీవల్లభుండు నుల్లంబునఁ బెల్లు వితర్కించి. 206

తే విత్త మిప్పుడు గొని చన్నఁ జిత్తమున వి, చారదూరుఁడనై కడు సమ్మదమున
నుండఁగాఁ గల్గు నప్పు పైనునిచె నతఁడు, క్రోధమతి నెట్టితటి వేఁదునోధనంబు,

భారంబులు వీడి నేలదాఁకం దూలి యాఁడ నొండొరులఁ గడవ నాలస్యంబు దక్కి పదంపడి వసిష్ఠకౌశికులభాషణరోషపావకవిస్ఫులింగంబు లభంగంబులై చతుర్దశభువనంబులకు దుర్దాంతతాపంబు నాపాదించు నని యుగ్గడింపుచు దిగ్గన నిజాశ్రమంబులకుం జనిరి వసిష్ఠకౌశికులు నంతరంగంబులఁ గోపంబులు గాఁపురం బుండఁ దమతమవివాసంబులకుం బోయి రంత. 183

చ. ప్రసవితకింశుకప్రముఖపాదపజాలము పాంథలోకమా
నసపరితాపకారణము నందితకోకిలకీరశారికా
భసలము చందనాచలనభస్వదుదారము వచ్చెఁ జైత్ర మ
య్యసమశరప్రతాపము మహాభ్యుదయంబును బొందుచుండఁగన్. 184

వ. ఇట్టిచైత్రారంభంబున. 185

తే. మహితబహుయజ్ఞదీక్షాసమర్థుఁ డైన, యాహరిశ్చంద్రనరపతి సాంగనియతి
వెలయ నొకయజ్ఞ మొనరించి విప్రతతికి, భూరిదానంబు వెట్టె నవారితముగ. 186

వ. పెట్టుటయుఁ దత్సందేశంబు విని యానందించి కపటకృత్యనిత్యతానిపుణుం డగు నగ్గాధినందనుండు. 187

క. నాతలఁపున కనుకూలం, బై తనరఁగ మిషము గల్గె నానూనృతవా
క్చాతుర్యహరిశ్చంద్ర, క్ష్మాతలపతికడకు నిపుడ చనియెద వేగన్. 188

తే. చని ప్రియంబున నాశీర్వచనము లొసఁగి, ప్రీతి పుట్టించి యజ్ఞంబుపేరు చెప్పి
యగణితం బైనస్వాపతేయంబు వేఁడి, తివిరి బొంకింతు మదిలోనిధృతి గలంచి.

వ. అని కృతనిశ్చయుం డై. 190

ఉ. బుధ్యరవిందసూతి మునిపుంగవుఁ డప్పుడ యేగె దేవతా
రాధ్యకు సర్వవత్సకలరాక్షసవల్లభకైతవక్రియా
సాధ్యకు నిర్జరీజనలసత్తనుమధ్యకు సర్వవస్తుసా
న్నిధ్య కయోధ్యకు న్విమలనీరమహాసరయూప్రబోధ్యకున్. 191

వ. చని యప్పురంబుఁ గనుంగొని ప్రవేశించి రాజమందిరద్వారంబు చేరి మహావైభవంబునఁ బేరోలగం బున్న హరిశ్చంద్రనరేంద్రుం గనుంగొనుటయు నతం డత్యంతసంభ్రమంబున నెదుర్కొని వినయపూర్వకంబుగా నమస్కారంబు లొనర్చి. 192

తే. విమలమతి నర్ఘ్యపాద్యాదివిధులఁ బూజ, లొసఁగి యగ్ర్యాసనంబుపై నునిచి కేలుఁ
దామరలు మోళిఁ జేర్చి ముదంబు పొదల, మునిశిఖామణి యిచ్చుదీవనలు గాంచి.

క. దురితాంధకారనవభా, స్కరబింబ కృపావిధేయ గాధేయ మహా
పరమతపోధన నీసరి, పరికింపఁగ లేరు మునులు ప్రాభవచరితా. 194

క. క్షితి సకలసస్యవతియై, యతిసాంద్రంబుగ ఫలించు నపమృత్యువు లె
ట్టితఱిం బ్రభవింపవు కదు, హితముగ నెల మూఁడువాన లెలమిం గురియున్.

చ. చిరతరదేవతాగృహవిశేషమహోత్సవకృత్యము ల్వరం
పరలుగ సాఁగు నెల్లపుడుఁ బల్లవపుష్పశలాటుసత్ఫలో
త్కరములఁ బొల్చుఁ బాదపనికాయము లింకవు నిర్మలాంబువుల్
సరసుల నేఱులం బిదుకుఁ జాలఁగ గోవులు దుగ్ధపూరముల్. 215

సీ. ఇట్లు వర్తింపంగ నిప్పుడు కొన్నాళ్ళగోలె భరింపఁగఁ గొలఁది గాక
బ్రహ్మకైనను గణింపఁగ రాని పెక్కువ న్నెలమెకంబులును బుల్గులును నేల
యీనినయట్లు కోటానకోటులు గూడి దారుణతరనినాదములు చెలఁగఁ
జెఱువులు తోఁటలు చేలు గాలువలును నే పెల్లఁ దూలఁగ రూపు మాపి
యాలమందలఁ గొందలం బందఁ జేసి, జనపదంబుల మనుజులఁ జంపుచుండఁ
గదల మెదలంగ శంకించి కాఁపురములు, విడిచి వచ్చితి మోపృథివీకళత్ర. 216

క. ఈమృగబాధలు మాన్పి ద, యామతి మముఁ బ్రోవ వలయు హాలహాలాగ్ని
స్తోమభయ ముడిపి యమరులఁ, బ్రేమ న్రక్షించినట్టిమృడునిపథమునన్. 217

చ. అని నఁ గృపారసంబు హృదయాంబురుహంబున సంజనింప న
య్యినకులరత్న మిట్లను మహీప్రజ నేఁ దనియంగఁ జూడ మీ
కనయము నింతమాత్రమునకై భయ మందుచు నుండ నేల యీ
ఘనమృగభీతి మాన్చెద సుఖస్థితి మీ కొడఁగూడునట్లుగన్. 218

వ. అనియభయప్రదానం బొసంగి యమ్మహీప్రజాసందోహంబుల వీడ్కొలిపె నంత.

ఉ. పంకజగర్భసీమ మధుపంబులు వృక్షములందుఁ బక్షులుం
బంకరుహాక్షులందు రతిభర్తయుఁ జేరి వసింప నొప్పె న
ప్పంకరుహాప్తుఁ డస్తగిరిపై గడుమందము లైనరశ్ములన్
మంకెనపువ్వుగుత్తిక్రియ మండలమంతయుఁ గెంపు లీనఁగన్. 220

చ. తరుణవయస్కుఁ డైనహిమధాముని మీఁద మనంబు నిల్పి యం
బరసతి దన్ను వృద్ధనుచు మానఁ దలంచినఁ జాల సిగ్గునం
ద్వరితగతి న్మునింగినవిధంబునఁ బశ్చిమవార్ధిఁ గ్రుంకె భా
స్కరుఁడు గుముద్వతీతతి నగంగ వికాసకళామిషంబునన్. 221

క. అనుపమతేజోనిధి యగు, దిననాథునిమహిమ రాశిదేరినచందం
బున సాంధ్యరాగదీధితి, గనుపట్టె నవీనకింశుకప్రసవరుచిన్. 222

క. వనరుహగర్భున కైనను, వనరుహలోచనున కైన వనరుహరిపుజూ
టున కైనఁ దరము గా ద, మ్మునివరుకోపాగ్ని కెదిరి మొన కట్టంగన్. 208

వ. అని మనంబునం దలంచుచు నిరంతరపరిపాలితమహీమండలుండై యుండె నంత న
క్కడ నితాంతకపటక్రియాధౌరేయుం డగు నగ్గాధేయుండు వెండియు నొక్కకప
టమతంబు విచారించి యతిత్వరితంబున. 209

క. నూతనజవసత్త్వంబుల, నూతనతనువర్ణములను నూతనగతులన్
నూతనభంగుల నొప్పెడి, కైతవమృగఖగచయంబుఁ గల్పించె నృపా. 210

వ. ఇట్లనల్పకుహనాచాతుర్యంబునం గల్పించి పంచిన నమ్మృగఖగవ్రాతంబులు గణ
నాతీతంబులై యెక్కడఁ జూచినం దామయై యుక్కుమిగిలి యొక్కమొగిం బిక్క
టిల్లి పెక్కుదెఱంగుల నత్యంతభయంకరకృత్యంబులం జెలంగి ఫలితంబు లగు కల
మాదిసస్యంబులు మేసి పడఁద్రోసి మట్టి మల్లాడియు నారామంబుల నిక్షుదండంబు
లు ఖండంబులు గావించియుఁ గదళీతరుషండంబులు విదళించియు మల్లికామాధవీ
ద్రాక్షాదిలతావితానంబులు ద్రెంచియుఁ గొమ్ములఁ గోరాడి తటాకంబులు పటాపం
చలు గావించియుఁ గ్రమ్మి యందంద కెందమ్మికొలంకులఁ గలంచి కాఱియ పెట్టియు
గోష్ఠంబుల గోవత్సనికాయంబుల నపాయంబు నొందించుచు జనపదంబుల మను
ష్యులం బొదివి చదిపియు బహువిధంబులఁ గోలాహలంబు సేయుటయు హాలహాల
విషజ్వాలంబులచేత దేవదానవానీకంబులుంబోలె ననేకంబులు మహీప్రజాసంఘంబు
లహీనభయంబుల మొఱ లిడుచుం జని హరిశ్చంద్రనరేంద్రునిం గనుంగొని సర్వాంగ
సంగతోర్వీమండలంబు లగు దండప్రణామంబు లాచరించి మస్తకన్యస్తహస్తారవిం
దులై యిట్లనిరి. 211

సీ. సదయుండవై నేఁటితుదదాఁక మము నీవు పెంపుదీపింపఁ బాలింపుచుండ
నీరీతిబాధల నెన్నఁడు పొందక నీచల్లదనమున నిండువేడ్కఁ
దల్లిదండ్రులయొద్దితనయులగతి నాకుమఱుఁగుపించెదలరీతి నెఱి వహించి
భవనంబులను వెండి పైఁడియుఁ దడఁబడ గుఱిలేనిపాఁడియుఁ గూడు గలిగి
క్రీడపై నెండకన్నను నీడకన్న, నెఱుఁగ కన్నలఁ దమ్ముల హితుల సుతులఁ
గూడి సుఖ మున్నవారము కోర్కు లొదవ, సత్యసల్లాప యోహరిశ్చంద్రభూప.

ఉ. జారులుఁ జోరులు న్విమలసత్యవిదూరులుఁ గ్రూరులు న్దురా
చారులు లేరు యాచకులు సాధుల బాధ లొనర్చుభీకరా
కారులు లేరు లేరు మతికల్మషచిత్తులు మత్తులు న్ధరి
త్రీరమణాగ్రగణ్య వివరింప భవత్పరిపాలితావనిన్. 213

కాంతు లుడివోయె గృహదీపకళికలెల్లఁ, జక్రదంపతు లలరె నిగ్వక్రలీల
నంబుజంబులు విరిసి రోలంబములకు, విందులొనరించెఁ బ్రాభాతవేళయందు. 283

మ. ధరణీనిర్జరరాజి మ్రొక్కి శతపత్రంబు ల్విజృంభించి ష
ట్చరణశ్రేణుల కెల్ల నామెతలు వెట్టం జక్రవాకావళుల్
పరమానందముఁ బొంద బింబరుచి బింబశ్రీ విడంబింప నం
బరరత్నం బుదయించె జంభరిపుహర్మ్యస్వర్ణకుంభాకృతిన్. 284

వ. అనిన విని కౌంతేయాగ్రజుం డటమీఁదివృత్తాంతం బెఱింగింపు మనుటయు. 285

మ. అమరానోకహదాన దానవవిపక్షాస్త్రాంఘ్రిసేవాకళా
కమనీయస్థిరభావ భావభవరాకాచంద్రనీకాశకా
శమరాళప్రతిమాననిర్మలయశస్సౌభాగ్యభాగ్యప్రభా
వమురారాతిసమాన మానవిభవవ్యాపారపాథోనిధీ. 286

క మందారదానగుణ సం, క్రందనసమవర్తివరుణకౌబేరదిశా
సౌందర్యయువతివిలసిత, చందనచర్చాయమానసదమలకీర్తీ. 287

పంచచామరము. వసుంధరాధరేంద్రధైర్య వారిజాననామనో
జ సర్వభూతలేశమాన్యచారువర్తనా నటత్
ప్రసూనబాణవైరిమౌళిభాగవిస్ఫురత్సుప
ర్వసింధువీచిజాలతుల్యవాగ్వినిర్భరార్భటీ. 288

గద్యము. ఇది శ్రీమదాపస్తంబసూత్రపవిత్ర కౌండిన్యమునిచక్రవర్తిగోత్ర సకల
సుకవిజనానీకమిత్ర దేచనామాత్యకుమార వినయవిధేయ విద్యాలం
కార శంకరకవినామధేయప్రణీతం బయినహరిశ్చంద్రో
పాఖ్యానం బనుమహాప్రబంధంబునందుఁ
ప్ర థ మా శ్వా స ము.

క. హేలాగతి విరహులపై, నోలి న్రతివల్లభుఁడు ప్రయోగించుమహా
నీలోత్పలశరజాలము, పోలికఁ దిమిరంబు దిశలఁ బోరిఁబోరిఁ బర్వెన్. 223

క. మృగనాభీపరిపూరిత, నగభిన్మణిపేటికరణి నలినభవాండం
బు గనుంగొనఁ గనుపట్టెను, మిగులఁ దమస్సముదయంబు మెండుకొనంగన్. 224

తే. యామినీచంద్రవదన వియత్సురేంద్ర, నీలమణిపాత్రలోపల నించినట్టి
విమలఘనసారశకలసంఘము లనంగఁ, బ్రబలె నక్షత్రవితతు లంబరమునందు. 225

వ. అంత. 226

ఉ. శంకరమౌళిభూషణము సారసమిత్రునితోడిజోడు మీ
నాంకుని మేనమామ కలశాంబుధికూరిమిపట్టి యామినీ
పంకరుహాయతాక్షిప్రియభర్త వియద్గృహమధ్యదీప మే
ణాంకుఁడు గాన నయ్యె నుదయాద్రిపయిం దిమిరేభసింహమై. 227

క. నిండారుకళల హిమకర, మండల మొప్పారె నయనమహ మొదవంగ నా
ఖండలదిక్సతిమౌక్తిక, కుండల మన విమలకాంతి కొమరు దలిర్పన్. 228

శా. కాశాకాశధునీతరంగచయనీకాశద్యుతి న్దట్టమై
కాసెం గౌముది చక్కఁగా సకలదిగ్భాగంబుల న్మన్మథుం
డేసెం బాంథజనవ్రజంబులపయిన్ జృంభించి లీలాధను
ర్వైశారద్యము నివ్వటిల్లఁ బ్రసవాస్త్రశ్రేణులం బెల్లుగన్. 229

ఉ. వారణ లేక యెక్కుమొగి వాంఛలు దీరఁగ సాంద్రచంద్రికా
పారణ సేయుచుం బొదలెఁ బాయనివేడ్కఁ జకోరవారముల్
గైరవబాంధవోపలనికాయము లోలి స్రవించె నేఱులై
జారులు చోరులుం గడువిచారము నొందిరి పొంగె వారిధుల్. 230

వ. ఆసమయంబున హరిశ్చంద్రధరణీవల్లభుండు తత్కాలోచితకృత్యంబులు నిర్వర్తించి
నిద్రింపం దొడంగె నంత. 231

తే. కామకేళిపరిశ్రాంతిఁ గన్ను మోడ్చి, వేడ్క నిద్రించువిటవిటీవితతి బెదరఁ
గుక్కుటంబులు కుక్కురోకో యటంచుఁ, గూయఁజొచ్చెఁ గఠోరనిర్ఘోషణముల.

సీ. చంద్రుఁ డద్దపుబిళ్ళచందానఁ బశ్చిమదిశ నిల్చెఁ గాంతి మందీభవించి
యొక్కటొక్కటి చిక్కెఁ జుక్క లాకసమున నాడకాడకుఁ గడునల్పరుచుల
విటవిటీతతులపై విషమాయుధుఁడు రోష మెడలి బాణాసన మెక్కుడించె
వనముల సింధుజీవనములఁ జెలరేఁగెఁ గలయంగ బహుపక్షికలకలములు

సీ. వ్యాఘ్రంబు నైనను శీఘ్రంబ తరమిడి పొడిచెద మీఁటెలఁ బూపు చెడక
శరభంబు నైనను సరభసంబున డాసి పదము లెన్మిదియుఁ ద్రుంచెదము పొదివి
సింగంబు నైనను భంగంబు నొందించి జీవంబుతోన తెచ్చెదము పట్టి
భేరుండమును నైన నోరెండ నీయక నలి చేసెదము చాల బలిమి వెలయ
సాహసంబున మత్తగజంబు నైనఁ, గరలి తొండంబు తెగ నఱికెదము దేవ
నేఁడు చూడుము మావేఁట నేర్పు లెల్ల, ననుచుఁ బంతంబు లొకకొంద ఱాడి రపుడు.

మ. తలచుట్టన్ జడచొళ్ళియంబులును నీల్దట్టీలుఁ జేకట్టుదం
డలు వాకట్టులు ముప్పిడు ల్మెకముల న్దాకొల్పువశ్యంపుమం
దులునుం జోఁపుడుఁగోలలుం గులుచచేదుడ్లు న్సమగ్రంబులై
చెలువార న్భటకోటి వచ్చె మృగయాశృంగార మేపారఁగన్. 8

వ. ఇవ్విధంబున నపరిమితకిరాతవ్రాతంబులు సముద్భటభటానీకంబులుఁ జనుదేర న
మ్మానవాధీశ్వరుండు దానును మృగయావిహారసముచితశృంగారవేషం బంగీకరించి
పుత్త్రకళత్రామాత్యసమేతుండై. 9

చ. ధనదునిపుష్పకంబునకుఁ దా నెనవచ్చు నటంచు లోకముల్
వినుతి యొనర్పఁ బొల్పెసఁగి విద్రుమమౌక్తికవజ్రనీలకాం
చనమయము న్సువేగహయసంఘటితంబును నైనతేరు సొం
పొనరఁగ నెక్కి మిక్కిలిసముత్సుకతం బురబాహ్యసీమలన్. 10

క. మాతలిఁ దలఁపింపం గల, సూతుఁడు దనరథము గడపుచో బహుగతులం
జాతుర్యంబులు చూపఁగ, నాతని నేర్పులకుఁ జాల హర్షము పొదలన్. 11

వ. కౌబేరదిశాముఖుండై కొంతదవ్వు చని యంతట. 12

మ. కనియె న్భూతలనాథుఁ డాటవికరాకాచంద్రబింబాననా
జననిత్యోచితపుండరీకగవయస్తంబేరమాఖేటమున్
ఘనశృంగాటము నర్మదోర్మిపటలీగర్జద్దిశాపేటమున్
వినుతానేకనికుంజకూటము మహావింధ్యాటవీవాటమున్. 13

ఉ. మారుతపూర్ణకీచకసమాజరవంబులు నర్మదానదీ
నీరజభృంగగానమృదునిస్వనవైఖరితోడఁ గూడి యిం
పారఁగ నధ్వనీననివహంబులకున్ శ్రవణోత్సవక్రియా
గౌరవము ల్ఘటించు నొడికంబుగ వింధ్యవనాంతరంబులన్. 14

వ. వెండియుఁ బుండరీక శుండాల గవయ గండభేరుండ కంఠీరవ సారంగ భూదార
భల్లూక లులాయప్రముఖనిఖిలమృగనికాయభయంకరానూనధ్వానబధిరితకకుబంత

శ్రీ ర స్తు

# హరిశ్చంద్రోపాఖ్యానము.

## ద్వితీయాశ్వాసము.

క. శ్రీలలితలోచనాబ్జవి, శాలయశోరుచినికాయసదమలసుమనః
పాళీసంవాసితది, గ్జాలాధమ్మిల్ల మంత్రిబాచయయెల్లా. 1

వ. ఆకర్ణింపుము పాండవాగ్రజునకు మార్కండేయుం డిట్లనియె నట్లు భానుమంతుండు
ప్రథమసానుమంతంబునం గనుపట్టుటయు నటమున్న మేల్కాని యవ్వసుంధరావల్ల
భుండు సంధ్యాద్యనుష్ఠానంబులు నిర్వర్తించి మృగయావిహారంబునం జనువాఁడై
పురంబునం జాటం బంచిన. 2

తే. దేఁటిమాణిక్య ముపకారి వెండిగుండు, వాయువేగంబు వెతిపుచ్చకాయ గరుడఁ
డడవిపోతులరాజు చిత్రాంగి బొండు, మల్లె యన నొప్పు పెక్కునామములవాని. 3

మ. బలుకోఱ ల్తనుమధ్యము ల్మహదురోభాగంబులుం బెద్దమూ
తులునుం గల్గి మృగేంద్రడింభములకుం దుల్యంబు లైనట్టి జా
గిలపుంగుక్కల హేమశృంఖలముల న్గీలించి కోటానకో
టుల వేగం గొనివచ్చి రాటవికు లాటోపంబు వాటిల్లగన్. 4

చ. గొలుసులఁ బట్టి లుబ్ధకు లకుంఠితశక్తిఁ గుదించి నిల్పఁగా
బలువిడి నంఘ్రిల న్బయలు పల్మఱుఁ ద్రవ్వుచు వీఁకమై నభ
స్థలిఁ గబళింపఁ బాఱెడువిధంబున మోరలు మీఁది కెత్తి కు
క్కలు ఘనభౌంక్రియాధ్వనుల గాఢతరోద్ధతి నించె దిక్కులన్. 5

సీ. కఱకు లైనట్టిజుంజులు వెంద్రుకలు నిర్లు గవియుమేనులు కెంపుఁగన్నుఁగవయుఁ
గులుచజేవుఱుబొట్లు కురువిందపూసపేరులు నొంటియట్టుచెప్పులును గలిగి
వలలును బెట్టుక్రోవులుఁ బెద్దయురులును దెరలును బోనులు దీమములును
వసులు గసులు షోగువాలు వెంద్రుకత్రాళ్లు బలువింట్లు నమ్ములు బల్లెములును
బందివాటులు నీఁటెలు బట్టెసములుఁ, బంత్రకోలలు నాదిగా బహువిధముల
సాధనమ్ములు ధరియించి శబరపతులు, వచ్చి రాఖేటకక్రియావ్యసనరతులు. 6

క. చమరీవాలములు గుఱం, గమదము గజదంతములును గరికిటిసంజా
తము లగు ముక్తాఫలములు, నమితంబుగఁ దెచ్చియిచ్చి రతివినయమునన్. 25

వ. ఇచ్చిన నవి యన్నియుం గైకొని ప్రియంబునం జంద్రమతికి సమర్పించి యవ్వేఁట
కాఁడులకుఁ బసదనం బొసంగి యబ్బిసరుహాప్తకులుండు సరసవివేకరతుండు నత్యంత
హితుండును నగుసత్యకీర్తిం గనుంగొని. 26

తే. అనఘవర్తన విను మృగయావిహార, కారణంబున దూర మేతేర వలసె
మనకు నీరాక సఫలమౌమార్గ మొకటి, తెలియఁ జెప్పెద సమ్మదస్థితి ఘటిల్ల. 27

లయగ్రాహి. అల్లదె సదాగతినటల్లహరి దైత్యరిపుభల్లమకుటప్రసవవల్లరిసముద్య
త్ఫుల్లకుముదాబ్జనవహల్లకవసద్భ్రమర ముల్లమునఁ గౌతుకము వెల్లిగొనఁ గన్నుల్
చల్లఁగఁ బయోధిప్రియవల్లభఁ గనుంగొనుము కొల్లలుగ ముక్తిరమ నెల్లపుడు మజ్జ
త్సల్లలితచిత్తులకుఁ బెల్లొసఁగు జహ్నుమునితల్లజసుతోరుతటినల్లచదలేటిన్. 28

శా. తత్తీరంబున నిష్ఠమైఁ దప ముదాత్తప్రీతిఁ గావించుభా
స్వత్తేజోరమణీయు నంబురుహభూసంకాశు నంహఃపయో
భృత్తీవ్రశ్వసనుం బ్రసన్నగుణగంభీరు న్వసిష్ఠు న్దయా
యత్తస్వాంతు నరుంధతీవిభు సపర్యాకాంక్షఁ జూడం దగున్. 29

క. అని నృపతి దండనాథుని, యనుమతమున నరిగి కాంచె ననురాగము నె
మ్మనమునఁ బెనఁగొనుచుండఁగ, ననుపమము వసిష్ఠమౌనియాశ్రమ మెదురన్. 30

వ. కనితత్ప్రదేశంబున. 31

మహాస్రగ్ధ. వరరుద్రాక్షప్రభూషావ్రజరుచిరతను న్వ్యాఘ్రచర్మోత్తరీయుం
బరమధ్యానాంతరంగప్రణిహితశివునిన్ బద్ధపద్మాసనస్థున్
గరవిన్యస్తాక్షదాముం గనదరుణజటాకల్పు భస్మాంగరాగున్
జిరకాలోపార్జితాతిస్థిరవిపులతపశ్శ్రీగరిష్ఠు న్వసిష్ఠున్. 32

వ. కనుంగొని ప్రముదితస్వాంతుండై యమ్మహీకాంతుండు నిజకిరీటకోటిసంఘటితహరి
నీలరోలంబంబులు తదీయచరణారవిందంబులఁ జుంబింప సర్వాంగాలింగితమహీమం
డలుండై దండప్రణామంబు లాచరించి కరకమలంబులు మొగిడ్చినం గనుంగొని య
మ్మునివల్లభుం డిట్లనియె. 33

చ. అపగతబుద్ధి నింత మృగయావ్యసనంబునఁ గేళి సల్పఁగా
నృపులకు నీతి గాదు ధరణీశ్వర భార్యయు నీవు భీకరా
తపసమయంబున న్బహువిధంబులదుష్టమృగంబు లున్నయి
వ్విపినములం జరించుట వివేక మె యాత్మఁ దలంచి చూచినన్. 34

దంతావళకర్ణకుహరాంతరాళంబును దింత్రిణీతమాలతాళవటకుటజకపిత్థాశ్వత్థకోవిదారసిందువారమందారపిచుమందచందనమాకందమాతులుంగలవంగజంబుజంబీరవకుళ క్రముకపనసదరీమధూకమాధవీకింశుకశింశుపాశోకాదినానావిధపాదపశాఖాశిఖావిహరమాణ మయూరకోకిలకీరశారికాకలవింకకపోతఖంజరీటకాకఘూకాద్యనేకశకుంతసంతతిప్రబలనినాదమేదురంబునునై యరుణగభస్తికిరణపరంపరలకుఁ బ్రవేశింపఁ దరంబుగాక కరంబు సాంద్రంబయి యిసుకచల్లినం గ్రింద రాలక యిరులు గవియుచుం బసరుడాలువింధ్యవసుంధరాధరపరిసరారణ్యంబు దఱిసి మృగంబులు మెలంగుపట్లరసి ముల్లుతారువేయించి ప్రోగు వారించివలలును దెరలు నెత్తించి బోనులు దీమంబులు నొడ్డించి. 15

మ. ఘనబాణాసన మెక్కువెట్టి పటుదోర్గర్వం బఖర్వంబుగా
వనధిధ్వానముకంటె మించుగుణనిస్వానంబు గావించి యు
బ్బున నేసె న్ఘనభీకరాశుగతతు ల్పుంఖానుపుంఖంబుగా
వనజాతాప్తకులాగ్రగణ్యుఁడు మృగవ్రాతంబులం గూలఁగన్. 16

వ. ఇవ్విధంబున నత్యంతభయంకరంబు లగుశరంబులం బఱపినం గరంబు భీతిల్లి యెల్ల మృగంబులు తల్లడిల్లి పెల్లొఱఁగె నట్టియెడ. 17

తే. మేదినీనాథశరహతమృగసమూహ, ఘనకళేబరజనితరక్తప్రవాహ
వితతి ప్రవహించె గైరికక్షితిధరేంద్ర, సానుసంభూతనిర్ఝరచయముఁబోలె. 18

క. అంతట మృగయాకేలి ని, రంతరపరితృప్తి నొంది యవనీశుఁ డతి
శ్రాంతుండై సెలవిచ్చినఁ, బంతమునఁ గిరాతపతులు భటసంతతులున్. 19

క. ఉరువడిఁ బెల్లార్చుచుఁ గే, సరిశాబకసదృశరూపజవసత్వభయం
కరము లగు వేఁటకుక్కల, బరివిడిచిన నవివధించె బహుమృగతతులన్. 20

వ. తదనంతరంబ వారును బదచిహ్నంబులవెంబడిం జని నికుంజంబులు దూఱి పొంచి యున్న మెకంబులం ద్రుంచియు విశాలంబు లగుజాలంబులం బడంజోఁపి తగుల్పెట్టి కొనియు దీమంబుల నొడ్డి యేమఱుపాటునం బొదివియుఁ దనివిసనక మఱియును.

తే. సాళువము గిడ్డు లగుడు వేసడము కురుజు, బాజు జలకట్టె జాలియ వైల యణుజు
నోరణంబును నాదిగాఁ బేరువడిన, వేఁటడేగల గిఱికొన విడిచి కడిమి. 22

తే. గ్రద్దయును గాకి కొంజును గక్కెరయును, గూబపార్వంబు బెగ్గురు కొక్కెరయును
గొంగ లావుక యాడేలు గువ్వ వెలిచ, పొట్రిపిట్టయు ననఁగల్గుపులుఁగుగములం. 23

క. తూలించి విపిన మెల్లను, గాలించి తదస్రవారిఁ గ్రవ్యచయంబుల్
దేలించి తనిసి వేఁటలు, చాలించి నరేశ్వరునకు సమ్మద మొదవన్. 24

వల్లభునాజ్ఞ నూతుఁ డనివార్యగతిం దగదోలె వాయువే
గొల్లసితాశ్వయుక్తమయి యొప్పగునయ్యరదంబుఁ జయ్యనన్. 46

వ. ఇవ్విధంబున రథంబు తోలించి మహీనాయకుండు డాయం బోవుటయు నమ్మాయా
కురంగంబు నిరాయాసంబున. 47

సీ. బంధనం బెడలి భూభాగంబుఁ జేరి యిచ్ఛాలీల విహరించు గాలియిట్టి
కుందేటితోఁ బొత్తు గూడక వచ్చిన యుడురాజబింబంబునడిమియిట్టి
వీరభద్రునికృప వెండియు నుద్భూత మైనదక్షమఖంబులోనియిట్టి
కుధరనందన వేఁడికొన విసర్జించినచేతో భవారాతిచేతియిట్టి
ననుకరించుచు మిగులఁ బెం పగ్గలింప, మంచిమురువును బరువును మదము ముదము
పొదలఁ గనుఁగొనువారి కింపుల ఘటిల్ల, నల్లనల్లన నడయాడె నభినవముగ. 48

సీ. చేయాక కుప్పించి చివ్వున దాఁటుచుఁ గొమ్ములచే బయల్చిమ్ముకొనుచు
బిత్తరంబులుగాఁగఁ బేరెము ల్వాఱుచు మరిగి నక్కైవడి మలసికొనుచుఁ
గసవుపోఁచలు కసిగాట్లుగాఁ గొఱుకుచు వివృతాస్యమున జాఱ విడుచుకొనుచు
రిక్కరిక్కనఁ దోఁక ద్రిప్పి జాడించుచు ఖురపుటంబులఁ దల గోఁకుకొనుచు
నిగిడిపాఱుచు నంతంత నిలువఁబడుచు, నొడలికండూతికై చెట్ల నొరసికొనుచు
నుదరి యొక్కెడ మిన్నక బెదరిపడుచుఁ, గువలయేశ్వరు నలయించికొనుచు నరిగె.

వ. ఇట్లరిగి విశ్వామిత్రునియాశ్రమంబు ప్రవేశించి మొఱంగి చనం జూచు దానితెఱం
గెఱింగి రోషించి కనుంగవఁ గెంపు జనియింప నాత్రిశంకునందనుండు విశంకటభు
జాబలంబున శరాసనం బెక్కువెట్టి మౌర్వీరవం బొనర్చి దర్వీకరభీకరం బగు శరంబు
దొడఁగి తెగనిండం దిగిచి దృష్టిముష్టిధారేయుండై యేయుటయు నయ్యేటునం దూ
లక వాతూలజవంబున నక్కురంగంబు కౌశికుసమ్ముఖంబునకుం జని యదృశ్యంబయ్యె
విశ్వంభరావల్లభుండు నాయిట్టిపసలంబడి వెట్టితనంబున నవ్వనంబెల్లం ద్రిమ్మరినవాఁ
డు గావున నితాంతనిబిడాతపాక్రాంతుండును క్షుత్పిపాసావంతుండును నై యమం
దశ్రమంబును బొంది శీతలజలాన్వేషణాభిలాషియై చనిచని ముందట. 50

సీ. మందారజంబీరమాతులుంగలవంగ కేతకీచంపకకింశుకముల
మాకందచందనమాలూరఖర్జూరకోవిదారమధూకకురువకముల
జంబూవటాశ్వత్థనింబనీపకపిత్థతాలతమాలహింతాలములను
దింత్రిణీపాటలతిలకామలకదేవదారుపున్నాగకర్పూరములను
మఱియుఁ దక్కినపావనక్ష్మారుహముల, బహువిధంబులపూఁదీఁగెపందిరులను
ప్రబలి విలసిల్లుకౌశికాశ్రమముఁ గాంచె, నుల్ల మలరంగ మేదినీవల్లభుండు. 51

క. సప్తోపాయధురీణత, సప్తవ్యసనములు వదలి సదమలబుద్ధిన్
సప్తాంగరక్షణుం డయి, సప్తాశ్వకులేంద్ర మెలఁగఁ జను నరపతికిన్. 35

క. మునిజనవినుతం బగున, మ్మనువంశంబున జనించి మఱవం దగునే
మనుజేశ నీతిమార్గము, విను నీతిజ్ఞునకు రాజ్యవిభవము పొదలున్. 36

తే. ఇచట నాలస్య ముడిగి నీ విపుడు పురికిఁ, బొమ్ము వేగంబ యింకొక్కబుద్ధివినుము
మఱచి తప్పియుఁ గౌశికమౌనియాశ్ర, మంబుపొంతకుఁ బోవకు మనుజనాథ. 37

క. పుడమిం గ్రోధుల కానతి, వడిఁ బెట్టినవాఁ డతండు పరికింపంగాఁ
గడుఁ గుటిలవర్తనుం డె, న్నఁడు నాతని పేరికూర నంజకుము నృపా. 38

క. పరరంధ్రాన్వేషియు ని, ష్ఠురచరితుఁడు నరయ గాధిసుతుఁ డతనివనం
బరుణాంశువంశ మఱి పై, తెరువైనను వలదు చొరఁగ ధీరవిచారా. 39

వ. అని యుపదేశించి వీడ్కొల్పుటయు నావృత్తాంతం బంతయుం దెలిసి విశ్వామిత్రుండు హరిశ్చంద్రమహీకళత్రుని దనయాశ్రమంబునకు రప్పించునుపాయం బంతరంగంబునం జింతించి యనల్పకపటకౌశలంబున నొక్కమాయామృగంబును గల్పించిన నదియును. 40

సీ. నవఫేనరుచి నవ్వుధవళాననంబును నల్లఁగల్వల గెల్చునయనములును
బద్మరాగప్రభం బగటుకర్ణంబులు కాంచనదీధితి మించుతనువు
మౌక్తికకాంతుల మఱపించుచాలు తుహినంబుతోఁడుత దొరయుకడుపు
మరకతదీప్తులఁ బురుడించుఖురములు పవనంబుఁ దలఁకించుపటుజవంబు
గలిగి లీలావిహారంబు కారణముగ, నవనిఁ జరియించుపంకరుహారియంక
మృగముగతిమండుటయుసంయమీశ్వరుండు, దానిఁగన్గొనికడుసమ్మదంబుఁబొంది.

వ. హరిశ్చంద్రధరిత్రీవల్లభు నల్లన నొలయించి మదీయాశ్రమంబునకుం దెమ్మని పంచిన.

క. తనతనుకాంతులు దిక్కుల, మునుకొని యెల్లెడలఁ బర్వ మురియుచుఁ జని యా
ఘనచిత్రమృగము చయ్యనఁ, బనివడి భూవరునిదృష్టిపథమున నిల్చెన్. 43

చ. నిలిచిన భానువంశజుఁడు నివ్వెఱఁగంది తదీయవిభ్రమం
బులు పలుమాఱు చూచు మ నపూర్వమృగం బిది దీని మేను బి
ట్టలయ రయంబునం దఱిమి యల్లనఁ బ్రాణముతోనఁ బట్టి ని
ర్మలమతి యైనలోహితకుమారున కిచ్చెదఁ గేలి సల్పఁగన్. 44

వ. అని సారథిం గనుంగొని. 45

ఉ. అల్లదె పైఁడియిఱ్ఱి మద మారఁగఁ జూడుము దానిఁగూడ నీ
వెల్లవిధంబుల న్రథ మహీనజవంబునఁ దోలుమన్న భూ

ఉ. చెప్పిన మేదినీరమణశేఖరుఁ డుల్లమునందు నెంతయున్
ముప్పిరిగొన్న భీతి మునిముఖ్యుఁడు కౌశికుఁ డేమి సేయునో
యప్పరమేశుఁడే యెఱుఁగు నంతయు నిక్కడఁ బాసి వేగ నే
చొప్పునఁ బోద మింక మనసుద్ది యెఱుంగక యుండ నాతఁడున్. 61

క. ఎక్కడి హేమకురంగం, బెక్కడి మృగయావిహార మెక్కడి విపినం
బిక్కడి కేటికి వచ్చితి, మక్కట మిక్కిలి ప్రమాద మయ్యె స్మనకున్. 62

తే. నవవిరించి యరుంధతీనాయకుండు, మఱచి తప్పియు గాధికుమారువనము
చొరకు మీవని చెప్పె విశుద్ధబుద్ధిఁ, గోరి నామీఁది వాత్సల్యగుణము పొదల. 63

క. ఇచ్చోటఁ దడయ వలవదు, చెచ్చెరఁ బురి కేగు మనుచుఁ జెప్పిన నేలా
వచ్చితిని మృగము వెంబడి, వచ్చునె విధి గడవ నెంతవారల కైనన్. 46

తే. ఏమి చేయువార మెక్కడి కేగుద, మేది కార్యచింత యింక మనకు
మిగులమోసమయ్యె మృగయావిహారైక, కారణమున నేమి గాఁగఁ గలదొ. 65

ఉ. ఆమునిసార్వభౌముని దృగంతము లించుక జేవురించినన్
హేమగిరీంద్ర మైన ధృతి నేపతి బిట్టు చలించు గ్రొగ్గు ది
క్సామజయూథ మైన నుడుసంఘము లైనను రాలు నాసుధా
ధామది నేశు లైనఁ గడుఁ దల్లడ మందుదు రేమి చెప్పఁగన్. 66

తే. శర్వరీశకళావశాళిగర్వ మైన, నడఁచు కౌశికమౌనికే నవఁగ నెంత
యబ్ధి లంఘింప నోపినయలఘుబాహు, బలున కతిదుష్కరమె చాటిపడియ దాఁట.

న. మలయజశైత్యయుక్తములు మానసము ల్వెలయోష్ణభానుమం
డలకిరణాతితీక్ష్ణములు నాలుక లెప్పుడు మౌనికోటికిం
దలఁప ననుగ్రహించినఁ బితామహుఁ జేయుదు రల్పు నైనఁ బే
రలుక వహించి రేని కడునల్పుని జేయుదు రప్పితామహున్. 68

ఉ. ఇప్పుడ పోయి యమ్మునికులేశ్వరుఁ డల్లకమున్నె చేరి వా
తప్పక సంస్తుతించుచుఁ బదంబులకుం బ్రణమిల్లి యుందమో
చప్పుడు సేయకే క్షణము సత్వరవృత్తిఁ దొలంగి పోదమో
యిప్పటి కేదికార్య మది యిద్ధమతిం దగు నాచరింపఁగన్. 69

వ. అని విచారడోలాందోళితమానసుండై యున్న యమ్మానవేంద్రునిం గనుంగొని యమా
త్యశేఖరుం డగుసత్యకీర్తి విశుద్ధబుద్ధిక్రియాపాటవంబు దేటపడ వినయాలాపంబుల
నిట్లనియె. 70

తే. మానవాధీశ యాపుణ్యకాననమునఁ, దోయదశ్యామమునిహోమధూమవితతి
యంబరంబున నభినవం బైన నల్ల, పట్టుజగజంపు గొడుగువిభ్రమము నొసఁగు. 52

ఉ. పంకజసూతికైనఁ దలఁపం గడు నద్భుత మావహిల్ల నే
ణాంకకులాగ్రగణ్య విను మాగమశాస్త్రపురాణము ల్నిరా
తంకమునం బఠించు నెడఁ దాపసపుత్రులకుం గవు ల్లొగిన్
వంకలు దీర్చి చెప్పు గొరవంకలుఁ జిల్కలు నవ్వనంబునన్. 53

సీ. కడుఁ బ్రీతిఁ జన్నిచ్చుఁబడిఁ దప్పి తిరిగెడు లేడిపిల్లలకు బాలెంతపులులు
కంఠీరవంబులు గంధసింధురములతోడ మాటికిఁ జెలులాడుచుండుఁ
జిట్టెల్కగములతోఁ జెలుములు వాటించుఁ బ్రియమున బావురుఁబిల్లిగములు
నీలకంఠంబులు లాలనం బొదవఁ బాటించుఁ గుంభీనసడింభకములఁ
గొండగొఱ్ఱియపిండును గోఁతిగమియు, మంతనము లుండుఁ బొరపొచ్చె మింతలేక
సాళువంబులుఁ బతులుఁ గేళి సల్పు, గాధిపుత్రుతపోవనవీధియందు. 54

వ. ఇట్టివిచిత్రంబులకుఁ బాత్రం బగు నవ్విశ్వామిత్రుతపోవనక్షేత్రంబు నిరీక్షించి తద
భ్యంతరంబున. 55

సీ. సంఫుల్లహల్లకజలజాతమకరందపానలోలాళినీగానరవము
వీచిడోలాకేళివిశ్రాంతవిలసితచక్రవాకమరాళసముదయంబు
సతతకేళీసక్తసంయమిబాలికాస్తనకుంకుమారుణస్వచ్ఛజలము
ప్రవిమలశశికాంతపాషాణకల్పితసోపానమార్గసంశోభితంబు
పవనకంపితతీరభూభాగవిటపి, పుష్పగుచ్ఛపరాగవిభూషితంబు
మకరకచ్ఛపజలజంతునికరయుతము, భూవిభుఁడు గాంచె నొక్కసరోవరంబు. 56

తే. గాంచి మానవనాథుఁ డంగనయు సుతుఁడు, దాను దత్తీరభూమి రథంబు డిగ్గి
దండనాథుఁడు కరము కైదండ యొసఁగ, సరసి దఱిసి వినిర్మలజలముఁ గ్రోలి. 57

వ. కృతావగాహనుం డై తత్సమీపప్రదేశంబునఁ బ్రదీపించు పుష్పితమాధవీలతామంట
పాంతరంబునఁ గిసలయతల్పంబునఁ జంద్రమతీసతీలలామంబు మృదూరుపీఠం బుప
ధానంబుగా శయనించి బాలరసాలపల్లవప్రకల్పితతాళవృంతంబున శీతలమందవా
తూలంబు సోఁకఁ గదిసి విసర దండనాయకువదనారవిందం బవలోకించి. 58

క. సదమలబహుపుష్పలతా, సదనవసద్భసలగాన ఝుంకారములన్
ముద మొదవించుచు నున్నది, యిది యేమునియాశ్రమంబొ యెఱుఁగఁగవలయున్.

తే. అనుచుఁ బలుకుచునుండంగ నచటి కపుడు, కుశసమిత్పర్ణఫలములఁ గోయ నొక్క
ఋషికుమారుండు వచ్చి మహీశుతోడఁ, జెప్పె నిది కౌశికునివనక్షేత్ర మనుచు.

దుర్వారమదభూరిగర్వాంధపరిపంధిబాహుబలారణ్యపావకుఁడవు
సప్తపారావారసంవేష్టితక్ష్మాచక్రసంరక్షావిచక్షణుఁడవు
నిత్యసత్యవ్రతస్తుత్యనిరుపమాన, సారగంభీరవాచావిశారదుఁడవు
ప్రబలధైర్యసుపర్వ పర్వతమ వీవు, భ్రాంతిఁబొందంగఁదగునె నీ కింతలోన. 81

క. అని తనభ్రమఁ దెలిపెడుసతిఁ, గని దుస్స్వప్నంబు గంటిఁ గమలానన నే
వినిపింతుఁదత్ప్రకారము, విను మీవని తెలియ ధరణివిభుఁ డిట్లనియెన్.

సీ. మణిమయం బగుసభామంటపంబున వైభవోన్నతి నేఁ గొలు వున్నవేళ
రోషారుణేక్షుఁడై రుచిరార్కతేజుండు ధరణీసురుం డొక్కఁడరుగుదెంచి
యదలించి ధరణిపై నస్మత్కిరీటంబు పడ దన్ని మఱి తలఁ బట్టి తిగిచి
కరము నిర్దయవృత్తిఁ బురము వెల్వడఁద్రోల బహువిధాపత్పరంపరలఁ జెంది
యీశ్వరానుగ్రహంబున నేఁచి పిదపఁ, బూజ్యసామ్రాజ్యవైభవస్ఫురణఁ గంటి
ననుచు దుస్స్వప్నపద్ధతి మనుజవిభుఁడు, సర్వమును జంద్రమతితోడ సరవిఁ జెప్పె.

ఉ. చెప్పిన నంతయు న్విని కుశేశయలోచన కౌతుకంబు పె
ల్లొప్పమి నెంతయు న్భయము నొందియు నొందనియట్టు లాత్మలోఁ
గుప్పలు గొన్నధైర్యమునఁ గొంకక భూరివివేకశక్తి వా
తప్పకపల్కెఁ జేరి వసుధావరుతోడఁ బ్రియోక్తివైఖరిన్. 84

క. ఏతన్మాత్రంబున కో, భూతలపురుహూత యింత పొలుపఱి మదిలో
భీతిల్ల నేల చెప్పెదఁ, గౌతుక మొదవంగ వినుఁడు కలతెఱఁ గెల్లన్. 85

చ. అలుక జనించి వచ్చినధరామరవర్యుఁడు గాధిపుత్త్రుఁ డు
జ్జ్వలముకుటంబు దన్నుటలు చయ్యన రాజ్యవిభూతిఁ బాయుటల్
పలుమఱుఁ దన్నిమిత్తమునఁ బ్రాప్తము లౌను బహుప్రయాసముల్
గలుగు శశాంకమౌళికృపఁ గ్రమ్మఱ రాజ్యరమావిశేషముల్. 86

వ. అని చంద్రమతి హరిశ్చంద్రుమనస్తాపంబుమాన్పి యూఱడించుచుండె నంత నచ్చట.

క. కోపంబున వెండియుఁ గప, టోపాయం బొకటి యాత్మ నూహించుచు మా
యాపారీణత మీఱఁగఁ, దాపసవర్యుండు గాధితనయుఁడు వేగన్. 88

క. మాతంగకుంభకుచములు, మాతంగకరోపమానమహితోరువులున్
మాతంగయానములు గల, మాతంగవధూయుగంబు మహిమ సృజించెన్. 89

క. అన్నలినాక్షులవాలుం, గన్నుల కెదిరింప లేనికతమునఁ గాదే
పన్నిసభయమున బెడిస, లెన్నఁడు జలదుర్గభూమి లేమఱ వెఱచున్. 90

క. ఓకమలాప్తకులాగ్రణి, మీకేటికి నింతచింత మిన్నక వినుఁడ
స్తోకమతిని వివరంబుగ, నాకుం దెలిసినతెఱంగున న్వినిపింతున్. 71

శా. భూపగ్రామణి వర్ధికల్పక మహాంభోరాశిగాంభీర్యరే
ఖాపారీణుఁడ వద్రిధీరుఁడవు లోకస్తుత్యసత్యవ్రతా
లాపశ్రీవిభవోజ్జ్వలుండ విది యేలా చింత తర్కించినన్
నీపై నల్గెడువారలుం గలరె యోనిత్యప్రతాపోదయా. 72

వ. అదియునుం గాక. 73

తే. శత్రుమిత్రత్వములు రెండు సమముగాఁగఁ, జూచి నిందాప్రశంసల స్రుక్కఁబడక
యుబ్బునొందక యడవుల నొంటిఁ దిరుగు, మానులకు నేల నృపులతో మచ్చరంబు.

చ. జనవర నీకుఁ గౌశికుదెస న్భయ మేటికి నింత యాత్మలో
నునుపఁగ నామునిప్రవరుఁ డుల్లమునం గృప పిక్కటిల్ల మీ
జనకుఁ ద్రిశంకుభూవరు విశంకటశౌర్యుని బొందితోడ నే
యనుపఁడె దేవతాపురికి నారసి చూడ మహాద్భుతంబుగన్. 75

క. విశ్వామిత్రునిమీఁద న, విశ్వాసం బేల నీకు వివరింపంగా
విశ్వార్థదాయకుండవు, విశ్వంభరఁ గలుగుమానవితతుల కెల్లన్. 76

తే. సారవర్తన యీదుర్విచారతమము, వరవివేకకళాదివాకరునిచేత
నడఁచి యొకింతసేపు సౌఖ్యాన్వితముగ, నిద్రఁ బొందుము నిరపాయముద్రఁ జెంది.

వ. అని పలుకు ప్రధానాగ్రగణ్యసమగ్రమనీషావిశేషభాషణంబు లాకర్ణించి యమ్మహీకాంతుండు చింతావివర్జితస్వాంతుండై సంతాపం బుడిగి నేత్రకమలంబులు ముకుళించి ముహూర్తమాత్రంబు నిద్రించి వాక్రువ్వ నాకర్ణింపఁ దరంబుగానిభయంకరం బగుదుస్స్వప్నంబుం గాంచి బిట్టు మిట్టిపడి కలవరించుచు ధైర్యం బవలంబింపలేక నలుదిక్కులు చూచుచు బాష్పజలపూరితనేత్రుండును బ్రకంపితగాత్రుండును నై యొండెఱుంగక యున్న యన్నరేంద్రుం గనుంగొని చంద్రమతి యతిత్వరితంబున:

క. కెంజాయల నీనెడుకర, కంజంబునఁ గంకణములు ఘులుఘులు మన భూ
మింజయునివెన్ను చఱచుచు, నంజక భామ యెల్లఁ దెలిపె నతిశయధృతియై. 79

తే. ఘటితనిర్మలభూరిముక్తాఫలప్ర, కాండసౌభాగ్యనిర్జితగగనసింధు
కంకణం బైననిజహస్తకంకణంబు, కదఁక నూడిచి రక్షగా బడిసి వైచి. 80

సీ. ప్రాణేశ యేమరుపాటుఁ బూర్వం బిట్లు బిట్టు మేల్కని యేల మిట్టిపడెదు
శరణాగతారాతిజనపాలభయహరణాతిదక్షుఁడవు సమగ్రమతివి

క. చండాలిక లసమాయుధ, శుండాలిక లూరువిజితసురుచిరకదలీ
కాండాలిక లమృతాకర, ఖండాలిక లానృపాలుఁ గనుగొని వేడ్కన్. 99

వ. అనుపమానవినయపూర్వకంబుగాఁ బ్రణామంబు లొనర్చి కరకమలంబులు మొగిడ్చి

మ. జయ మార్తాండకులావతంస విమతక్ష్మానాథనానాచమూ
చయపాథోనిధికుంభసంభవ సమస్తద్వీపవిన్యస్తభూ
రియశస్స్తంభ విజృంభమాణమతి వర్ణింపన్ సమర్థుండె యా
వ్యయమై యొప్పుభవన్మహామహిమ నవ్వాతాశనాధీశుఁడున్. 101

ఉ. నీరమణీయవైభవము నిర్జరవల్లభు గెల్చు నీమహా
దారత పారిజాతవసుధారుహముం బ్రహసించు నీశుభా
కారము చంద్రమండలముఁ గైకొనకుండు నటించు మాటికిన్
సూరిజనుల్ నుతింప నినుఁ జూడఁగ వచ్చితి మయ్య వేడుకన్. 102

గీ. విపులధవళాతపత్రితవిమలకీర్తి, మండలుండవు మహితలాఖండలుఁడవు
నిన్నుఁ గనుఁగొనఁగంటిమి నృపవరేణ్య, మత్పురాకృతపుణ్యకర్మములకతన. 103

క. వీణెలు వాయింపంగఁ బ్ర, వీణత్వము గలదు మాకు వినిపించెద మ
క్షీణతరగానవిద్యల, జాణలు గాణలును మెచ్చి సంస్తుతి సేయన్. 104

వ. అని తదీయహృదయానుకూలభావం బెఱింగి యాలీలావతులు గంధర్వనితంబవతుల
కుం బ్రతిబింబంబులై యత్యంతవిడంబంబున. 105

సీ. వీణెలగవుసెన ల్వీడదలించి చెఱఁగుల మెఱుఁగారఁ గాయలమీఁదుఁ దుడిచి
కుచకుంభముల మోపికొని తానములకును జక్కఁగా బవడంపుసారె లొత్తి
శ్రుతి గూడఁ దంత్రులు నుడిగోళ్ళ మీఁటుచు జీవాళిఁ బుట్టించి చెలఁగురత్న
కంకణధ్వనులతోఁ గరపల్లవాంగుళు ల్లల్లార్చుచును నేర్పు లెల్ల మెఱసి
మొనసి శ్రుతు లేడు మూర్ఛనలును, గలుగుముప్పదిరెండు రాగములవాని
మిత్రముల శుద్ధసారంగమేళనముల, మంద్రమధ్యమతారకమానసరణి. 106

శా. గాన ల్మెచ్చఁగఁ బాడి రింపు దొలకంగాఁ దాళమానంబులన్
క్షోణీనాథజయాంకసంకలితము ల్సాళాదిగీతావళుల్
వాణీపాణిసరోరుహాంగుళినఖవ్యాపారలీలారణ
ద్వీణాసంచితపంచమక్వణకళావిఖ్యాతకంఠధ్వనిన్. 107

తే. ఆ నవీనవిశేషగానామృతమునఁ, బొదలి యెంతయు నాశ్చర్య మొదవ నపుడు
వల్లకీదండములఁ బుట్టెఁ బల్లవములు, హారమణిపంక్తి కరఁగి నీరయి స్రవించె. 108

చ. శివశివ యావిలాసినులచిక్కనిచక్కనిగుబ్బచన్నులున్
ధవళమరీచిబింబము నదల్చుమొగంబులుఁ గెంపుమోవులుం
గువలయకాంతిసంపదలకుం గుదురైనవెడందకన్నులున్
యువజనధైర్యమూలముల నొక్కటఁ బెల్లగిలంగఁ జేయవే. 91

సీ. కోదమతేఁటులఁ దెచ్చి విదియచందురుఁ దెచ్చి విషమాస్త్రుసింగిణివిండ్లఁ దెచ్చి
కలువపూవులఁ దెచ్చి ఘనచంపకముఁ దెచ్చి దాడిమీబీజసంతతులఁ దెచ్చి
జలజరాగముఁ దెచ్చి శష్కులికలఁ దెచ్చి ధవళతాంబూలపత్రములఁ దెచ్చి
శంఖంబుఁ దెచ్చి బిసంబులఁ దెచ్చి నిర్భరశాతకుంభకుంభములఁ దెచ్చి
పుష్కరోర్మ్మల నావర్తపులినములను, గదళికాస్తంభముల శాలిగర్భములను
జిగురులను దెచ్చి కాని సృజింపరాదు, కమలజున కైన నాహంసగామినులను. 92

క. ఆనీలవేణులకుఁ గల, గానకళానైపుణంబు గంధర్వసరో
జాననలకు లేదంతయు, వీనులపండువులు సేయు విశదస్వరముల్. 93

క. చండాలత్వము దక్కఁగ, నెం డేమియు వెలితి లేనియొప్పులకుప్పల్
గుండలిపతియును జాలఁడ, ఖండమతిం దద్విలాసగరిమ నుతింపన్. 94

వ. ఇవ్విధంబునం గనుపట్టు చండాలబాలికాయుగళంబు సృజియించి మానిశుండాలం
డా నీలవేణుల కిట్లనియె. 95

సీ. పాటించి వినుఁడు నాపలుకులు దెలియంగ గంధసింధురరాజగమనలార
చిత్తరువన్నెలు పెట్టి మీ రెంతయు నొసపరిబాగులఁ బూసఁగ నరిగి
జలజాప్తకులవార్ధిచంద్రు హరిశ్చంద్రు సద్భక్తిదర్శించి సంస్తుతించి
సంగీతవిద్యాప్రసంగము లొనరించి మృదుమనుకీర్తిసంపదలు నెఱపి
వివిధలాస్యక్రియాకళావిధులుచూపి, చేరి సంతోషితస్వాంతుఁ జేసి యతని
నడుగరానిపదార్థంబు లడిగి ధైర్య, హీనుఁ గావించి బొంకించి యేగుదెండు. 96

వ. అనుటయు వల్లె యని యప్పల్లవాధర లమ్మునివల్లభునకుం బ్రణమిల్లి వీడ్కొని
సముల్లాసంబున. 97

సీ. చైతన్య మొందినశాతమన్యవశిలానికురుంబసాలభంజిక లనంగ
సంపూర్ణపూర్ణిమాచంద్రాస్యలై సంచరించునీలోత్పలశ్రీ లనంగ
జంగమత్వముఁ గాంచి సౌభాగ్యవిస్ఫూర్తి నుతిఁ గన్నతాపింఛలతిక లనఁగఁ
బొలుపు దీపింపఁగఁ బ్రోది గావించినమకరకేతనునిధేనుక లనంగఁ
బదతులాకోటినినదసంపదలఁ గదిసి, గిలుకుమట్టెలచప్పుళ్లు గులుకరింపఁ
గలికిరాయంచకోదమలగతులసొబగు, నేలునొసపరినడకల నేగుదెంచి. 98

తే. దర్శనస్పర్శనములకుఁ దగరు మీరు, మీకుఁ గౌఁగిలి యిమ్మని మెలఁతలార
పలుక నాలుక లెట్లాడె భయములేక, తెలియ మీజాతియెంతబుద్ధియును నంత.
క. చూచిన మీయం దిప్పుడు, యాచకముద్రావిశేష మణుమాత్రంబుల్
దోఁచదు మీ రెక్కడిమా, యాచండాలాంగనలా మహోద్ధత మరయన్. 119
క. ఆయతకారుణ్యంబున, నీయపరాధంబులను సహించితి నిఁక న
న్యాయోక్తు లేమి పల్కినఁ, గోయుదు నాలుకలు మిమ్ముఁ గొంకక నలుకన్. 120
చ. అనుటయు నాసరోరుహదళాక్షు లొకింతయు శంక లేక యు
బ్బున మదగర్వము ల్వొదల భూపతి డగ్గఱి పెక్కుభంగులం
గనుఁగవ లార్చుచు న్వివిధకామవికారవిధానకృత్యము
ల్గానకొని చూపుచు న్మఱియుఁ గోరి యకారణహాస్యలీలలన్. 121
సీ. పారిఁబోరిఁ గింజల్కపుంజంబు లెగయఁ గేళీసరోజాతము ల్ద్రిప్పికొనుచుఁ
గడకంటిచూపుల బెడఁగొందువీనుల తొడవు లొయ్యనఁ జక్కఁద్రోచికొనుచు
దోర్మూలరోచులు ద్రుల్లిగింతలు వెట్టఁ దివుటమైఁ దుఱుములు దిద్దికొనుచు
నొసపరి బాగుగా నొసలఁ గస్తూరికాతిలకంబు లొయ్యనఁదీర్చికొనుచు
వలుదనునుగుబ్బచనుదోయి వెలికిఁదోఁప, జిలుగువలిపంపుఁబయ్యెద చెఱఁగు లొత్తి
పొసఁగ లేఁజెమటారంగ విసరికొనుచు, మసలు చుండిరి శృంగారమహిమ చెలఁగ.
క. ముద్దులు గురియుచు మురియుచు, నిద్దపుటద్దములలోన నీడలయొప్పుల్
పెద్దయుఁ జూచుచుఁ బైకొని, గద్దఱితనమున విలాసకళలు దొలంకన్. 123
ఉ. విందులు గాఁగఁ గర్ణపుటవీధులకుం బికనాదలక్ష్మికిం
బొందులు గాఁగఁ బల్లవికపుంగవమోదకశాభివృద్ధికిన్
మందులు గాఁగఁ జొక్కుచును మందమనోహరవిభ్రమంబులం
జిందులువాఱుచుం జిగురుచేతులఁ దాళము లొత్తి యాడుచున్. 124
తే. ధరణిపతి డాసి నరపాల తమకుఁ దామ, తివిరి మోహించి వచ్చినయువతిజనుల
రతులఁ దేల్పక పూని తిరస్కరించు, టరసి చూచినఁ గారాదు పురుషులకును. 125
ఉ. కావున మమ్ముఁ బ్రేమమునఁ గౌఁగిటఁ జేర్చి రతిప్రసంగలీ
లావిభవంబున న్బహుకళానిపుణత్వము మీఱ నన్యథా
భావము లుజ్జగించి నిరపాయసుఖస్థితిఁ బొందు రూపరే
ఖావిధుబింబ మన్మథునిగర్వము సర్వముఁ బాయునట్లుగన్. 126
క. అంభోజముఖులసమకుచ, కుంభంబులు రాయిడింపఁ గోరిక లలరన్
బుంభావరతుల నినుఁ గడు, సంభావించెదము మాకుఁ జనవీవలయున్. 127

వ. ఇవ్విధంబునఁ బాడిన నవ్వేలివాడచేడియలనిరుపమానగానవిశేషంబులకుఁ బరితోషం
బు నొంది హరిశ్చంద్రధరిత్రీవల్లభుం డుల్లంబున సంతసిల్లి వారల కనేకమణిమయా
భరణంబులు కురంగమదకర్పూరకాశ్మీరగంధసారతుషారనీరాదిసౌరభద్రవ్యంబులు
బ్రియం బెసంగ నొసంగి వీడ్కొలుపుటయుఁ జూచి మందహాసంబు చేసి యగ్గో
సంగిపడంతు లమ్మహీకాంతున కిట్లనిరి. 109

తే. ఈపదార్థంబు లేల ధాత్రీశ మాకు, వివిధభావజ్ఞమతకళావేది వీవు
బడలితిమి చాల నిబిడాతపంబుచేత, నీసితచ్ఛత్ర మొసఁగి మన్నింప వలయు. 110

చ. ధరణితలేశ నీగొడుగు దక్కఁగఁ దక్కినవస్తువు ల్వరం
బరలుగ నెవ్వి యిచ్చినను బర్వినతాపము పాయ నేర్చునే
పొరిఁబొరిఁ గాయు నెండఁ గడుఁ బొక్కె శరీరము వేడ్క మాయెడం
గరుణ వహింపఁగాఁదగు నఖండితదానకళాధురీణతన్. 111

క. అనుటయు నామాటలతలం, గనుఁగొని యుత్సాహ ముడిగి ఘనకోపముతో
మనుజాధీశ్వరుఁ డిట్లనుఁ, గనుఁగ్రేవలయందుఁ గెంపు గడలుకొనంగన్. 112

క. పుడమిపయిఁ దొల్లి యీగతి, నడిగినయాచకులు గలరె యనుచితమతి వీ
యెడఁదల నిబ్బరికింపక, గొడు గడుగుట యెట్లు కండక్రొవ్వున నన్నున్. 113

క. ప్రేమంబున యాచకులకుఁ, గామితవస్తువుల నొసఁగుకాలమునందున్
భూమీశుల కిడ రానివి, చామరయుగళంబు గొడుగుఁ జర్చింపఁగన్. 114

చ. కడు నభిలాష మీర లడుగంగఁ దలంచినచామరంబులున్
గొడుగును దక్కఁ దక్కినవి కోరుఁడు వస్తువు లెవ్వియైన నే
నెడపక యిత్తు నావుడు నహీనకుతూహల ముప్పతిల్ల న
ప్పడఁతులు పల్కి రిట్లనుచు భానుకులోద్భవుతోడఁ జయ్యనన్. 115

ఉ. శీతలవస్తుసంతతులచేత నడంపఁగ వచ్చుఁ గొంత యీ
యాతపతాపఖేదము ధరాధిప మన్మథబాణఘాతసం
జాతవియోగతాపమునఁ జాలఁ గృశత్వము నొందుమమ్ము స
త్కౌతుకలీల నీబిగువుఁగౌఁగిటఁ జేర్పు రతిప్రసంగతిన్. 116

వ. అనుటయుం గర్ణపుటంబులం గరంబులు చేర్చి యవ్విమలచరిత్రుండు శివస్మరణంబు
చేసి ప్రచండరోషంబునం జండాలబాలికలం జూచి మీర లర్థిముద్రాధారిణు లని
తిరస్కారంబు సేయ నేరక యూరకున్న నింగితం బెఱుంగక మదిరాపానవికారం
బున శరీరవిస్మృతిం బొంది విప్రలాపంబులు పల్కెద రని వెండియు నిట్లనియె.

నెక్కడిమాలెత లేతెంచి రీతాపసాశ్రమభూముల కనుచితంబు
చండాలబాలికాజనముల కిటువంటిచక్కఁదనం బెట్లు సంభవించె
విశ్వసింపంగఁ దగునె వివేకులకును, భూమిపాలక యిది గాధిపుత్రుకపట
కృత్య మింతయుఁ గాకున్న నిట్టియద్భు, తములు గలుగంగ నేర్చునే తలఁచిచూడ.

క. అపుడు వసిష్ఠమహాముని, విపులకృపాగరిమ బుద్ధి విలసిల్లంగా
నుపదేశించినపలుకులు, నృపవర తాఱ్కాణమయ్యె నిపు డిచ్చోటన్. 137

వ. అని పలుకుచుండ నమ్మాతంగకురంగలోచన లక్కడఁ దలంగి చని. 138

సీ. మురువేది వాడినమోముఁదామరలును గడునొప్పిపొందినకాయములును
గొప్పులు వీడి చిక్కులుపడ్డకురులును వీతరాగము లైనవాతెఱలును
జఘనమండలమున జాఱినచీరలు ఘన రక్తసంసిక్త కంచుకములు
కరఁగినయంగరాగములును మిగుల ఖండము లైనకర్ణతాటంకములును
బాష్పధారలఁ దోఁగినపయ్యెదలును, వ్రీలి ముక్తాఫలంబులు రాలుసరులు
కలసి నాదంబు లెడలినకంఠములును, గలిగి యత్యంతదైన్యంబు గ్రందుకొనఁగ. 139

క. త్రిజగత్పవిత్రు నవపం, కజనేత్రుఁ దపోవిశిష్టగాత్రు సముద్య
న్నిజతను తేజోవైభవ, విజితప్రాభాతమిత్రు విశ్వామిత్రున్. 140

చ. కని మునిచంద్ర యీధరణికాంతుఁడు మమ్ము మహోగ్రకోపియై
కినుక మనంబులో మిగులఁ గీల్కొనఁ దొత్తుల మొత్తుకైవడిం
గొనకొని మొత్తె సమ్మెటలఁ గొంకక నిర్దయవృత్తిఁ జేసి మొ
త్తినఁ గడునొచ్చి వచ్చితిమి దిక్కు దలంపఁగ నీవు నావుడున్. 141

శా. ఏమేమీ మిము భూవరాధముఁడు దా నెంతే నహంకారియై
భీమస్ఫూర్తిఁ గశాభిఘాతములచే బిట్టల్క నొప్పించె నే
యేమాడ్కి న్దరియించువాఁడొ యిఁక నూహింపంగఁ గల్పాంతవే
ళామృత్యుంజయఫాలనేత్రశిఖిలీలం బర్వుమత్కోపమున్. 142

వ. అని త్రిపురాసురవీరులపయిఁ గవియుఫాలలోచనుండునుం బోలె నాభీలరోషావేశంబునం గరకమలాత్తమాలిక నేలం బడవైచి కనత్కపిలాంగారశంక నంకురింపం జేయుదృగంతంబు లంతకంతకుం గెంపు లీనుచుండ సమీపవాసు లగుతాపసజనంబులమనంబులు తల్లడిల్లఁ బ్రచండదండంబు కేలం బూని జటాభారంబు దూలి యాడఁ గటిమండలంబున వల్కలాంబరంబులు వీడం బండ్లు గొఱుకుచుఁ బదంబులు దాటించుచుఁ జనుదెంచువిశ్వామిత్రుం గనుంగొని హరిశ్చంద్రుండు మృగేంద్రంబుఁ గనుంగొనినకరికలభంబుచందంబున నత్యంతభయంబును బొంది. 143

తే. మానవాధీశ యీలతామందిరంబు, రమ్యమైయున్న దిచ్చోటు రతివిహార
యోగ్య మీరీతిఁ దడయంగ నుచితమగునె, రమ్మువిరహానలమున కోర్వంగ లేము.

వ. అని యివ్విధంబునం బ్రేలుచు వాలుఁగంటులు మహీపాలుకేలు కేలం గీలింప నుద్యో
గించుటయుం నాలీలావతులతలం పెఱింగి నిలింపపతిప్రతిమానుం డగునబ్భూభుజుం
డాభరణంబు తాలిమిం దొఱఁగి యమ్మాలెతలమదం బుడిపెద నని దర్వీకరభీకరతర
కశాఘాతంబులం గాయంబులు జర్జరీభూతంబులు సేయం దొడంగినం గనుంగొని
యమాత్యపుంగవుం డగు సత్యకీర్తి కదియం జనుదెంచి కరసరోజంబు వట్టి సమ్మోటం
దొలంగం దిగిచి పో వైచి మనంబునం గారుణ్యంబు పూరించి నిలిచి. 129

మ. జననాథోత్తమ యాడువాండ్రపయి నీచందంబుగా నుగ్రతం
గినియం బాడియె శిక్ష కర్హులె వితర్కింప న్సరోజేక్షణల్
విను మీ వల్గిన దుర్మదోద్ధతమహావిద్వేషిరాజన్యసై
న్యనికాయంబులమీఁదఁ గాకఁ దగునే యన్యప్రదేశంబులన్. 130

క. త్రిదశేంద్రసదృశ నీ వీ, సుదతుల వారింపఁ బూనుచొప్పు దలంపన్
మదనాగ మరఁటికొదమల, విదళింపఁగఁ బూనునట్టివిధమై యుండున్. 131

సీ. ఈవెలందుకలపయ్యెద లభియాతి భూమీతలాధీశులకేతనములె
యీపంకజాక్షులయెలవంకబొమ లహంకారవద్వైరులకార్ముకములె
యీకీరవాణులకోకస్తనంబులు మత్తారిగిరిదుర్గమండలములె
యీరాజముఖులమృదూరుదండంబులు కపటవిద్వేషులకరికరములె
యీపడంతులకడకంటిచూపు లహిత, మనుజనాయకసునిశితమార్గణములె
వీరిఁ గోపింపఁ దగునె యుర్వీకళత్ర, కృప దలిర్పఁగఁ జూచి రక్షింపవలయు. 132

మ. వల దీరోషము మానుఁడీ తగదు నావాక్యంబు లాలింపుఁ డ
ర్థులఁ బ్రత్యర్థులరీతిఁ జూచిన మహాదోషంబు ప్రాపించు ను
జ్జ్వలకీర్తీశ్వర యాచకప్రకటరక్షాదక్ష యీవేళకున్
వలయు న్నామకశేముషీపథమున న్వర్తింప శాంతస్థితిన్. 133

తే. అనుచు హితబుద్ధి నుడివి ప్రియంబుమీఱ, శాంతుఁగావించి మరలించె సచివుఁ డధిప
నంకుశంబున నూఁదినయంత భద్ర, దంతి మరలించునట్టిచందము దలిర్ప. 134

క. తదనంతరంబ ప్రియము, స్పదమలవాగ్వృత్తి వెలయఁ జంద్రమతియుఁ బె
ల్లొదవెడుమతినైపుణమున, హృదయేశ్వరుమోము జూచి యిట్లనిపలికెన్. 135

సీ. ఎన్నఁడైనను వింటిమే మహీతలమునఁ గనకసారంగంబు గల దనంగ
నాయిట్టివెంబడి నడియాస నిచ్చోటి కేగుదెంచితిమి విహీనబుద్ధి

క. మాయాశ్రమసారంగముఁ, బాయక వెనువెంటఁ దగిలి బడలించుడు గ
ర్వాయత్తచిత్తమదమున, న్యాయంబా నీకు మద్వనంబు చొరంగన్. 153

చ. అలరులు రాల్చుచుం దలిరుటాకులు ద్రుంచుచుఁ బక్వమైనస
త్ఫలములు గోయుచు న్వివిధపాదపశాఖలు పట్టి యూఁచి ప
క్షులఁ బెదరంగఁ దోలుచు విశుద్ధసరోవరవారిపూరముల్
గలఁచుచు గాసి సేయుపలుగాకుల మాన్పవు నీదుభృత్యులన్. 154

వ. అదియునుం గాక. 155

మ. మరి నాపెంపుడుకూఁతులై వెలయునీమాతంగవామాక్షులం
గరిణీయానలఁ బల్లవాధరల రాకాచంద్రబింబాస్యలన్
సరసాలాపకళావిలాసవిధుల స్సంగీతచాతుర్యలం
గరుణాహీనతఁ బట్టి సమ్మెటల నల్కం గొట్టఁగాఁ బాడియే. 156

తే. ఆశ నర్థింప వచ్చినయట్టివారి, కీప్సితార్థంబు లిచ్చుట యెల్ల మాని
నెట్టుకొని బిట్టు వాపోవఁ గొట్టు పెట్లు, రాజ్యమదమున నన్నుఁ దిరస్కరించి.

క. వికసితశిరీషకోరక, సుకుమారశరీరసారశోభాన్వితలన్
మొకమాట మింత గలుగక, యకటా మోఁదంగఁ జేతు లాడెనె నీకున్. 158

ఉ. మామకరోషవహ్ని పలుమాఱును నుబ్బఁ దొడంగెఁ జేర్చి నీ
వేమెయి నింక నాయెదుర నెక్కడి కేగెదు దుర్మదాంధ యా
హైమవతీమనోరమణుఁ డడ్డము నిల్చిన నిల్చు సందియం
బేమియు లేదు పూని నిను నిప్పుడె ప్రాభవహీనుఁ జేసెదన్. 159

వ. అనిన నమ్మహీపతి సంవర్తసమయసమవర్తియుం బోలె మహోగ్రమూర్తియైయున్న యమ్మునిచక్రవర్తిం గనుంగొని తదీయతనుప్రభాపటలంబు మిఱుమిట్లుగొలుప భయభ్రాంతుండై యేమియుం బలుక నేరక నివ్వెఱపడి యూరకయున్న నాభూమింజయుం జేరి మనస్తాపంబు మాన్పి హితోపదేశంబు చేయం దలంచి నిత్యసత్యవివేకవర్తి యగుసత్యకీర్తి యిట్లనియె. 160

సీ. మనుజేశ నీవు మూఢునిరీతి నిట్లేల మిన్నక భ్రమఁ బొంది యున్నవాఁడ
వాపద ప్రాపించునప్పుడు ధైర్యంబు విడువక మిగుల వివేకబుద్ధిఁ
దెలివిమై మెలఁగంగవలయు మానుషమున దైవిక మటమీఁదఁ దప్ప దెపుడుఁ
గావున నిమ్మౌనికంఠీరవముఁ జేరి ప్రార్థింపు మే నపరాధి ననుచుఁ
గాలకూటవిషాగ్నులఁ గడచు నితని, భీషణంబైనదుర్వారరోషవహ్ని
యితనిపే ర్విన్నఁ దలఁకుదు రేమిచెప్ప, హరివిరించిపురందరాద్యమరులైన. 161

ఉ. మనసామ్రాజ్యవిభూతు లెల్ల నిఁక నిమ్మౌనీంద్రుచేఁ జాల నా
శనముం బొందకయుండునే యని మనస్తాపంబు దీపింప నె
య్యన భార్యాయుతుఁడై యెదుర్కొనుచు సాష్టాంగంబు దండంబు పె
ట్టినఁ గోపంబునఁ దన్నె భూరమణుకోటీరంబు బీరంబునన్. 144

ఉ. తన్నిన మానసాబ్జమున ధైర్య మొకింతయు జాఱ నీక య
త్యున్నతభక్తితో వినయ ముబ్బఁగ వెండియు మ్రొక్కి తెల్విమై
నన్నరనాథపుంగవుఁడు హస్తసరోజయుగంబు మోడ్చి యు
ద్యన్నవభాను తేజుఁ డగు తాపసకుంజరుఁ జూచి యిట్లనున్. 145

చ. అనఘచరిత్ర మీమృదుపదాబ్జము మామకరత్నయుక్తకాం
చనమకుటంబుతో నొరసి చాలఁగ నొప్పి వహించె నే నొన
ర్చినయపరాధ మేది యిటు సేయఁగ నానతి యిందు నావుడున్
మునికులముఖ్యుఁ డిట్లనియె మోమరుణాంబుజకాంతి నీనఁగన్. 146

శా. ఓరీ రాజకులాధమా నృపులు లేరో వేఁట రారో మద
క్రూరాభీలమృగాదులం దునుమరో ఘోరాటవు ల్లేవొ మా
యారామంబుఁ గలంచి జంతుతతి మాయంజేసి యస్మత్కుమా
రీరత్నంబులు వేఁడ వచ్చినను వారి న్మోఁదిసా వేమిరా. 147

క. ఒకపాద మనఁగ నేటికి, సకలాంగంబులును నొచ్చె సాహసవృత్తిన్
మొక మోడక నీచేసిన, సకుటిలకృత్యములు మాకుఁ జర్చింపంగన్. 148

క. ధరణీశ చంకదుడ్డును, శరణార్థియు నసెడుమాట సరివచ్చె మునీ
శ్వరబాధక మగునీదు, శ్చరితము పరికింప మిగులసాహసి వరయన్. 149

చ. ఇలఁ గలరాజు లెల్ల భజియింప మహోన్నతిఁ జక్రవర్తివై
యలరుట యెల్లఁ దాపసజనాశ్రమభూముల కెగ్గుసేఁతకే
తులువ భవద్వివేక మతిదుర్నయ మారయ నివ్విధంబునన్
మెలఁగఁగ నీకు నెవ్వఁడు సమిద్ధమతిన్ సెల విచ్చెఁ జెప్పుమా. 150

ఆ. అసిమిలోని దొకటి యమ్మెడి దొక్కటి, నీచరిత్ర మెల్ల నేఁడు తెలియ
వచ్చెమాకుఁ గపటవర్తనుఁడవు నీవు, చేరి నిన్ను విశ్వసింపఁ జనునె. 151

చ. నృపతులు తొంటివారలు విజృంభణలీలఁ జమూసమేతులై
విపినముల న్వినోదగతి వేఁటమెయిం జరియించుచుండరే
తపసులయాశ్రమంబులకుఁ దద్దయు నీవలె నిష్ఠురక్రియం
గృప హృదయంబులో వదలి కీడు దలంపరు గాక యెన్నఁడున్. 152

తే. నీవు చేసినదోషంబు నీక యుండె, దీర్ఘరోషంబు మాకు సాధింప నేల
మొగమునం దున్న నీదైన్యముద్రఁ జూచి, కరుణ జనియించెఁ గాంచితి ధరణినాథ.

క. ఘనుఁడ వగుకతన నీచే, సినదుండగములు సహించి చేపట్టితి నే
మనుజేశ యింక నాచె, ప్పినవాక్యం బొకటి సేయు ప్రియము దలిర్పన్. 173

ఉ. శ్రోణితలేశ నాయనుఁగుఁగూఁతుల వర్ణన సేయ నొప్పన
ప్రాణసిపుష్పబోఁడులను బల్లవపాణులఁ జారుసైకత
శ్రోణులఁ గీరవాణుల మరున్మణివేణుల సర్వలోకక
ల్యాణుల నీకు నిచ్చెదఁ బ్రియంబున వారిఁ బరిగ్రహింపుమా. 174

క. నాపలు కుల్లంఘింపక, భూపాలక వారిఁ బ్రీతి భోగినులను గాఁ
జేపట్టి మమత నేలినఁ, గాపట్యము లేక నిన్నుఁ గాచెద నెపుడున్. 175

తే. సూర్యకులవర్య నీమనఃస్థైర్య మెఱుఁగ, వలసి యూరకఁ బలికినపలుకు గాదు
మాకు నానంద మొదవ నమ్మానవతుల, నాదరక్రియఁ దగఁ బెండ్లియాడ వలయు.

వ. అని యివ్విధంబునం బలుకునమ్మునీంద్రువాక్యంబు లమ్మహీశు కర్ణపుటంబులకు నసహ్యం
బు లగుటయు నమ్మహీవల్లభుం డుల్లంబునఁ దల్లడిల్లి డిల్లపడి యెల్లవిధంబులఁ గ
పటకృత్యంబులు గల్పించి యక్కల్లరి తపసి చేయునుపద్రవంబులా పాదింపక నిన్నె
లవు దొలంగి పోవనీయండేఁ గాంచినదుస్స్వప్నఫలంబు మిన్నకఁ దొలంగునే యని
కౌశికునిం గనుంగొని. 177

తే. క్షత్రియత్వంబు వర్జించి సంయమీంద్ర, తగునె నాకిప్పు డీమాలెతల వరింప
నంటఁ గా రానియన్వయం బకటయెట్లు, తెలియ కీమాట మీ రానతిచ్చితి రిట.

సీ. అనిన విశ్వామిత్రుఁ డవనీకళత్రునిఁ గినుక జనింప వీక్షించి పలికె
వివరించి చూడ భూవిభులకుఁ దప్పవు ఘనతరనిరయదుఃఖములు ధరణి
నాథ రాజ్యాంతాని నరకాణి యని పల్కు-సలలితస్మృతివాక్యసరణి వినవె
కావున నాయాజ్ఞ నీవెలివాడలేఁజిగురాకుబోఁడులఁ దగ వరించి
పూజ్యసామ్రాజ్యసౌఖ్యసంభోగమహిమ, చెందుటయ బుద్ధి దీనికిఁ జింత యేల
నెమ్మిఁ బరలోకసౌఖ్యంబు నమ్మి నేఁడు, దొరకులాభంబు విడుచు వేఁదుఱు నుగలఁడె.

ఉ. నేరవు సౌఖ్య మొందఁ ధరణీప యజీర్ణముఁ బొందునంచు నా
హారము మాని పిల్లాదవునాఁకటిచేఁ గృశుఁడై చరించుటల్
సారవివేకమే తలఁపఁ జయ్యన నీ యెలదీఁగబోఁడులన్
గౌరవలీలఁ గైకొనుము కాదు సుమీ మఱి సంశయింపఁగన్. 180

క. త్రాసుపయిం దూంచి చూచిన, వాసుకికంకణుని కెత్తువచ్చు నితం డో
వాసరవల్లభవంశజ, యీసంయమిం బోలం గలరె యెచ్చోం దపసుల్. 162

మ. కరుణాపాంగనిరీక్షణస్ఫురణ నీ గాధేయుం డొక్కింత యా
దరవృత్తిం గనుంగొన్న యంతటన మోదం బారం గల్యాణముల్
దొరకుణ్ మానవలోకసంతతికి నస్తోకప్రభావుండు భూ
వర యీపుణ్యుండ యగ్రగణ్యుం డరయ న్వాచంయమశ్రేణికిన్. 163

ఉ. నావుడుం దెల్విం బొంది నరనాథశిఖామణి ప్రేమ హస్తరా
జీవయుగంబు మోడ్చి మునిశేఖరుం గన్గొని యోమహాత్మ నన్
గావం గదయ్య నావలనం గల్గిన నేరము లెల్ల మాటికిన్
భావములోం దలంపక యపారకృపారసమానసుండవై. 164

క. మీకినుక కెదిరి నిల్వంగ, నాకుం దరం బగునె త్రిభువనస్తుత శశిరే
ఖాకల్పశేషతల్పులు, నాకంపము నొంది భయము నందుదు రనినన్. 165

తే. తనయుం డజ్ఞానియై చేయుతప్పు లెల్లం, గన్నతండ్రికి లోంగొని కరుణం గావం
జనదె యిటు తూంటికూరకుం జంద్రహాస, మెత్తుదురె యేల నామీంద నింతకినుక.

తే. మూఢమతిం జెంది యపరాధములు గడంగి, నే నొనర్చితిం జాల నజ్ఞాని నగుచు
వానినన్నిటి లోంగొని వత్సలత న, నుగ్రహింపుము మౌనిజనాగ్రగణ్య. 167

శా. మీకోపం బనుశేషపన్నగము నామీంద న్వడి న్రాంగ నో
కారుణ్యాత్మక నే మహాభయమునం గంపించుచున్నాండ నన్
జేర న్రమ్మని నమ్మం బల్కి తలపైం జే చేర్చి యూరార్చి నా
నేరంబు ల్హృదయంబులో నిడక మన్నింపం గదే మ్రొక్కెదన్. 168

తే. పూని శరణంబు వేండెడువాని నెట్టి, దుష్టశాత్రవు నైన నోశిష్టవర్య
యెగ్గు లెన్నక మతిభయం బెల్లనుడిపి, ప్రోచుటయ యుత్తమంబు కారుణ్యమతిని.

తే. తాపసోత్తమ నీదుచిత్తంబు నాదు, భాగ్య మింద్రాదిదేవతాప్రణుతిం గన్న
నిన్ను శరణంబు వేండెద నీళ్ళముంపు, పాలముంపుము వేయును బల్కనేల. 170

వ. అని హరిశ్చంద్రుండు సుతసతీసమేతుండై మహీతలంబునం జాగిలి దండప్రణామం బు లతిప్రేమం గావించి లేవక దీనభాషణంబుల నన్యథా శరణం నాస్తి త్వమేవశరణం మమ యనుచుం బ్రార్థింపం గొంతసేపునకు నమ్మునిదంతావళం బొక్కింతదయ నిజస్వాంతంబునం గీలుకొల్పి శాంతభావంబు వహించుచు నారాజశేఖరుమహానుభావంబు మదిలో మెచ్చుచు నతనిశిరంబు కరంబున నెత్తి లే లెమ్మని యిట్లనియె.

సీ. ఇనవంశ మున్ను నీ విచ్చెద నని పల్కి జాఱ నాడఁగ నీకుఁ జను నె యిపుడు
మిన్నకఁ జన నియ్య నిన్ను మిథ్యాలాపశీలతారతుఁ గాఁగఁ జేసి కాని
మృషలు పల్కితి నాస్తి మీ రేగుఁ డనినను బోయెద మాటలు వేయు నేల
యని పల్కుచుండంగ నావేళఁ జంద్రమతీకాంత భూకాంతుదిక్కు చూచి
తపసి గావించు కపటకృత్యంబు లెడి, యురులఁ దగిలితి మిఁక నేలయొండు తలఁపు
లేమి పలుకంగఁ జూచిన భూమిరమణ, బొంకు దొరయని ధైర్యంబు పూనవలయు.

క. మీ రిఁక నేమియుఁ బలుకక, ధారుణియంతయును గాధితనయున కిచటన్
ధారాపూర్వకముగ నని, వారితమతి దాన మిండు వసుధాధీశా. 192

క. మితభాషణుండు సంభృత, వితతార్థచయుండు నగుట వివరింపఁగ సూ
నృతసంపదయును వితరణ, చతురతయును గోరి కాదె సజ్జనుఁ డెందున్. 193

చ. మును ధర యేలి చన్న నృపముఖ్యు లనేకులు చర్చ చేసినన్
జనవర వారిలోన విలసన్మతిపారగు లెవ్వ రైన సొం
పునఁ దమ వెంట మంటిమొస మోపఁగఁ జాలినయంత మేరయుం
గొని చనిరే ధరాతలము కొంకకు మీ యిల దాన మిచ్చుచోన్. 194

క. భూమితల మెల్ల మాయా, వామనవటుమూర్తి యైనవనజాక్షునకుం
బ్రేమంబున బలి యొసఁగఁడె, యామరతరువితరణక్రియాదీపితుఁ డై. 195

ఉ. దీనిధి యైనవిప్రున కతిప్రియలీల ధరిత్రి యొక్కెడన్
జేనెఁడు మేర యిచ్చినఁ బ్రసిద్ధయశస్స్థితి వాఁడు పూని యం
భోనిధివేష్టితక్షితి విభుత్వము మీఱఁగఁ దాన యేలు భూ
దానముఁ బోల లేవు మఱిదానము లెవ్వియు మానవేశ్వరా. 196

క. దశదానంబులలోపల, విశదాధికమహిమ నొప్పు వేల్పులలోనం
బశుపతిగతి భూదానము, వశమే తత్ఫలము తెలిసి వర్ణింపంగన్. 197

క. వసుధేశ పాత్రదానం, బొసఁగంగా గలిగె మీకు నుర్వీచక్రం
బసదృశవితరణమహిమం, బెసఁగంగా ధారఁబోయుఁ డెలమి దలిర్పన్. 198

వ. అని నిజహృదయానుకూలంబును నఖిలభువనభరితయశోమూలంబును నిత్యసత్యాలవాలంబును గాఁ బలుకు నన్నీలవేణివాక్యంబు లాకర్ణించి యమ్మహీకాంతుండు సంతోషితస్వాంతుం డై. 199

క. ఆహా యీసతిపిహిత, వ్యాహారము లెంత యొప్పె ననుకూలవరా
రోహలు గలిగినఁ బతులకు, నూహింప నలభ్యవస్తు వొకటియుఁ గలదే. 200

క. తనచేయుధర్మమునకును, మనమున వేఱొండుతలఁపు మాని ప్రమోదం
బొనఁగూడ మెలఁగ నేర్చిన, తనుమధ్యయె వానిపాలి దైవం బరయన్. 201

తే. పసిఁడిమేడలలోనఁ బూఁబాన్పులందుఁ, బొసఁగ నీయిందువదనలఁ బొంది తేని
బొందితోడనె జంభారిపురికి ననుతు, ననఘువర్తనుఁ డగుభవజ్జనకునట్లు. 181

తే. అనిన మనుజేంద్రుఁ డిట్లను మునివరేణ్య, మత్కులాచార మెడలి యామానవతులఁ
గూడి యుండుట వివరింప నోడ విడిచి, వదరు పట్టినయట్లపో త్రిదశవంద్య. 182

తే. కులము దిగఁదాఁచి యీమాలెతల వరించి, కాంచుగీర్వాణలోకసౌఖ్యంబు లొల్లఁ
బంతమున రాజ్యమైన వర్జింతుఁ గాని, చలము కొని యెన్ని చెప్పినఁ గులము విడువ.

సీ. అనిన భూవర యట్ల యగుఁగాక నీ కింకఁ దిరుగనాడిన మహాదేవు నాన
నీసర్వరాజ్యంబు నేఁటితో వర్జించి తడయక మా కిమ్ము ధార వోసి
సామ్రాజ్యసంభోగసౌఖ్యంబు మాకోర్కి నీకారణంబున నేఁడు దొరకె
గరిమఁ దోరణములఁ గట్టి నంతేవాసిజనులఁ బంప వలయు సంతసమున
వసుధ ప్రజలకుఁ దగ నానవాలుగాఁగ, నెలమి నీయంగుళీయక మిచ్చి పనుపు
మాయురైశ్వర్యపుత్రపౌత్రాభివృద్ధిఁ, బొందు మాచంద్రతారకస్ఫురణ వెలయ. 184

వ. అనుటయు నవ్విశ్వామిత్రునకు విశ్వంభరాకళత్రుం డిట్లనియె. 185

మ. తగ మీయానతి సేయుకంటెను బ్రశస్తంబైనపుణ్యంబు లీ
జగతిం గల్గునె నాకు బంధురతపస్సామ్రాజ్యసింహాసనం
బు గురుప్రాభవలీల నెక్కి మిగులం బొల్పొంది బ్రహ్మర్షివై
దిగధీశస్తుతకీర్తిఁ గాంచినమహాతేజస్వి వీ వారయన్. 186

క. మీకోర్కి సలుపఁ గలుగుట, శ్రీకరబహుపుణ్యగణ్యచిరతరలక్ష్మిన్
జేకొనుటగాదె మునివర, యాకల్పము గాన నేఁ గృతార్థుఁడ నైతిన్. 187

ఉ. శ్రీలు దలర్చుచుండ మునిశేఖర మొన్నటిదాఁక మున్ను మీ
రేలినభూమి గాదె యిది యిమ్మని నన్నన నేల క్రమ్మఱం
బాలన మాచరింప మతిఁ బాయక వాంఛ జనించెనేని భూ
పాలలనామనోరమణసన్నిభ గైకొనుఁ డెల్లరాజ్యమున్. 188

తే. తెల్లముగ మన్మనశ్శుద్ధిఁ దెలి ఁ గోరి, పలికెదరుగాక మీకేమి ప్రాఁతి యస్థి
రంబులైనట్టియీమహీరాజ్యసుఖము, లనిన ధరణీశుఁ జూచి యమ్మునివరుండు.

మ. సెలవింబాఱఁగ నవ్వుచుం బలికె నాశ్లేషించి యీ నేర్పుమా
టలు మాముందఱ సాఁగిరావు పెఱచోటంగాని భూపాల రా
జులలోన న్నిను సత్యవాఙ్నియతుఁ డంచుం జెప్పఁగా ముజ్జగం
బులయందు న్వినుచుందు మప్పలుకు దాఁ బొంకయ్యె నీపట్టునన్. 19

# హరిశ్చంద్రోపాఖ్యానము.

## తృతీయాశ్వాసము.

క. శ్రీమహనీయప్రాభవ, హేమాచలరాజధైర్య హితబంధుజన
స్తోమామరధాత్రీరుహ, భామాజనపుష్పభల్ల బాచయయెల్లా. 1

వ. ఆకర్ణింపు మప్పాండవాగ్రజునకు మార్కండేయుం డిట్లనియె. 2

క. ఆపగిదిం గొనియాడి మ, హీపతి వీడ్కొనుచు మునికులేశ్వరుఁ డరిగెన్
భూపాలకమణియు నయో, ధ్యాపురమున కేగి సముచితస్థితి నుండెన్. 3

ఉ. ఆమఱునాఁడు కౌశికమహామునియుం గృతకాల్యకృత్యుఁడై
ప్రేమ దలిర్ప శిష్యజనబృందము గొల్వ వసుంధరాధిప
గ్రామణి పూని బొంక సమకట్టునుపాయము నాత్మలోపలన్
వేమఱు నుగ్గడించుచును వేడ్క నయోధ్యకు వచ్చెఁ జెచ్చెరన్. 4

సీ. వచ్చి సర్వంసహావరుఁ గాంచి దీవింప నత్యంతభయకంపితాంగుఁ డగుచు
గద్దియ డిగ్గి భూకాంతుండు సాష్టాంగదండప్రణామంబు తగ నొనర్చి
మణికుంభపూర్ణనిర్మలజలంబుల నర్ఘ్యపాద్యాదు లిడి మధుపర్క మొసఁగి
సకలవైభవముల సామ్రాజ్యసింహాసనాసీనుఁ గావించి యాక్షణంబ
సచివసామంతకింకరజనులఁ బ్రజల, వేగ రావించి వారితో విశదవాక్య
సరణిఁ గౌశికునకు మహీచక్ర మెల్ల, ధారవోసినమార్గ మంతయును జెప్పి. 5

క. లోకముల కెల్ల నేలిక, యీకౌశికమౌనివర్యుఁ డీతనిపదనా
ళీకములు గొల్చి యుండుఁడు, ప్రాకటతాత్పర్యవినయభక్తులు పొదలన్. 6

తే. సుతసతీయుక్తముగ నేను ధృతి దలిర్ప, విపినభూముల కేగెద వేడ్క ననిన
నధికశోకార్తులై వార లవనిభర్త, నడుగుఁదమ్ముల కెరఁగి యిట్లనిరి బెదరి. 7

ఉ. సల్లలితప్రతాప ఘనసత్యవచోరచనాకలాప మీ
చల్లఁదనంబునం బ్రదికి సమ్మద మొందఁగ నేటిదాఁక నే

వ. అని పలికి తూర్ణంబుగ సువర్ణకలశంబులఁ బావనజలంబులు దెప్పించి దేవబ్రాహ్మణ క్షేత్రంబులు దక్కఁ దక్కినధాత్రీతలంబు సర్వంబును నుమామహేశ్వరప్రీతిగా మీకు సమర్పించితి నని యేర్పడం బ్రియపూర్వకంబుగాఁ గౌశికునకు ధారవోసె నయ్యవసరంబున. 202

సీ. సారసౌరభముల సకలదిక్కులయందుఁ గురిసెను మందారకుసుమవృష్టి
దివి నాదితేయవాదిత్రనిర్ఘోషము లగ్గణసౌఖ్యంబులు గాఁగఁ బ్రబలె
గంధర్వగానముఖ్యక్రియాసహితంబు లప్సరోనృత్తంబు లతిశయిల్లె
నింక సరుంధతీహృదయేశుఁడె జయించు నని నభోవాణివాక్యములు చెలఁగె
నపుడు గాధిసుతుండు ధరాధినాథుఁ, జిత్తసమ్మద మెదవ నాశీర్వదించి
వినుతిఁ గావించె దుగ్ధాబ్ధివీచికాస, మానవాచాపరంపరామహిమ వెలయ. 203

వ. అనిన విని కౌంతేయాగ్రజుం డట మీఁదివృత్తాంతం బెఱింగింపు మనుటయు. 204

మ. కరహాటాంధ్రకళింగవంగరమణీకందర్ప పాంచాలబ
ర్బరహంసీగమనాలతాంతశర సౌరాష్ట్రాంగకాంభోజఘూ
ర్జరసౌవీరవిదర్భకోసలపయోజాతాననాదర్పకా
కురుకాశ్మీరమరాటలాటవిలసత్కోకస్తనీమన్మథా. 205

క. మందరపర్వతధీర పు, రందరవిభవాభిరామ రతిరమణాకన
త్సుందరకైలాసశర, త్కంధరసంకాశ విమలకమనీయయశా. 206

స్రగ్విణీ. లింగమాఃబాసుతా లేలిహానైకపా
దాంగదధ్యానలీనాత్మ గాంగేయగ
ర్భాంగనానర్తకీహారిజిహ్వాస్థలీ
రంగ సారంగదృగ్రాజిమీనధ్వజా. 207

గద్యము. ఇది శ్రీమదాపస్తంబసూత్రపవిత్ర కౌండిన్యమునిచక్రవర్తిగోత్ర సకల
సుకవిజనానీకమిత్ర దేచనామాత్యకుమార వినయవివేకవిద్యాలం
కార శంకరకవినామధేయప్రణీతం బయినహరిశ్చంద్రో
పాఖ్యానం బనుమహాప్రబంధంబునందుఁ
ద్వి తీ యా శ్వా స ము.

—ooo—

మావిత్త మీయక పోవంగఁ జూచెద విది వివేకములోనిదే తలంప
ధరణీశ మఱచినఁ దలఁపింప వలదె యన్యద్రవ్యమునకు దురాశ యేల
ఋణము దీర్పక యుండుట గుణము కాదు, మంచివారికి మది వివేకించి చూడ
నందులోపల మిగుల బ్రాహ్మణులసొమ్ము, నపహరించినఁ బ్రాపించు నత్యఘంబు 17

క. భూవల్లభ మును ధరణీ, దేవున కొడఁబడినస్వాపతేయము పిదపన్
వేవేగ నీక యంకిలి, గావించినఁ దలఁపరానికలుషము లొదవున్. 18

తే. ఎఱుఁగ కొదవించె నేనియు నినకులేశ, విప్రదత్తాపహరణ ముర్వీశ్వరునకుఁ
జాలఁ గల్మష మొదవు సంశయము లేదు, మఱచి సర్పంబుఁ బట్టినఁ గఱవ కున్నె.

చ. అనిన నృపాలుఁ డమ్మునికులాగ్రణి పల్కెడుక్రూరవాక్యముల్
విని కర ముల్కి యాత్మఁగడు వేదన నొందుచు నోమహాత్మ మ
ద్ఘనతరరాజ్యసంపదలు దాఁచక సర్వము నీకు నిచ్చితిన్
దనివి వహింప కిట్టుఁ దగునా యపరాధము లెన్న మాటికిన్. 20

చ. ఉడుపతివంశమౌళిమూర్తి వని యొండుదలంపులు మానిభక్తినీ
యడుగులు గొల్చి కీర్తిమహిమాఢ్యుఁడ నయ్యెద నంచు నున్న నా
యెడ హృదయంబులోఁ గృప వహించి తపోధనవర్య సారెకుం
బెడదలు చుట్టి యప్పుఁ బయిఁ బెట్టక యింతటఁ దృప్తిఁ బొందుమీ. 21

వ. అనిన బాలకురంగంబు నాలోకించు నాఖిలశార్దూలంబునుంబోలెనమ్మునిశార్దూలంబు
రోషాకారంబు వహించి హుమ్మని యదలించి యిట్లనియె. 22

తే. నెయ్యమునఁ దొల్లి నీవు మా కియ్యకొనిన, ధనము వేఁడిన నిట్లాడఁ దగునె నీకు
సత్యవాచాధురీణత జరపె దేని, విత్తమంతయుఁ దెచ్చి వేవేగ నిమ్ము. 23

క. ఇలఁ బూర్వద్రవ్యమునకు, నెలవుగ నిచ్చితివె నిజము చెప్పుము నీమా
టలు నేటిదాఁక నన్నృతం, బులు పొరయవు నేఁ డిదేల బొంకఁగ నీకున్. 24

చ. అనుటయు మేదినీరమణుఁ డామునివర్యుతలం పెఱింగి నె
మ్మనమున ధైర్యసంపదలు మాటికిఁ బాదుకొనంగఁ జేరి వం
దన మొనరించి యోమునిజనస్తుత యిప్పుడు జోకఁ జేసి మీ
ధన మొసఁగంగ లేనిపరితాపమునన్ మిము నిట్లు పల్కితిన్. 25

క. సంశయ మేటికి నోముని, వంశాగ్రణి యిచ్చెదన్ భవద్విత్తము నేఁ
ద్రింశద్వాసరముల కహి, మాంశుఁడు చంద్రుండు సాక్షి య ట్లీకున్నన్. 26

సీ. కొంచక మము విక్రయించి నైనను మీధనంబుఁ గైకొనుఁడు సర్వంబు ననిన
నట్లుకా కని మానవాధీశు వీడ్కొని యరిగి సత్వరగతి మరలి వచ్చి

మెల్లమనోరథంబులు నహీనతఁ గల్గఁగ సౌఖ్యవృత్తిమైఁ
దల్లియుఁ గుఁబిడ్డలవిధంబున నుంటిమి యేపు చూపుచున్. 8

క. దారుణశార్దూలమునను, సారంగము లట్టి మము విచారింపక యీ
క్రూరునకు నప్పగింపఁగ, నేరూపున బుద్ధి పుట్టెఁ గృప వదలి నృపా. 9

సీ. రుచిరాగ్రపల్లవారుణజటాపటలంబొ పొలుపొందుభసితత్రిపుండ్రకంబొ
లాలితరుద్రాక్షమాలికాజాలంబొ హరిసారంగచర్మాంబరంబొ
సురుచిరస్ఫటికాక్షసూత్రవితానంబొ మండితదండకమండలువులొ
మహనీయజపహోమమంత్రతంత్రంబులో తరుణదర్భాంకురస్తబకచయమొ
తపమొ సంతతమౌనముద్రావ్రతంబొ, కందమూలంబులో వ్రతోపకరణచయమొ
యడవులనె పాయకుండుసంయముల కేల, వసుమతీనాధసామ్రాజ్యవైభవములు. 10

ఆ. ఇతనిచిత్తవృత్తి నెఱిఁగి మే మేరీతిఁ, గొలుచువార మధికకోపి యితఁడు
మిహిరకులవరేణ్య మీ వెంటఁ దోడ్కొని, యరుగ వలయు మమ్ముఁ గరుణ ననిన. 11

ఉ. తోయజగర్భుతోడఁ దులఁదూఁగఁగ నొప్పెడుపుణ్యమూర్తిగా
ధేయుఁడు మీర లీతనియుదీర్ణమహత్త్వ మెఱుంగ లేరు గాం
గేయవసుంధరాధరము గెంటిన గెంటు నమర్త్యసన్నుతా
మేయతపఃప్రభావమున మిక్కిలి మేటి మునీంద్రకోటిలోన్. 12

తే. బ్రతుకవలసినఁ బ్రతికూలభాష లుడిగి, నాదునుడివినడువున నడవుఁ డనుచు
నుచితభంగుల వారల నూఱడించి, మనుజనాథుండు మునిశిఖామణికి మ్రొక్కి. 13

చ. వినయముతోడ భూప్రజలు వేయివిధంబుల సేవ సేయఁగా
మునికులముఖ్య వైభవసమున్నతి రాజ్యము సేయుఁ డింక నేఁ
జనియెద నన్న లేనగవు సారెకు నాననపంకజంబునన్
జననము నొంద నిట్లనియె సంయమివర్యుఁ డవార్యవైఖరిన్. 14

చ. ఇలకు నధీశ్వరత్వము వహించిననాకు ధరించు టొప్పుఁ గా
నలబడి నేఁగు మీ కివి యనర్హము లేటికిఁ దాల్ప నిందు ని
ర్మలమతి నంచు నాత్మ ననుమానము లేక తదీయరత్నభూ
షలు నిఖిలంబు గైకొనియెఁ జయ్యన నిర్దయచిత్తవృత్తియై. 15

తే. కైకొనినఁ దాల్మిచెలఁగ భూకాంతుఁ డపుడు, సుతసతీయుక్తుఁడై గాధినూనుపాద
పద్మయుగళికి మతియును భక్తి మ్రొక్కి, పురము వెల్వడి యల్లన నరుగ నెడను.

సీ. త్వరితంబ నృపుఁ గూడఁ బఱతెంచి యల్లన నలుకజనింప సంయమివరేణ్యుఁ
డలనాఁడు నిను మేము యజ్ఞార్థ మడిగినధనము నీయొద్దనే యునిచి సార

చ. మునివరుఁడుం దినేశకులముఖ్యునినిర్మలచిత్తశుద్ధికిన్
మనమున బాపురే యనుచు మస్తక మూఁచుచుఁ దా నయోధ్యకుం
జని నయమార్గశీలతఁ బ్రజాపరిపాలన మాచరింప స
జ్జనవినుతు సత్యకీర్తిఁ బ్రియసంగతితో నియమించి చయ్యనన్. 35

వ. పురంబు వెడలి యదృశ్యాకారుండై ధారుణీశ్వరువెనువెంటఁ దగిలి చనుచు నతం డరుగుతెరువున నతిదుర్గమంబుగా భీషణపాషాణకంటకానేకవల్మీకతరుపుంజంబులు నిర్మించియు నెట్టుకొని తీవ్రాతపంబు గాయునట్లుగా నుష్ణకిరణునిఁ గట్టడచేసియు వాపీకూపతటాకపద్మాకరతరంగిణీహ్రదవ్రాతంబులు శుష్కీభూతంబులు గావించియు దుస్తరక్షుధాతురత్వంబును జెంది వన్యంబు లగుఫలంబులు గొని భక్షింపంబోయిన నత్యంతతిక్తంబుగాఁ జేసియు నిరంతరభయంకరంబులుగా దుష్టమృగసముత్కారంబులఁ గల్పించియు నిర్దయస్వాంతుండై బహువిధంబు లగునంతరాయంబు లొనర్చుచుండె నయ్యవసరంబున. 36

సీ. వదలి క్రొమ్ముడివీడి వాడి మాల్యంబులు వేమాఱు మూపుపై వ్రేలియాఁడ
నీరము ల్దూఱుచో నెడలేమి నుత్తరీయాంచలములు కంటకావృతముగ
ఘనతరాతపముచేఁ గందినమైదీఁగ నవిరళఘర్మబిందువులు బొడమ
సోనలై సాంజనాశ్రుజలపూరంబులు పాలిండ్లపై దిగి పాఱుచుండ
నందనునిఁ జంక నిడుకొని నడచినడచి, యలసి యడుగొకయామమై యరుగుదెంచు
చంద్రమతిఁ జూచి యాహరిశ్చంద్రనృపతి, యుల్లమునఁ జింత యెంతయు నుప్పతిల్ల.

సీ. భాసురమణిమయప్రాసాదనిశ్రేణు లెక్కంగ నోప దీయిందువదన
కోమలశశికాంతకుట్టిమస్థలములు మెట్టంగ నోప దీమెఱుఁగుఁబోఁడి
మందిరారామసీమాసమీపంబుల విహరింప నోప దీవిద్రుమోష్ఠి
పోషితనవకీరపోతంబుఁ గెంగేల ధరియింప నోప దీహరిణనయన
నగము లేరీతి నారోహణంబుఁ జేసి, మొనసి యేమాడ్కి గమనించి మొరపనేల
భయదకాంతారభూము లెబ్బంగిఁ దఱిసి, కొడుకు నేచందమున నెత్తుకొనియువచ్చె.

సీ. తుమ్మెదగమి గెల్చుధమ్మిల్లబంధంబు చెదరి కుంతలములు చిక్కువడియె
శశిబింబకాంతికి సదనమై కనుపట్టువదనపద్మము వసివాళ్లువాడె
క్రొక్కారుమెఱుఁగుఁ గైకొననితనూవల్లి నిబిడాతపంబుచే సొబగు దూలె
కెందమ్మిపూవుల గెలువంగనూహించుమృదుపాదతలములు మిగులఁ బొక్కె
పచ్చిపగడంపుఁ గెంజాయ పగటుమోవి, పగిలి బీఁటలు వాఱె విభ్రమము దఱఁగె
తరళనేత్రకు నానిమిత్తమున నకట, యవిరళం బైనయాయాస మావహిల్లె. 39

యుర్వీశ పోడిమె నా కొకవిచారము సముపార్జితం బగువిత్త మనుదినంబు
నన్నపానమ్ముల కై నీవు వెచ్చంబుఁ జేసిన నెంతయు మోస మరయ
ననుచుఁ దనశిష్యవితతిలో నధికకోపి, వివిధమాయాప్రకారప్రవీణబుద్ధిఁ
బరుషభాషణు నిర్దయు భయదచరితుఁ, గఠినచిత్తుని శఠుని నక్షత్రకునిని. 27

వ. కనుంగొని కదియం బిలిచి తదీయకర్ణంబునఁ గొన్ని కపటక్రియావిశేషంబు లుపదేశించి నీ వీనృపకుంజరు వెనువెంటం జని యాయానెలవులం గూడంబడినధనంబు సర్వంబును వ్యయంబు సేయ నీయక ప్రియంబు దక్కి రయంబునం గైకొనుచు రేలునుం బగళ్లునుం బాయక నిరంతరపథపరిశ్రాంతులం గుందించియు క్షుత్పిపాసాపరవశత్వంబు నొందించియుఁ దాల్మి దూలించియు దైన్యంబు గీలించియు గాంభీర్యంబు వదలించియు ఘనతరక్రోధంబున నదలించియుఁ ద్రింశద్వాసరంబులకు నిరవశేషంబుగ నితం డొడంబడినధనంబుఁ దెమ్మని నియమించి యమ్మహీపాలు నాలోకించి.

తే. ఇతని మీవెంటఁ దోడ్కొని యేగి భక్తి, నొసలుసాగంగ ననుఁ గనుంగొనినయట్లు
కనుఁగొనందగు నాయాసమునకు నోర్వ, లేఁడు సౌఖ్యంబు జరపుఁడీ నేఁడుమొదలు.

మ. అని నక్షత్రకు నప్పగించి నృపముఖ్యా నిన్ను మద్భూమిలో
ఘనదైన్యంబున నూళ్ళవెంట నడుగంగా నీను నీ వేవిధం
బున మావిత్తము జోకఁజేసెదవు నేర్పు ల్మీఱఁ దద్భంగి య
ల్లన నొక్కింత యెఱుంగఁ జెప్పఁ దగు నీలాగు ల్నిరీక్షించెదన్ 30

ఉ. ఊరక దీనతం బొరయ కోధరణీశ్వర యింక నైన నా
కూరిమికూఁతులం గమలకోరకవిస్ఫురణాపహాసివ
క్షోరుహభారసంచలితసూక్ష్మతమోదరల న్వరించి వి
స్తారవిశేషరాజ్యరమ సర్వము నిచ్చెదఁ బూను నావుడున్. 31

మ. వనజాతాసన ధీనిధీ వినుఁడు దేవబ్రాహ్మణక్షేత్రముల్
పనిలే వేమియు మాకు మున్నె వివరింపం దత్పవిత్రదేశంబులన్
ధన మార్జించి రయంబ మీఋణము సత్యస్ఫూర్తిమై దీర్చెదన్
ననుఁ బల్మాఱును మిన్న కేమిటికి సంతాపంబుఁ బొందింపఁగన్. 32

తే. దయ మనంబునఁ దలఁపక తలఁచి తలఁచి, వట్టికుచ్చితములు పన్ని వలదు మమ్ము
వెతలఁ బెట్టఁగఁ దెగి సాఁగి వెడలనిండు, కినుక చాలింపుఁ డేను మీకింకరుండ. 33

క. అని కౌశికు నొడఁబడఁ జె, ప్పి నరేశ్వరుఁ డగిగె నాత్మఁ బెనఁగొను ధైర్యం
బున మఱి యేమియుఁ బలుకక, వనితాసుతసహితుఁ డగుచు వనభూములకున్. 34

చ. అనవుఁడు నట్లకాక యని యమ్మనుజేంద్రుఁడు నెమ్మనంబునన్
మునిసుతరక్షణప్రవణముఖ్యకృపావిభవంబు మాటికిం
బెనఁగొన నీటికందువ యభీష్టమతి న్వెదకం దలంచి కా
ననతరువీథులం గలయ నాలుగుదిక్కులు చూచుచున్నెడన్. 49

వ. వెనువెంటం దగిలి యదృశ్యాకారుండై చనుదెంచువిశ్వామిత్రుం డత్యంతకోపాటోపంబున నమ్మహీపతికి నంతరాయంబు లాపాదించునుపాయంబు నిజస్వాంతంబునఁ జింతించి దంతఘాతకుం డను నొక్కనిశాటునిఁ దనమాయాపాటవంబునం గల్పించి యానక్తంచరున కిట్లనియె. 50

తే. తపనుఁ డపరాబ్ధిఁ గ్రుంకునంతకుఁ ద్రిశంకు, సుతుని మాయలఁ బెట్టి యిచ్చోట నిల్పి
దారుణంబైనయల్లబేతాళవటము, క్రింద వసియింపఁ బనుపు మీ రేయి నతని. 51

ఉ. హాలహలానలప్రతిముఁ డవ్వటభూజమునందు నున్న బే
తాళుఁ డఖర్వగర్వమున దైవతకోటుల నైనఁ బట్టి యా
భీలగతి న్వధించు నని పేర్కొన మర్త్యుల నేమి చెప్ప శా
ర్దూలము జింకలం బొదివి త్రుంచువిధంబునఁ ద్రుంచు నుగ్రతన్. 52

వ. కావున నీప్రయోజనంబు సమకూర్పు మనుటయు మహాప్రసాదం బని యాతఁడంబ. 53

సీ. రమ్యభూతిత్రిపుండ్రము లలాటంబున మహితరుద్రాక్షదామంబు లఱుత
విమలసారంగచర్మము కటీరంబునఁ బాటలఘనజటాపటలి మౌళి
సురుచిరస్ఫటికాక్షసూత్రంబు కరమునఁ గరుణదర్భాంకురతతులు వ్రేళ్ల
నవకంపుఁ దామ్రకుండలములు వీనులఁ బొందుగా నుదరబంధంబు నడుమఁ
జెలువు దీపింప భానుమండలముతోడఁ, దనతనూదీప్తివితతి మంతనము లాడఁ
గపటవృద్ధతపోధనాకారుఁ డగుచుఁ, మానవాధీశుఁ డరుదెంచుమార్గమునను. 54

వ. మనోహరతపోవేదికాగ్రంబున వ్యాఘ్రచర్మాసనాసీనుండును సమీపవిన్యస్తదండకమండలుండును ముకుళీకృతనేత్రకమలుండును మిథ్యానియమజపధ్యానతత్పరుండును నైయుండుటయు మార్గవశంబున వచ్చి కనుంగొని యమ్మహీవరపుంగవుండు నతనినిక్కంపుమౌనిగాఁ దలంచి వినయపూర్వకంబుగా నమస్కారం బొనర్చి కోరకితకరసరోరుహుండై యిట్లనియె. 55

చ. విలయకృశానుతుల్య మగువేఁడిమి నీనిబిడాతపంబు మి
క్కిలి తపియింపఁ జేయ నతిఖేదము నొందె శరీర మెల్ల మీ
లలితకృపావలోకనముల న్ననుఁ గన్గొని నామనంబు శీ
తలముగఁ జేసి వత్సలతఁ దద్దయుఁ బ్రీతి ననుగ్రహింపరే. 56

వ. అని చింతాక్రాంతుండై కాంతారత్నంబు నూఱడించుచుఁ గరాంబుజంబు నవలం
బంబుగా నొసంగి నిజభుజాపీఠంబునం గుమారుని నిడుకొని ధైర్యం బణుమాత్రం
బును జెదరనీకఁ జనుచుండె నంత. 40

తే. దీనగతి లేనిబడలికఁ దెచ్చుకొనుచుఁ, గపటవర్తనుఁ డైననక్షత్రకుండు
బెట్టు నిట్టూర్పుఁ బుచ్చుచు మిట్టిబిఱ్ఱు, నేలగూర్చుండఁబడి మహీపాలుఁ జూచి.

చ. అలసితి నింక నొక్కయడు గైనను నే నడువంగ నోప మైఁ
గలయఁగ ఘర్మబిందువులు గ్రమ్మెఁ బదంబులఁ బొక్కు లెబ్బె శీ
తలనవిధక్షమారుహవితానమునీడకు నన్నుఁ జేర్పు భూ
తలపతిముఖ్య దేహమున దాహభరంబు జనించె నెంతయున్. 42

తే. నీకు మత్ప్రాణరక్షావివేక మాత్మ, సంభవించినయేని విశ్వంభరేశ
మేటిజవమున నరిగి యెచ్చోట నైన, విమలజలములు దప్పికి వెదకి తెమ్మ. 43

సీ. అనిన మహీకాంతుఁ డత్యంతదుర్వారచింతాపరంపరాక్రాంతుఁ డగుచు
జనపదం బైన గోష్ఠం బైన నెక్కటి వెదకి చేరక యుండ విఘ్న మయ్యె
మునికుమారకుఁ డింక మూఁడుమేరయు నడవలే ననుచు నట్టడవిలోనఁ
గదలక యున్నాఁడు గడు ప్రమాదము పుట్టె పథపరిశ్రాంతి యెబ్బంగి నణఁగుఁ
బైతరువుకానిఁగాఁగ నీబ్రహ్మచారి, నేలఁ దోడనె పంపె మునీంద్రుఁ డకట
యేమి ప్రాపించునో యింక నీశ్వరాజ్ఞఁ గడవ వచ్చునె యెంతటిఘనున కైన. 44

క. అని తల్లడించుచుండఁగ, నినకులవల్లభునిఁ జూచి యిట్లను హృదయం
బునఁ దాల్మికలిమి వొడమఁగ, వినయోక్తులఁ జంద్రమతి వివేకస్ఫురణన్. 45

మ. నిరవద్యస్థిరసూనృతోక్తిరచనానిర్నిద్ర ధాత్రీతలే
శ్వర నక్షత్రకుఁ డెంతయుం బడలెఁ దీవ్రం బైనయెండం దనూ
స్ఫురణం బెల్ల నడంగె నింక నడవం బ్రొద్దేమియున్ లేదు భా
స్కరబింబం బపరాబ్ధికిం జనియెఁ గెంజాయ న్విడంబింపఁగన్. 46

తే. మునికుమారుండు డస్సిన మోస మరయఁ, దెంపు దూలంగ నీక నడిపింప రాదు
పుత్రకుని నైన విడిచి నక్షత్రకునిన, యెలమి రక్షింపవలయు నేఁ డిచట నిలిచి. 47

ఉ. శీతలనిర్మలాంబుకణసేచనకృత్యము లాచరించి ధా
త్రీతలనాథ యాఁకటికిఁ దియ్యనిపండ్లను బెట్టి పల్లవ
వ్రాతవినిర్మితవ్యజనవాయువు లల్లన సోఁక ధీరతా
న్వీతమతి న్భజించి తగ వీతపరిశ్రముఁ జేయు డీతనిన్. 48

సీ. విను మిచ్చటికిఁ గ్రోశవేటుదూరంబునఁ గల దొక్క హ్రదము నిర్మలజలంబు
తత్తీరభూమి విస్తారశాఖలచేత విలసిల్లు నొకవటోర్వీరుహంబు
పుత్రకళత్రనక్షత్రకసహితుఁడవై యల్లి నల్లన నచటికరిగి
మార్గపరిశ్రాంతి మానునట్లుగఁ బయఃపానం బొనర్చి యాపాదపంబు
క్రింద వసియింపు మీరాత్రి నృపవరేణ్య, యచటు దక్కఁగ నీకు నన్యప్రదేశ
మిరవు గాదని చెప్పి యదృశ్యుఁ డయ్యెఁ, గపటసంయమి యైనన క్తంచరుండు. 65

క. ఆయెడ నానాపక్షిని, కాయములు కిశోరయుతములుగా మేఁతలకుం
బోయినవి మరలివచ్చి కు, లాయంబులు చేరెఁ గలకలధ్వను లెసఁగన్. 66

క. మనుజపతి పొందుదుఃఖము, గనుఁగొనఁగాలేక చనినకైవడిఁ జనియెం
దనకిరణనికర మెయ్యె, య్యన మణుపుచుఁ దపనబింబ మపరాంబుధికిన్. 67

సీ. కంధరపటలసంకాశంబు లగునంధకారము ల్గోరణగ ట్టె దిశల
వ్యోమసీమం బెల్లఁ దామయై తారకస్తోమము ల్నిండి తోఁచెనఁ బొదలె
విరహాగ్నిశిఖలచే వేఁగి రథాంగపరంపర ల్మిగుల దుఃఖింపఁ దొడఁగె
భీకరానేకవల్మీకరంధ్రంబులు వెడలి చరించె దర్వీకరములు
వెల్లురుఝిల్లీవిరావము ల్పిక్కటిల్లె, మిగులఁ దఱచుగ ఘూకము ల్మెలఁగియాడె
నిబిడముగ శాకినీఢాకినీపిశాచ, భూతభేతాళసంచారములు చెలంగె. 68

వ. ఇట్టిభయంకరనిశాసమయంబున నమ్మహీరమణుం డక్కపటతపోధనుండు చెప్పిన వటవిటపిచక్కటికిం జన సమకట్టి పట్టిం దనభుజంబునం బెట్టుకొని నక్షత్రకుని వీఁపునం గదియించి చంద్రమతిం జెట్టఁ బట్టుకొని నిజభుజాదండమహోగ్రమండలాగ్రప్రభాపటలవిరళీకృతదుర్గమమార్గాంధకారుండై చనిచని. 69

తే. మత్స్యకచ్ఛపభీకరమకరనికర, సంకులంబును వన్యేభసలిలపాన
గళగళధ్వానపూర్ణదిక్పథము నైన, హ్రదముఁ గన్గొనెఁ దనదుకట్టెదుర నృపతి.

మానిని. తోరములై వికసించినకైరవతోయరుహంబులు షట్పదఝుం
కారములుం బహుళంబుగఁ బర్వెడుక్రౌంచరథాంగబకవ్రజసం
చారములు న్వటసాలరసాలకుచందనభూజవితానలస
త్తీరములుం గడుసొంపు దలిర్ప నుతింపఁదగున్ హ్రద ముజ్జ్వలమై. 71

వ. ఇవ్విధంబున నున్నహ్రదంబుం గనుంగొని. 72

సీ. తత్తీరభూమి నందఱ నిల్పి వారికి సలిలపానక్రియాసౌఖ్య మొసఁగి
తానును బ్రక్షాళితశరీరుఁ డగుచు సాయంకాలవిధులు చయ్యన నొనర్చి

ఉ. ఓఋషివర్య దుష్టమృగయూథసమన్వితనిర్మనుష్యకాం
తారములందు దుర్గమపథంబులఁ ద్రిమ్మరి మత్పురాకృతో
దారవిశేషపుణ్యముకతంబునఁ దావకపాదపద్మముల్
చేరఁగఁ గంటి నెక్కడరిఁ జేరితి ధన్యుఁడ నైతి నావుడున్. 57

తే. పెద్దయును బ్రొద్దునకు నేత్రబిసరుహములు, విచ్చి భ్రూసంజ్ఞఁ జేసి భూవిభునిదిక్కుఁ
జూచి మాయాపరిజ్ఞానసురుచిరోక్తి, మహిమ నిట్లనుఁ బ్రత్యక్షమానికరణి. 58

క. ఎంతయు బడలితివి పథ, శ్రాంతి మహీకాంత పెంపు సడలి భవద్వృ
త్తాంతం బంతయుఁ దెలిసితి, మంతర్వీక్షణకళామహాత్త్వమువలనన్. 59

సీ. సాంద్రకీర్తిప్రథఁ జక్రవర్తిత్వంబు గనినహరిశ్చంద్రమనుజపతివి
నీవు ప్రదాతవై నిఖిలరాజ్యము నెక్కతాపసవరునకు ధారపోసి
యతనికి మున్ను మఖార్థ మిచ్చెద నని పలికినవిత్తంబు పడయఁ గోరి
పురము వెల్వడి సతీపుత్రయుక్తుండవై వారణాసీపురి కరుగుచుండ
ధనమునకుఁగాఁగ నీమీఁదఁ దపసియాజ్ఞఁ, బైతరువు వచ్చి మునితనూభవుఁడు నొచ్చి
ఘనపిపాసాతురుం డైనఁ గాంచి బెగడి, వచ్చితివి నీరు వెదక భూవరలలామ. 60

వ. అనుటయు నత్యాశ్చర్యంబును బొంది హరిశ్చంద్రుం డతనికిఁ బునఃపునఃప్రణామం
బు లాచరించి మహాత్మ నీచరణారవిందంబులు సేవించి నక్షత్రకరక్షణార్థంబు భవ
దీయాశ్రమంబున నేఁడు విశ్రమించెద నని మఱియు నిట్లనియె. 61

ఉ. ఈవనవీథుల న్వెదకి యేను జలంబులఁ దెచ్చునంతకున్
జీవము నిల్ప నోపఁ డలసెన్ మునిపుత్రుఁడు దప్పిఁ జెంది తే
జోవిజితార్క నా కపయశోదురితంబులు రాకయుండ మీ
పావనకుండికాజల మపారకృపారతిఁ బోయఁగాఁ దగున్. 62

చ. అనవుడు మందహాసమున నక్కపటాత్ముఁడు భూమిపాలుతో
ననియె దినేంద్రవంశజ రహస్యమున న్మునివృత్తి పూని కా
ననముల నున్న మా నెలవున న్వసియింపఁగ రాదు మీకు నె
మ్మనమున మా కపాయ మగు మానినులం గనుఁగొన్న డాసినన్. 63

క. సలిలం బల్పము మత్కమండలువులో సర్వంసహాధీశ త
జ్జలపానంబున మానినందనున కేచందంబునం దీఱెడిన్
దలమై పర్వినదప్పి యప్పలుకు దాఁ దర్కించినం బుద్ధి యే
తెలియం జెప్పెద నీటికందువ మనోదేశంబు మోదింపఁగన్. 64

వ. ఇంతకాలంబునకు నిచ్చోట మనుష్యసంచారంబు కలిగెనని పరస్పరాహ్వానసంభ్ర మంబులు భయంకరహుంకృతిధ్వానంబులు ననూనంబులై దిశలఁ జెలంగ నమ్మాన వేంద్రునిఁ గదిసి పొదివిన. 83

తే. శంక యొక్కింతయును లేక పంకజాప్త, కులవరేణ్యుండు తద్భూతకోటి నెల్ల
డగ్గఱకయుండఁ దఱిమి గాఢప్రతాప, వైభవంబున నెంతయు వాఁడిమెఱసి. 84

క. ఈయధమపిశాచంబులఁ, బాయక వధియించు టేమిప్రాభవ మని తా
రోయుచు భుజగేంద్రమహో, గ్రాయతకౌక్షేయకమున నద్భూతములన్. 85

వ. తూర్ణంబ కర్ణనాసికాచ్ఛేదంబు గావించుటయు నత్యంతఖేదంబును బొంది నిజా ధీశ్వరుం డగుబేతాళునకు నన్నియుఁ దెలియ విన్నవించుటయు నతండును భీషణ రోషావేశంబున. 86

శా. ఎట్టెట్టా మిము నొక్కమానవుఁడు దా నెంతేనహంకారియై
బిట్టల్కం దెగి యింతచేసెనె కదున్ బీభత్సరూపంబుగాఁ
గట్టా యేగతి నింక వాఁడు నిలువంగా నేర్చు నాముందటన్
జట్టల్చి ఱెదఁ బొట్ట వ్రచ్చెద భుజాశౌర్యం బవార్యంబుగన్. 87

ఉ. వెట్టితనంబు గాక యరవిందజుకైనను జేరరాని నా
మట్టికెలంకున న్మనుజమాత్రునకు న్నిలువంగ వచ్చునే
యిట్టికి నుండ శక్య మగునే వివరింప నివంగి చెంగటన్
జొట్టెదఁ దత్తనూపలలశోణితధారలు పొట్ట నిండఁగన్. 88

శా. ఇందాశూలికి నైన విచ్చలవిడిన్ హేలం జొరన్ రాదు ని
స్సందేహంబుగ నావటంబు నరుఁ డేజాడం బ్రవేశించెనో
యెందు న్మిక్కిలి యద్భుతంబు మది నూహింపంగ వంటింటిలోఁ
గుందేల్చొచ్చినచంద మయ్యె నిది పెక్కు ల్మాట లింకేటికిన్. 89

వ. అని భయంకరాటోపంబునం బేర్చి పెల్లార్చుచు భూతప్రేతపిశాచశాకినీడాకినీసం ఘాతంబులు గణనాతీతంబులై సేవింపం బెంపుమిగిలి. 90

సీ. పరుసనిజాంజాలుపల్లవెండ్రుకలజొంపము మారుతమునఁ గంపంబు నొంద
నిలయమేఘాకృతిఁ దలఁపింపఁగాఁ జేయు నొడలిపైఁ జీఁకటి ముడివడంగఁ
జండ్రనిప్పులకంటె వేండ్రంబులైనట్టికన్నులఁ గోపాగ్నికణము లురులఁ
బ్రేవులు నరములుఁ బెనఁచినతలకాయపేరులు గళమునఁ బెనఁగొనంగ
నుడుగ కందంద త్రావుచో నురముమీఁద, వఱదలై క్రొత్తనెత్తురు గిఱిగొనంగఁ
గక్షముల నున్నకుణపంబుఁ గఱచికఱచి, పలలకబళంబు మెసఁగుచు భయదభంగి.

మధురంబు లైననిర్మలజలంబులు గ్రోలి యధ్వపరిశ్రాంతి నపనయించి
ధైర్యవివేకగాంభీర్యముల్ హృదయారవిందంబులోపల సందడింప
మానినందనునకుఁ జంద్రమతికి లోహి, తాస్యునకు నిద్రపోవ నర్హస్థలంబు
వెదకఁదగునని యయ్యన వదన మెత్తి, కోరి నలుదిక్కులను గనుంగొనెడితఱిని.

ఉ. ఓలి ననేకఘూకనివహోగ్రరవంబులుఁ గోటరాంతరా
భీలభుజంగఫూత్కృతులుఁ బెల్లుగ నొక్కటఁ బిక్కటిల్ల భూ
తాళికి నాలయం బయి పురారికినైన భయంబుఁ జేయు బే
తాళవటంబుఁ గాంచె వసుధాతలనాథుఁడు వీతభీతియై. 74

క. బహువిధశాఖాపటలీ, పిహితాఖిలదిక్తటంబు బేతాళవటం
బహిమకరకిరణసముదయ, విహారదుర్గమజటంబు వీక్షించెఁ దగన్. 75

వ. ఇట్టిదారుణబహుపాన్మహీరుహంబు నిరీక్షించి యవ్వసుంధరాధ్యక్షుండు. 76

తే. కడఁగి సాహస మొదవ శంకావిహీన, మానసుం డయి చేరి యామ్రానిక్రింద
లేఁతకసవున శయ్యఁ గల్పించుటయును, సారిది నత్పుత్రకుం డందు సుప్తుఁ డయ్యె.

చ. ధరణితలేశుదేవియును దత్పదపద్మసమీపభూస్థలిం
బొరిఁబొరిఁ గ్రమ్ముదుఃఖమునఁ బుత్రుఁడుఁ దానును నంశుకాంచలా
స్తరణమునందు హస్త ముపధానముగా నొనరించి వెండి దు
స్తర మగునాఁకటం బడలి దైవము దూఱుచు సుప్తిఁ బొందినన్. 78

మ. అపు డాచందనగంధి గంధకరిణీయానం గురంగాక్షి వం
శపవిత్ర న్నవపల్లవాధరపుట న్సంపూర్ణచంద్రాననం
జపలావల్ల్యుపమానదేహలతికన్ జాయ న్విలోకించి యా
నృపవంశాభరణంబు మానసములో నెంతేవిచారంబునన్. 79

తే. అధిక మైనపథశ్రాంతి నాద మఱచి, సుప్తి నొందెడువీరి కిచ్చోట దుష్ట
మృగపిశాచభయం బంకురింపకుండఁ, గావఁదగు నాకు జాగరూకత్వమునను.

చ. అని తలపోసి భాస్కరకులాగ్రణి యుగ్రకృపాణపాణియై
యనిమిషవంద్యుఁ జంద్రధరు నార్తజనావనదక్షు శంకరున్
మనమున నిల్పి నీవ గతి మా కని పల్కుచు నాల్గుదిక్కులుం
గనుఁగొనుచుండె నెచ్చరికగల్గి తలంకక వీతనిద్రుఁడై. 81

ఆ. అంత నర్ధరాత్ర మగుటయు నవ్వటో, ర్వీరుహంబునందు విడువకుండు
భయదవికృతభూతచయము లూడలవెంట, నవనిభాగమునకు నవతరించి. 82

వ. ఆసమయంబున మఱియును జలపట్టి యగ్గాధిపట్టి దయావిహీనస్వాంతుండై దుష్క-
రంబు లగు పుష్కలావర్తపయోధరచయంబుల భయంకరంబుగా వర్షంబు గురియ
నియమించిన. 102

సీ. ఘుమఘుమాత్కారనిర్ఘోషభీషణఘనస్తోమసంఛాదితవ్యోమతలము
సంవర్తమృత్యుదంష్ట్రాద్యుతిప్రతిమానశంపాపరంపరాసంవృతంబు
కులసానుమద్గుహాకులమహాధ్వనిహేతుపటుదీర్ఘనిర్ఘాతపాతపటిమ
మాశామదావళహస్తనికాశవాఃపూరధారాసిక్తభూతలంబు
తీవ్రతిమిరచ్ఛటాసక్తదిక్తటంబు, పృథులవర్షోపలానీకభీకరంబు
ఘనతరాభీలదుర్గమకర్దమంబు, కురిసె వర్షంబు ధరఁ గుండఁ గూల్చినట్లు. 103

క. వేల్లకుఁ బెదపెదమ్రాఁకులు, పెల్లగిలం గొమ్మ లెల్లఁ బెళపెళ విఱుఁగన్
బల్లిదపు గాడ్పు లేడును, బెల్లుగఁ జెలరేఁగి వీచె భీకరభంగిన్. 104

ఉ. ఆసమయంబున న్నరవరాగ్రణి తా వటబీజమాత్రమున్
వేసట లేక ధైర్యము వివేకము సత్యవచోవిలాసముం
బాసటసై మనోగతిని బాదుకొనంగ విపన్నరక్షకున్
వాసుకికంకణు న్మదనవైరి నుమారమణుం దలంచుచున్. 105

తే. వానఁ దడియుచు గిజగిజ వణఁకుచున్న, సుతసతీమానిపుత్రులఁ జూచి వగచి
తొడలపై నిడుకొని వారిదుఃఖ ముడుగ, నూఱడించుచుఁ దలఁకకనుండుటయును..

క. సూర్యకులభర్తహృదయ, స్థైర్యంబున కాత్మ గాధితనయుఁడు కడునా
శ్చర్యమునుఁ బొంది యీనృప, వర్యునిఁ బోలంగఁ గలరె వసుధాధీశుల్. 107

తే. తగిలి నాచేయుకపటకృత్యముల నొగిలి, చిక్కుఁ డయ్యె వృథాశ్రాంతిఁ జెందియకట
వెడఁగనై యాయరుంధతీవిభునితోడఁ, గలహ మేఁ నొనర్చితిఁ దెలియ కేను. 108

మ. పురుహూతాదిసుపర్వులున్ మునిజనంబు ల్భీతిఁ బొందంగ నే
దురహంకారము రాజసంబుఁ జలముం దొడ్తోన యుబ్బంగ దు
ష్కరసంధావచనంబు లేమిటికి మాత్సర్యంబునం బల్కితిం
జిరకాలార్జిత మైనమత్తపము సంక్షీణంబు గాకుండునే. 109

క. మానుగఁ గార్యాకార్యము, లూనిన మదిఁ దెలిసి యాడ కొగిఁ బెద్దలతోఁ
దా నూరక కలహమునకుఁ, బూనెడునాఁ డపజయంబుఁ బొందకయున్నే. 110

తే. ఇంక నిస్సంశయంబుగ ఋషివరేణ్యుఁ, డగువసిష్ఠప్రతిజ్ఞాక్రియానిరూఢి
నెఱయు నీరేడుభువనవర్ణితము గాఁగ, ననుచుఁ దనుఁదాన నిందించుకొనుచునుండె.

వ. అంత. 112

తే. కాలసర్పంబుతోఁడుత మేల మాడఁ, జాలుశాతత్రిశూలంబుఁ గేలఁ బూని
ప్రబలహుంకారఘోషంబు ప్రళయసమయ, మేఘగర్జాధ్వనులకు నామ్రేడితముగ.
వ. దీర్ఘనిర్ఘాతపాతనిష్ఠురచరణఘట్టనక్రియావిహ్వలీభూతపాతాళుండై యేతెంచునబ్బే
తాళునిం గనుంగొని నిర్భయహృదయాంతరాళుండై భూపాలుం డస్తమితసమస్త
విరోధివరూథినీజాలం బగుకరవాలంబు జళిపించుచు. 93
తే. అభిముఖంబుగఁ గొంతద వ్వరిగి వాని, కడ్డమై నిల్చి యిటురాక యరుగు మోరి
నిగిడి యరుగక వచ్చిన నీదుప్రాణ, వాయువులఁ గ్రోలు నాదుకాక్షేయకాహి. 94
క. నావుడు నబ్బేతాళుఁడు, భూవల్లభుమోముఁ జూచి పొరిఁబొరి ఘనరో
షావేశం బొదవఁగఁ గనుఁ, గ్రేవలఁ గడు నిప్పు లురులఁ గెరలుచుఁ బలికెన్. 95
సీ. ఎవ్వఁడ వీవు నా కెదిరి భాషించెదు శంక యింతయు లేక సాహసమునఁ
బులియున్న పొదరిల్లు లలి జింక చొచ్చినగతిఁ జొచ్చితి మదీయగహనభూమి
నెక్కడి కేగెద వింక నాముందర మ్రింగెద నహి కప్ప మ్రింగుకరణి
గీర్వాణగంధర్వకిన్నరపన్నగయక్షరాక్షసముఖ్యులైన నన్నుఁ
జెనక వెఱతురు నీ విట్లు చెనక నగునె, నాదువిహరించుమట్టిక్రింద నె వసించి
తివిరి తద్రక్షకుల భూతనివహములను, భంగపఱిచితి నామిత్రబాంధవులను. 96
క. శంకరుఁ డడ్డము వచ్చినఁ, గొంకక వారించి నాదుక్రోధాగ్నికి ని
శ్శంక నినుఁ బట్టికొని యే, యంకిలియును లేక వేల్తు నాజ్యాహుతిగన్. 97
చ. అని భయదాట్టహాసములు నార్పులు బొబ్బలు హుంకృతిధ్వనుల్
గొనకొని పర్వ గర్వము నకుంఠితశౌర్యము నుప్పతిల్ల ను
బ్బున నిజకింకరోగ్రబహుభూతచయంబులతోడఁ గూడి య
య్యినకులవల్లభుం బొదువ నిట్లని పల్కె నృపాలుఁ డల్కతోన్. 98
క. ఏనెక్కడ నీ వెక్కడ, మానవసామాన్యుఁ డనుచు మదమున నెఱుఁగం
గానేరక ననుఁ బొదివెద, హీనమతిం దొలఁగి యరుగు మెందుల కైనన్. 99
వ. అని పల్కినయమ్మహీవరునిపైఁ గవిసి. 100
సీ. కినుకమై శూలంబుఁ గేల నంకించి వైచినఁ గలంగక దానిఁ దునిమె నృపతి
మఱియును నతఁ డొక్క మ్రాను పెఱికి భానువంశజునురము తీవ్రముగఁ గొట్టెఁ
దద్ఘాతఁ గదలక ధరణీరుహముతోడఁ వానిహస్తము మహీజాని నఱికె
నందుచేఁ గుందియు నతఁడు రెండవచేతఁ దఱచుగాఁ బాషాణతతులు పఱపె
నాశిలాతతు లన్నియుఁ బాసిపోవ, బెడిద మగువాఁడియడిదంబు బెట్టుత్రిప్పి
చేరి ఖండించె నానృపశేఖరుండు, చాలభీకర మైనబేతాళుశిరము. 101

సీ. హరిణలోచన మన కగునపాయమునకుఁ జింతింప నాత్మ నొక్కింత యైనఁ
దాపసాత్మజునకుఁ బ్రాపించుచున్న ప్రమాదంబునకుఁ జాల ఖేద మొదవుఁ
గావున నెండుమార్గంబు లన్నియు మాని చయ్యన నేఁ బ్రవేశం బొనర్ప
హవ్యవాహనుఁడు మత్ప్రాణాహుతుల సంతసిల్లి మీయెడ దయ సేయుఁ బిదప
ననుచు హృత్పంకజంబున నఖిలభక్త, గణవశంకరుఁ డైనశంకరుని నిలిపి
యతిభయంకర మైనకారగ్గి కెదురు, చనియెఁ దెగువ హరిశ్చంద్రజనవరుండు. 123

వ. ఇవ్విధంబునం జనుజీవితేశ్వరుఁ గనుంగొని శోకవ్యాకులితమతి యయ్యు నమంద
ధైర్యవతియై చంద్రమతి యిట్లనియె. 124

తే. ప్రాణనాయక ధైర్యంబు పాయఁబెట్టి, యివ్విధంబున నానతి యియ్యఁ దగునె
నిమిష మైనను నినుఁ బాసి నిల్వఁ జాల, నేన జొచ్చెద నీవహ్నిలోన మున్ను. 125

ఉ. ఇందుకు నేమియుం బలుక కీచన వీఁదగు నాకు నావుడుం
గుంది దినేంద్రవంశజుఁడు కోమలి కిట్లను సౌమ్యగాత్రి యో
చందనగంధి యోమతివిశారద నీ కిటువంటి తెంపు నే
యందగునే మదీయహృదయంబు గలంగఁ గురంగలోచనా. 126

వ. అని యశ్రుధారాపూరితనేత్రుండై యున్నయమ్మహీకళత్రునకుం జంద్రమతి వందనం
బొనర్చి కరారవిందంబులు మొగిడ్చి 127

సీ. ఇనవంశవర్య నామనవి చేకొనఁదగు నింక నేమియు నానతియ్య వలవ
దతివ యేతెంచుదవానలం బీక్షించి యనయంబుఁ దలఁకెడుమునికుమారు
ప్రాణంబు గాచునుపాయంబు చింతింపుఁ డంతరంగంబున నతిరయంబ
యాతండు బ్రదికిన నపకీర్తి రాకుండ నుండంగఁ గల్గు భూమండలేశ
తడయఁ జనదింక నదెవచ్చెదారుణాగ్ని, నన్నుఁబనుపుఁడుధృతినిల్పిమున్న యనుచు
మాటికిని వేఁడుకొనఁగ నమ్మన్నుఁ ఱేఁడు, దీర్ఘనిశ్వాసపవనంబు దీటుకొనఁగ. 128

వ. శిరంబు వంచుకొని కరంబు విచారంబున నేమియుం బలుక నేరక యూరకుండుట
యు నది యంగీకారంబుగాఁ గైకొని యక్కురంగనయన హరిశ్చంద్రునకుఁ బ్రద
క్షిణపూర్వకంబుగాఁ బునఃపునఃప్రణామం బొనర్చి యాలస్యంబు దక్కి యాభీల
దావానలజ్వాలాజాలంబులకుఁ దూలక యభిముఖురాలై చనుచుండ దనవెంటంగూడి
తొలంగక తోడునీడయుంబోలె నేతెంచుచు నేనునుం జనుదెంచెదఁ గొనిపొమ్మని
పోరుపెట్టు మఁగరంబులఁగొంగుఁబట్టితివియుననుంగుఁబట్టిని లోహితాస్యునిఁ గనుం
గొనిమోహాతిరేకంబుననఁ నేకవిధంబుల లాలనంబొనర్చుచుసమగ్రవిచారంబునఁగుమా
ర యుమారమణు కారుణ్యంబున దావపావకంబుశమియింపంజేసి తూర్ణంబచనుదెం
చెదఁ బూర్ణచంద్రప్రసన్నవదన నాయన్న మీయన్న యున్నయెడన నావచ్చునంత

ఉ. సారెకుఁ గూయఁ జొచ్చెఁ బరుషధ్వనిఁ గుక్కుటరాజి మౌక్తిక
శ్రీరుచి వేగుఁజుక్క పొడిచెం దలచూపె నసూరురేఖ కా
సారతరంగిణీవిటపిసంతతిఁ బర్వె శకుంతనాదముల్
దూరము లయ్యెఁ జీఁకటులు దూరుపు దెల్వివహించె వేకువన్. 118

క. అరవిందవనం బిందిం, దిరముల కామెతలు పెట్టి దివనాథుఁడు ప్రా
గ్ధరణీధరశిఖరంబున, నరుణచ్ఛవిఁ బొలిచె జనుల కతిముద మొదవన్. 114

తే. సూర్యుఁ డుదయింపనృపతియచ్చోటువాసి, యరిగిముందటనొకసరోవరముఁ గాంచి
యందు సంధ్యాదినిత్యకృత్యములు దీర్చి, తాల్మికల్మి మనోవీథిఁ దళుకు లొత్త.

క. నానాతటినీతతులును, గానములుఁ బర్వతములు గ్రామములు మహా
స్థానీయంబులు గడచి య, హీనగతిం జనుచునుండె నింతటిలోనన్. 11

వ. విశ్వామిత్రుండు వైశ్వానరుం బ్రియంబున నాకర్షించి యతనితో నిట్లనియె. 117

మ. వసుధాధ్రంబుల నైన నీదుభయదజ్వాలావళిం జేర్చి యే
ర్చుసమర్థత్వము గల్గునీ కితరులం జోద్యంబొకో మర్త్యులం
బసఁ దూలించుట నీప్రభావము నుతింపన్ శక్యమే యేరికిం
బ్రసవాస్త్రుం బొరిగొంటి వీవ పురజిత్ఫాలాగ్రనేత్రాకృతిన్. 118

క. తవిలి హరిశ్చంద్రమహీ, ధవుఁ డరిగెడు మార్గభూమిఁ దావకకీలా
నివహంబులచే నేఁతయు, నవరోధ మొనర్పవలయు నత్యుగ్రముగన్. 119

వ. అనుటయు నట్ల కాక యని యక్కరువలిచుట్టంబు మహీవల్లభుం డరుగుతెరువునఁ
బ్రబలి యత్యంతదుర్గమంబుగా నిరర్గళమారుతప్రచలితమహీరుహానోన్యసంఘ
ర్షణంబులవలనఁ బ్రచండగతిం బ్రభవించి యెండిగాలిన కారాకుప్రోవుతండంబు
లఁ దవిలి రవులుకొని భుగభుగాయమానంబులై పెల్లెగయుచు నిబిడాంధకారిత
వ్యోమంబు లగుధూమంబులును జిటచిటాయమానంబులై యభంగురంబు లగు వి
స్ఫులింగంబులును ధగధగాయమానంబులై మింటి నంటు నెఱమంటలును బెరిఁగి
యొక్కమొగిం బిక్కటిల్లి చనుదెంచునద్దావానలంబు వీక్షించి మానవాధీశ్వరుండు
మనంబున దురపిల్లుచుఁ జింతాక్రాంతుండై నిజకాంతామణిం గనుంగొని. 120

క. భీకర్ణమై యెటుఁ జూచిన, నాకాంత తరింపరానిహుతభుక్కీలా
నీకము కడుఁ బ్రబలెను నా, లీకాసనుప్రాంతఁ గడవ లే రెవ్వరున్. 121

తే. తరళలోచన కాశికాపురముఁ జేరి, ఋషిశిఖామణి కౌశికుఋణముఁ దీర్చి
నిత్యసత్యవచఃకీర్తి నెగడకుండ, నిచట నంకిలియయ్యె నింకేమి యనఁగ. 122

వ. అని సముచితసంభాషణవిశేషంబుల నవ్విశ్వంభరావల్లభుండు దనప్రాణేశ్వరిం బ్ర
శంసించి యాదరించె నాసమయంబునఁ ద్రిభువనైకదేశికుం డగుకౌశికుండు తదీయ
ప్రకారంబు విలోకించి విస్మయం బంది కల్పాంతవహ్నియుం బోని యనల్పంబైన
యద్దావపావకంబునం ప్రేలి తూలక యప్పల్లవాధర వల్లభుండునుం దానునుం దొ
ల్లింటియట్ల మహానందంబును బొంది నందనోపలాలనంబు సేయుచుఁ దేజోవిశేషం
బశేషంబై యుండ దీపించుచున్నయది యని వెండియు. 139

తే. లోలలోచన మిసిమింతురాలు గాక, వహ్నికీలలలో నిట్లు వన్నె చెడక
యున్న దిదిచాలచిత్ర మోహో తలంప, వినియుఁగనియు నెఱుంగమివ్విధము నెచట.

క. మామక నిశ్చలభూరిత, పోమహిమల మించి మిగులఁ బొలుపొందెనె యీ
భామినిపాతివ్రత్య, శ్రీమహితగభీరగుణవిశేషము లరయన్. 141

క. విపదంధకారపటలీ, తపనమయూఖములు పతిహితక్రియ లెవ్వరుం
జపలాక్షి కవియ చాలవె, యపరిమితాభీష్టఫలచయంబుల నొసఁగన్. 142

క. కావునఁ బాతివ్రత్యక,ళావిభముచేత నీవిలాసిని ధృతిమై
దావానలకీలావళి, నేవంతయుఁ బొందక కలరె నెలమి దొలంకన్. 143

ఉ. ఇంక నుపాయ మేది గల దీకమలాప్తకులావతంసమున్
బొంకఁగఁ జేయ హేమగిరిఁ బోలెడుధీరత యంకురింప నే
యంకిలిఁ బొందక కట్టిభయదాపద లైనను నిస్తరించుచున్
శంక వహింప కుండెడిని జంద్రమతీసతికారణంబునన్. 144

వ. అని డోలాందోళితమానసుండై యమ్మునిపుంగవుండు వెండియుఁ గడంగి యంతరం
గంబునఁ జలంబు దలంబుగా నెక్కొంచి నిజాకారంబు దక్కొనవారల కేరికి గోచ
రంబు గాకయుండ నక్షత్రకుం గదిసి యాలింగనాదిసంభావనంబులఁ బ్రీతునిఁ గా
వించి వాత్సల్యంబున నిట్లనియె. 145

తే. వాసి కెక్కొననాశిష్యవరులలోన, మిగులమాన్యునిగా నిన్నుఁ మెలఁపినాఁడ
నాకుఁ బ్రత్యుపకార మొనర్చువేళ, యిదియచూ నీకుఁ బరికింప నిద్ధచరిత. 146

ఉ. నీకపటక్రియామహిమ నేర్పు దలిర్పఁగ జోకఁ జేసి య
స్తోకవివేకభూరమణుతోడుతఁ గూడి చరింపకుండ నీ
కోకకుచాశిరోమణి నకుంఠితబుద్ధి నశేష ధీరతా
శ్రీకమనీయభర్తృహిత శీలనుతం బెడవాపు చయ్యనన్. 147

వ. అని బోధించి గాధినందనుండు తిరోధానంబు నొందెఁ దదనంతరంబ. 148

తే. చంద్రమతిఁ జూచి పలికె నక్షత్రకుండు, తెలిప భవదీయవిమలపతివ్రతాప్ర
భావ మభినుతి సేయంగఁ బద్మజానకు, నహికులాధీశ్వరున కైన నలవిగాదు. 149

కుఁ గదలక యిచ్చోటన యుండుమీ యని కుస్తరించి తదేకనిష్ఠాపరత్వంబున. 129

తే. నియమ మొప్పంగఁ బుట్టంబు నెతికఁ గట్టి, ప్రాణవల్లభు నిజమనఃపద్మపీఠి
నునిచి ధైర్యంబు దళుకొత్త నుత్పలాక్షి, కృష్ణవర్త్మకు భక్తిమైఁ గేలు మొగిచి. 130

సీ. పరమపావనతేజ పావక సదయాత్మ హరిణాంకమౌళిపర్యాయకాయ
యనఘ పాతివ్రత్యమున మనోవాక్కాయకర్మవిస్ఫూర్తిచే ధర్మనిరతిఁ
బూని చరించితి నేని మత్ప్రాణేశ్వరుండు సూనృతవచోరూఢి మెఱసి
భూనుతకీర్తివిభూతిశోభితుఁ డేని శీతకరాకృతి మౌనిశిష్యునకును
విశదవాత్సల్యమున మున్ను కుశల మొసఁగి, పిదపఁ గౌశికుబుణము సంప్రీతిఁ దీర్పఁ
గూడునట్లుగఁ బెనిమిటిఁ గొడుకుఁ గరుణ, నరసి రక్షింపవయ్య జోహారు నీకు. 131

క. అని పనికి యరుణసరసిజ, వనముఁ బ్రవేశించునంచవడువున ధైర్యం
బును భూరివివేకంబును, మనమునఁ బెనఁగొనఁగఁ జంద్రమతి శిఖిఁ దఱిసెన్. 132

వ. ఇట్లు తఱిసి తదీయమధ్యంబునఁ బుష్పితాశోకవనాంతరంబునఁ గీరకిశోరంబునుం బోలెఁ జరమసంధ్యారాగంబులోపలఁ దరుణతుషారమయూఖరేఖయుంబోలె నిలిచి యెలమిం జెలఁగియుండుటయు నాతన్వంగిపాతివ్రత్యశీలతపోవిశేషంబులకుఁ బర మాశ్చర్యంబును బొంది పురందరాదిబృందారకసందోహంబు లమందానందకందళిత హృదయారవిందంబులం గ్రందుకొని యందంద తొరఁగుకరుణారసంబులఁ దొప్ప దోఁగి యిందిందిరంబులకు విందు లొనర్పం జాలు మకరందబిందుబృందంబులు చింద నితాంతలతాంతవర్షంబులు గురియించి రయ్యవసరంబున. 133

తే. భీకరజ్వాల లొయ్యనఁ బెం పుడుగఁ గ, డింది నిప్పులగములవేఁడిమి శమింప
ధూమ మంతయు నుడివోవఁ దోడుపడిన, గాలి యుడుగంగవనవహ్ని జాలమడఁగె.

తే. ఈవిధంబున దావాగ్ని యెల్ల నణఁగి, పోవుటయుఁ జాల నద్భుత మావహిల్ల
నెలఁమిఁ జెక్కుచెమర్ప కాయిగురుబోఁడి, మందహాసవికాసంబు కందళింప. 135

క. తొల్లింటియట్ల వచ్చి స, ముల్లసితప్రీతి సుతుని ముద్దాడుచు భూ
వల్లభునకు భక్తిం బ్రణ, మిల్లిన నానృపుఁడు పల్కె మెఱుఁగుంబోఁడిన్. 136

ఉ. ఓవనితాశిరోమణి పయోరుహలోచన నీసుశీలతా
శ్రీవినుతప్రభావమునఁ జేసి మహాద్భుత మావహిల్లఁ గా
నీవనపావకం బడఁగె నెల్లశుభంబులు గల్గు నింక నీ
పావనవర్తనంబు కడుఁ బ్రస్తుతి కెక్కు ధరాతలంబునన్. 137

తే. రాజముఖి నాకు నపకీర్తి రాకయుండ, నీవ ప్రోచితి వీసంయమీంద్రతనయుఁ
గాన నారసి చూడ నీ కారణమున, వానిధన మిచ్చి సత్యంబుఁ బూనఁ గల్గు.

తే. ఇంతవట్టును నిశ్చయం బిగురుఁబోఁడి, నాకుఁ జూడంగ నదిగాన నాదుపలుకు
నమ్మి యేతెమ్ము గ్రమ్మఱ నందనుండు, నీవు సాకేతపురికి రాజీవనయన. 159

వ. అనిన నయ్యిందువదన మందస్మితసుందరవదనారవిందయై కర్ణపుటంబులం గరకమలం
బులు చేర్చి హరస్మరణంబు సేయుచు నమ్మునితనూజుం గనుంగొని యస్తోకవివేక
విశేషభాషాకౌశలం బొదవ నిట్లనియె. 160

క. సతి కిహపరసౌఖ్యములకుఁ, బతియె నిదానంబు చూవె పరికింపంగాఁ
బతి నెడఁబాసి చరించెడు, సతికిన్ వృథ గావె సకలసౌభాగ్యములున్. 161

ఉ. కోరిక లెల్లఁ జాల నొడఁగూర్చు ప్రియుం బెడఁబాసి స్రుక్కిపం
కేరుహపత్రలోచనకుఁ గీరము వైరము హార మెంతయున్
భారము మంచికప్పురపుఁబల్కులు ముల్కులు పచ్చ వెచ్చ శ్రీ
గారవనాంతరాళశశికాంతపువేదులు సూదు లారయన్. 162

క. ఓమునిరాజతనూభవ, సోముని నెడఁబాసియున్నఁ జూడం దగునే
యామిని యట్ల తలంపఁగ, భామినియును బ్రాణనాథుఁ బాసినవేళన్. 163

శా. వాలుంగంటికి నింటియాతఁడు మనోవాంఛాప్రదానక్రియా
హేలాలోలుఁడు నీలవేణికిఁ బ్రియుం డేప్రొద్దు నొప్పారుర
త్నాలంకారము కాంతకున్ మగఁడు నిత్యానందసంపాది యిం
కేలా వేయును జెప్ప నేర్గడయు: బ్రాణేశుండ తన్వంగికిన్. 164

ఉ. కావున నిత్యసత్యగుణగణ్యుఁడు పుణ్యుఁ డితండు భర్తయున్
దైవము గామితార్థఫలదాతయు నాకుఁ దలంచి చూడ నీ
భావజమూర్తివైభవునిఁ బాసి చరింపఁగ నెట్లు నేర్తు నే
నోవటువర్య యీయనుచితోక్తులు పల్కఁగ నీకు ధర్మమే. 165

క. గాధితనూజునిమాయాం, భోధిన్ మద్భర్త యేల మునిఁగెడి గిరిక
న్యాధవుసేవాద్రోణిక, సాధనముగ నిస్తరించు సంశయ మేలా. 166

తే. ఇంద్రసన్నిభుఁ డగుహరిశ్చంద్రవిభుని, ధైర్యగాంభీర్యశౌర్యసుస్థైర్యవైభ
వంబు లెఱుఁగక విప్రలాపంబు లురక, పలుకుచున్నాఁడ వో వెఱ్ఱిబ్రహ్మచారి. 167

సీ. అపరపద్మాసనుం డగుకౌశికుండును నీవును నింద్రాదిదేవతలును
మేలుమేలని చాల మెచ్చి నుతింప నిశ్చలుఁడు హరిశ్చంద్రచక్రవర్తి
యార్తరక్షణశాలి వార్త కెక్కినమేటి మార్తాండకులకర్త మర్దితారి
నిత్యసత్యస్ఫూర్తి నిర్మలతరకీర్తిఁ బ్రబలిహిమాద్రిజాభర్తకరుణఁ
బడసి క్రమ్మఱఁ బాలించుఁ బ్రాభవమున, వక్ర మేమియు లేక భూచక్ర మెల్ల
ననిన నదియంతయును నిక్క మనుచు మ్రోసె, మిగులనద్భుత మొదవంగ గగనవాణి.

క. తామరసభవునిసతియుఁ బు, లోమజయు నరుంధతియును లోపాముద్రా
భామయును ననసూయయుఁ గా, కీమహిలో నీకు నెవ్వ రీడు పురంధ్రుల్. 150

ఉ. ఎట్టితపం బొనర్చెనో మహిం బరమేశుఁడు మెచ్చునట్లుగా
నెట్టివిశేషదానము లహీనతఁ జేసెనొ యెట్టితీర్థముల్
మెట్టెనొ పుణ్యశీలమున మించి జగన్నుతిఁ గాంచినట్టిని
న్బట్టపుదేవిఁగాఁ బడసె భానుకులోత్తముఁ డంబుజాననా. 151

క. భీకరదావాగ్నిశిఖా, నీకముపా ల్పడకయుండ నిరుపమకరుణం
జేకొని ననుఁ బ్రోచితి కాం, తా కల్గె న్నీకుఁ బ్రాణదానఫలంబున్. 152

క. ఇందుకుఁ బ్రత్యుపకారము, పొందుగ నిఁక నీకు నొకటి పూని యొనర్తుం
జందనగంధి వినందగు, మందేతరబుద్ధిఁ జెంది మద్వచనంబుల్. 153

సీ. కౌశికమునిపుంగవు వేఁడి యతనిచేఁ గ్రమ్మఱ సామ్రాజ్యగరిమ వడసి
శీఘ్రంబ మూర్ధాభిషిక్తునిఁ గావింతు నీపుత్త్రు సుజనవర్ణితచరిత్రుఁ
దోకొని మరలి సంతోషంబుతో నయోధ్యాపట్టణమునకు నరుగుదెమ్ము
విశ్వసింపు మదీయవిహితోపదేశంబు మృషగాఁ దలంపకు మీననయన
నానుడువు బుద్ధి వినక నమ్మౌనవేంద్రుఁ, గూడి వెనువెంటఁ దిరుగఁగఁ గోరెదేని
జలజనేత్ర బహుప్రయాసముల నొంది, తిరుగుచుండంగవలయు దిగ్దేశములను. 154

చ. కలఁగక దావపావకశిఖానివహంబు లణంచినట్లు యో
నెలఁత యణంపశక్య మగునే మదనాహితఫాలలోచనా
నలమునకంటె నుగ్రత ఘనంబయి హాటకగర్భకైటభా
రులఁ దలఁకించుఁ గౌశికునిరోషహుతాశనవిస్ఫులింగముల్. 155

తే. అదియునుం గాక యోకురంగాయతాక్షి, నేఁడు మొదలుగ నింక నెన్నికకు వాస
రములు పది చిక్కె సంయమిప్రవరుతోడ, నవనిభర్త గుఱించినయట్టిమితియు.

చ. మునిఋణ మేగతిన్ మొదలు ముట్టఁగఁ దీర్చెద రొక్కచిన్నముల్
జనపతిచేత లేదు జలజాతదళాయతనేత్ర యెవ్విధం
బున సమకూడెడిన్ మితికి బొంకఁగ నేరఁ డొకింతయైన నీ
పెనిమిటి యట్టిశీలమునఁ బృథ్విఁ జరింపఁగఁ బోల దేరికిన్. 157

చ. అలుక జనింపఁ గౌశికమహాముని యేమటిపాట భీమభం
గులఁ జనుదెంచి మాధనము గొబ్బునఁ దెమ్మని యానఁ బెట్టినం
గలఁగుచు నేయుపాయమును గానక నిన్నును నీతనూజుఁ గొం
దలమున విక్రయించు వసుధాధవుఁ డెవ్వరికైనఁ జెచ్చెరన్. 158

# హరిశ్చంద్రోపాఖ్యానము.

## చతుర్థాశ్వాసము.

క. శ్రీచాయసదన పదసే, వాచరణనితాంతనియమహర్షితనీహా
రాచలకన్యావల్లభ, బాచయయెల్లప్రధాన బంధునిధానా. 1

వ. ఆకర్ణింపు మప్పాండవాగ్రజునకు మార్కండేయుం డిట్లనియె నట్లు హరిశ్చం
ద్రుండు కాశికాపురంబుఁ గనుంగొని తదీయపరిసరంబున. 2

ఉ. రంగదనేకనిర్మలతరంగఁ బ్రఫుల్లసరోరుహభ్రమ
ద్భృంగఁ దటద్వయీప్రబలదీపితపుష్పలతాకుడుంగఁ బూ
తాంగఁ జరద్రథాంగకలహంసముఖాంబుపతంగ జాహ్నవీ
గంగఁ బ్రియాతిరేకమునఁ గన్గొనియెం బ్రమదాంతరంగుఁడై. 3

ఉ. వారిధికూర్మిరాణి రతివల్లభవైరికిరీటభాగమం
దాగలతాంతమాలిక జనంబులపాలిటివేల్పుటావు ధా
త్రీరమణీకుచాగ్రతటదీపితమౌక్తికహారవల్లి భా
గీరథి చెప్ప నొప్పెసఁగెఁ గిల్బిషభూజకుఠారధారయై. 4

వ. ఇత్తెఱంగునం బొల్చుచున్నయత్తరంగిణిం గనుంగొని నమస్కరించి. 5

శా. తల్లీ మిన్నక నిన్ను నాడినజనుల్ తా రర్థిఁ గైవల్యభా
స్వల్లక్ష్మిం దగఁ బట్టుగొందు రనినన్ వాంఛించి ప్రేమంబు సం
ధిల్ల న్నిన్గొనియాడువారి కరుదే నిర్వాణసౌభాగ్యముల్
కల్లోలాపహృతాఘపంక త్రిజగత్కల్యాణి భాగీరథీ. 6

తే. జాహ్నవీ నీదుజలములు సదమలములు, లఘువులును శీతలములుఁ దలంపఁ గ్రుంకు
లిడినవారికి నల్ల నౌ మెడలు దలలు, జడలు గట్టు లలాటంబు లుడుకు నరుదు. 7

వ. అని ప్రశంసించుచుం గదిసి భక్తితాత్పర్యవినయసంభ్రమంబులు మనంబునం బెనం
గొనుచుండ సుతసతీసమేతంబుగాఁ గృతస్నానుండై పరమధ్యానపూర్వకంబుగా

వ. అంత నమ్మహీకాంతుం డమ్మద్దియఁ గనుంగొని యద్దినంబు మనకు నిచ్చోట నాలస్యంబు సేయం బనికాదు పురోభాగంబుల గవ్యూతిత్రయమాత్రంబునఁ గాత్యాయనీకళత్రునివాసంబును గమనీయసంపద్విలాసంబును గలుషలతావితానశితాసియు నగుకాశీనగరంబు ప్రకాశించుచున్నయది యప్పురంబు ప్రవేశించి కౌశికుఋణవిమోచనోపాయంబు చింతింప వలయు నని కాంతాసమేతుండై కొంతద వ్వరిగి ముందట. 169

సీ. జాహ్నవీనిర్మలజలపరిక్షాళితబహులోకభీకరపాతకంబు
విశ్వనాథకిరీటవిధుకళాకౌముదీసముదయాచ్ఛాదితసౌధవీథి
కేశవస్వామ్యురోదేశప్రఫుల్లాబ్జవనమాలికాగంధవాసితంబు
కాలభైరవభుజాకలితఢక్కాభీలఢమఢమధ్వనిమహాడంబరంబు
నిండుమతి దుండివిఘ్నేశుఁ డుండుభూమి, యన్నపూర్ణావిశాలాక్షు లాటపట్టు
శ్రీకరం బైనవారణాసీపురంబు, గనియె వేడ్కఁ హరిశ్చంద్రజనవిభుండు. 170

వ. అనిన విని కౌంతేయాగ్రజుం డటమీఁదివృత్తాంతం బెఱింగింపు మనుటయు. 171

మ. హితచేతోజలజాతసప్తహయ సాహిత్యక్రియాభోజ సం
తతనిర్వక్రపరాక్రమక్రమణమంథగ్రావసంక్షోభిత
ప్రతిపక్షధ్వజినీధవప్రబలగర్వప్రౌఢవాంభోనిధా
న తనూవిభ్రమచంద్రికావికచకాంతాలోచనేందీవరా. 172

క. శాండిల్యగోత్రవర్ధన, పాండిత్యాభరణ దానపాటవనవమా
ర్తాండతనూభవ విభవా, ఖండల దుర్వారవైరిగర్వాద్రిపవీ. 172

మాలినీవృత్తము. ద్యుమణివిమలతేజా తోయజాక్షీమనోజా
శమితవిమతలోకా సాధురక్షావివేకా
కమలభవసలీనా కల్పవృక్షోపమానా
హిమగిరిసమధైర్యా యెల్లనామాత్యవర్యా. 174

గద్యము. ఇది శ్రీమదాపస్తంబసూత్రపవిత్ర కౌండిన్యమునిచక్రవర్తిగోత్ర సకల
సుకవిజనానీకమిత్ర దేచనామాత్యకుమార వినయవివేకవిద్యాలం
కార శంకరకవినామధేయప్రణీతం బయినహరిశ్చంద్రో
పాఖ్యానం బనుమహాప్రబంధంబునందుఁ
ద్వి తీ యా శ్వా స ము.

శా. తాత్పర్యంబున జాహ్నవీజలములం దానంబు గావించి తా
హృత్పద్మంబున భక్తి నిష్పటిల విశ్వేశు న్మహాదేవునిం
బత్పంకేజనతామరుల్ గిరిసుతాప్రాణేశుఁ బూజించు సం
విత్పారీణున కబ్బు నెల్లపుడు తన్వీ ముక్తిసామ్రాజ్యముల్. 18

వ. అని కాశికామాహాత్మ్యం బవ్వరారోహకుం జెప్పుచుం జని చని. 19

సీ. కుముదమిత్రోపలగోపురంబులచేత విద్రుమప్రాకారపతతిచేత
మరకతహరినీలమండపంబులచేత బహుశాతకుంభకుంభములచేతఁ
జాల దీపించుముత్యాలమ్రుగ్గులచేతఁ గనుపట్టుపట్టుమేల్కట్లచేతఁ
గమనీయపద్మరాగచ్ఛత్రములచేత వృషరాజకేతనశ్రేణిచేత
మహితకర్పూరధూపధూమములచేత, నవ్యమాణిక్యనీరాజనములచేత
శంఖభేరీమృదంగఘోషములచేత, వెలయు నవ్విశ్వనాథుదేవళముఁ గాంచె. 20

వ. కాంచి యాసార్వభౌముం డద్దేవతాసార్వభౌమునిం బ్రవిమలభక్తిపూర్వకంబుగా దర్శించి సాష్టాంగదండప్రణామంబు లనేకంబు లొనర్చి చేదోయి మొగిడ్చి వేదోక్తప్రకారంబున నిట్లని వినుతింపం దొడంగె. 21

సీ. క్షీరాబ్ధిసంభవక్ష్వేలానలోగ్రకీలావళీనీలకంఠాజిరాయ
పవనాశనాధీశపర్యంకకంకపత్రాస్తమిత్రిపురాసురాయ
మౌళీందుచంద్రికాజాలస్ఫురద్దేవనిమ్నగాకైరవేందీవరాయ
పావనాచారసద్భక్తలోకానీకమానసాంభోజాతమధుకరాయ
వసుమతీధరకన్యకావర్తులస్త, నాగ్రకాశ్మీరసురభిదోరంతరాయ
మందిరాయితకైలాసకందరాయ, హస్తిచర్మాంబరాయ తుభ్యంనమోస్తు. 22

క. నాదుమనోభ్రమరము నీ, పాదాబ్జమరందబిందుపానక్రియలన్
మోదం బందఁగఁ జేయుము, కోదండీకృతసువర్ణకుధర మహేశా. 23

చ. అనుచుఁ బ్రియంబు మీఱఁ గొనియాడి ప్రదక్షిణ మాచరించి మ
జ్జననము ధన్యతం బొరసెఁ జంద్రకళాధరు విశ్వనాథుఁ బా
వనమతిఁ గాశికాపురనివాసునిఁ జూడఁగఁ గంటి మంటిఁ జ
య్యనఁ బెడఁబాపఁ గల్గెను భయంకరకిల్బిషసంచయంబులన్. 24

వ. అని పల్కుచు నచ్చోటు వాసి. 25

సీ. నీలవర్ణాంగుఁ ద్రిశూలహస్తునిఁ గాలభైరవుఁ జాల సద్భక్తిఁ గొలిచి
యన్నపూర్ణకు విశాలాక్షి కాశ్రితదేవతాధేనువులకు వందన మొనర్చి

మాధ్యాహ్నికక్రియాకలాపంబులు నిర్వర్తించి ముహూర్తమాత్రంబు తదీయసైకత క్షేత్రంబున వసియించి గమనాయాసంబు దొలంగుటయు నచ్చోటు వాసి వచ్చుచుం గాశీపుటభేదనప్రభావంబభివర్ణనాపూర్వకంబుగావినిపింపఁదలంచియిట్లనియె.

శా. ఏతత్పట్టణవైభవంబు లమరన్ హేలావతీ ధాతనున్
వాతాశప్రభు తారకాహితులనున్ వర్ణింపఁగా శక్యమే
చేతోజాతభయంకరుండు సుజనక్షేమంకరుం డిచ్చటిం
బ్రీతిం గాపుర ముండు శంకరుఁ డుమాబింబాధరాయుక్తుఁడై 9

క. పంచాస్యమధ్య యిచ్చటఁ, బంచత్వముఁ బొందె నేని పరికింపంగాఁ
బంచమహాపాతకుఁ డగు, పంచజనుం డైనఁ బంచబాణారియగున్. 10

సీ. క్ష్మాధరంబులు పాఁతు గదలంగ నేవేళ నోలిని సప్తవాయువులు విసరు
ద్వాదశరూపము ల్దాల్చి యుగ్రమయూఖుఁ డేవేళఁ బచరించు నెండఁ గరము
దుష్కరంబులుగాఁగ బుష్కలావర్తాభ్రజాల మేవేళ వర్షములు గురియు
భువనంబు లెల్ల నంభోమయంబులుగాఁగ విషరాసు లేవేళ వెల్లివిరియు
జంతునివహంబు లేవేళ సమసి పోవు, నట్టిదుర్దాంతభయదకల్పాంతవేళఁ
బొరయ దాపద నణుమాత్రమును గురంగ, నేత్ర యిక్కాశికాపురక్షేత్ర మరయ.

తే. ప్రసవకోమలి యీపురబాహ్యసీమఁ, గోరి వసియించు చండాలకులజు నైనఁ
బోలఁ జాలఁడు నిర్జరపాలకుండుఁ, గలవు ధర్మార్థకామమోక్షంబు లిచట. 12

తే. వనజలోచన యుత్తరంబునను దక్షి, ణమునఁ గొనియాడఁ దగువరణయును నసియు
క్రతుభుగీశ్వరదిశమణికర్ణికయును, బశ్చిమంబున దుండియుఁ బ్రణుతిఁ గాంచె. 13

క. వారాణసి వారాణసి, వారాణసి యనుచు భక్తివశుఁడై నరుఁ డం
భోరుహమిత్త్రోదయవే, ళారంభంబునఁ దలంప నడఁగు నఘంబుల్. 14

తే. వనరుహానన వందారుజనమనోర, థార్థదము లైనబహుపుణ్యతీర్థములకు
రాజు శ్రీకాశికానగరంబు సకల, వేదశాస్త్రపురాణార్థవిశ్రుతంబు. 15

క. కమలాయతాక్షి యిన్నగ, రము పంచక్రోశములును రాజీవభవా
ద్యమరసదాసేవ్యంబులు, శమితాఖిలభయదకలుషసముదాయంబుల్. 16

ఉ. పాత్రమహామతీ ప్రతిభ వాయక మర్త్యుఁడు కాశికాపురీ
యాత్రకుఁ బూని భక్తి నయిదాఱడుగుల్ గమనించినన్ మృగీ
నేత్ర యతండు గాంచుఁ దగ నిర్జరవల్లభతృప్తిహేతుయా
గత్రయపుణ్యపూర్వకము గాఁగ విశేషయశోవిలాసముల్. 17

చ. నినుఁ గినియంగఁ జాల కవనీధవ గాధితనూజుమానసం
బున కెడయై లఘుత్వమును బొందఁగ నేటికి నాకు నీవ నె
మ్మనమున బుద్ధియూఁది యొకమార్గముఁ జేసెదవంచు నుంటి మ
న్ననఁ దొలఁగించి నీదొరతనం బుడుపం దడవా తలంపఁగన్. 36

వ. అని యుత్తలంగున నక్షత్రకుండు పలుకునిష్ఠురాలాపంబులు బాణంబులుం బోలె మనోఘాతంబు సేయుటయు నారాజన్యచూడారత్నంబు వ్రీడాదైన్యంబులు ముఖారవిందంబున సందడింప నమందవ్యాకులత్వంబుం బొంది పుత్రుండును గళత్రంబునుం దక్కఁ దక్కినవిత్తం బణుమాత్రంబునుం గల్గమికిఁ జింతాఘునస్వాంతుండై చంద్రమతిం గనుంగొని యేమియుం బలుకనేరక యూఁగక బెట్టునిట్టూర్పులు నిగుడ్చుచు నానతశిరస్కుండై యుండుటయు నవ్విధంబు నిరీక్షించి యాపురంధ్రీశిరోమణి యింగితాకారభావజ్ఞతావిశేషగుణధుర్యయు సవినయవివేకగాంభీర్యభాషాచాతుర్యయు నై జీవితేశ్వరుం గనుంగొని. 37

ఉ. నిండినవేడ్కఁ లోకములు నిత్యము సన్నుతి సేయ ధారుణీ
మండల మెల్ల నేలినసమగ్రయశోవిభవుండ వీవు మా
ర్తాండకులేశ మూఢునివిధంబున భ్రాంతి వహించి చింతమై
నుండుట పాటిగాదు ధృతి యుల్లమున న్వెలసిల్లఁ జేయుమీ. 38

ఉ. మిక్కిలి దీనతం బొరయ మీ కిది యేటికి నేఁడు సెల్లియుం
దక్కవ చూచినన్ మితిదినంబు మహీరమణాగ్రగణ్య యీ
యక్కఱ కేయుపాయమున నైనను విత్తముఁ గూర్చి కీర్తి సొం
పెక్కఁగ మౌనివర్యుఋణ మిప్పుడ తీర్చుట మంచి దారయన్. 39

తే. మోస మగు నప్పు దీర్పకమున్న యొక్క, గడియ తడవైన మితి సరిగడఁచె నేని
క్షితితలేశ్వర నిన్ను బొంకింపఁ బూని, కంకణము గట్టుకొన్నాఁడు గాధిపట్టి. 40

చ. పలుమఱు మిమ్ము నివ్వటువు పాయక యుగ్రతఁ బల్కునిష్ఠురో
క్తులకు నొకింత యైన మది దుఃఖముఁ బొందకుఁ డీతఁ డెన్నిభం
గులఁ గడుమాననీయుఁడు తగు న్మన కీతనియాజ్ఞ సేయ నో
జలజసఖాన్వయాభరణ సత్యవచోవిభవప్రతిష్ఠకై. 41

ఆ. పార్థివేశ యడచి పాలు ద్రావించిన, చంద మీమునీంద్రనందనుండు
కినిసి ఋణముదీర్పుమని మిమ్ము మాటికిఁ, బరుషభాషణములు పలుకు నెల్ల. 42

శా. కూపంబుల్ తగుకోఁటలుం జెఱువులుం గుల్లన్ ధర న్నిల్పఁగా
నేపుణ్యం బొనగూడు మర్త్యులకు ధాత్రీశాన్వయగ్రామణీ

సిరిఁ బేరురంబునఁ జెలువొందఁ జేర్చిన కేశవస్వామికిఁ గేలు మొగిచి
ప్రత్యూహవార్వాహపటలికాగంధవాహుని దుండివిఘ్నేశు వినుతి చేసి
ప్రమదలీలల లోలార్కుఁ బ్రస్తుతించి, దండపాణికి సాష్టాంగదండ మొసఁగి
రూఢి నాసవభాండేశ్వరుని భజించి, యపగతాఘంబు ముక్తిమండపముఁ గాంచి.

వ. వెండియుఁ గల్గువిశేషదేవతాస్థానంబులు దర్శించి కృతార్థుండ నైతి నని యొక్కర
మ్యప్రదేశంబు చేరియున్న నాసమయంబున నపాంగంబున నంగారకణంబులు రాల
నృపాలశిరోమణిం గనుంగొని కపటక్రియాదక్షుం డగు నక్షత్రకుం డిట్లనియె. 27
చ. ధరణిప నేఁడు నెల్లియును దక్కువగా నెలనాళ్ళ నయ్యె నే
నరసితి లెక్కఁ బెట్టి మితి యాయెను లేదొకవీస మైన నే
వెరవున నింక మాఋణము వేగమె తీర్చెదొ కాక మిన్నకే
సురిఁగెదవో వివేకగుణశూన్యతఁ బొంది యసత్యవాదివై. 28

క. భూదయిత వినవె యాల, స్యాదమృతం విష మటంచు నార్యజనంబుల్
మేదిని నెల్లెడఁ జెప్పఁ బ్ర, మాదము మితి గడచె నేని మానీంద్రునిచేన్. 29
తే. మనుజనాథ వృథాప్రయోజనమునందుఁ, దెలియనేరక యూరక దినదినంబుఁ
బ్రొద్దుఁ బుచ్చుచు మాయప్పుసుద్దియెల్ల, మఱచియున్నాఁడ విది భావ్యమా తలంప.

చ. ఇఁక మొకమోటు మాత్మ నొకయించుక నిల్వకఁ గ్రూరవృత్తిఁ గౌ
శికమునిమీఁద నాన యిడి చెచ్చెర నంగడి నడ్డపెట్టి పా
యక బహుబాధలం బొదలునట్లుగఁ జేయక మాధనంబు రా
దకట నృపాల యిట్లు తగవా నను నిష్ఠురుఁ జేయ నేటికిన్. 31
ఉ. ఎంతయు దోష మయ్యె ముని యెప్పుడు వచ్చునొ వచ్చినప్పుడేఁ
గొంతయు స్వాపతేయ మిదె కొమ్మని యియ్యక నున్న రోషిత
స్వాంతుఁ డగున్ మునీశ్వరుఁడు సంశయ మించుక యైనఁ గల్గఁదా
కంతువిరోధికిం దరముగా దణఁపంగఁ దదీయకోపమున్. 32

క. వీతజపహోమనియముఁడ, వై తిరిగియు నిన్నుఁ గూడి యరకాసయినం
జేతికి వచ్చినయది లే, దీతుదకుం గినుక వుడమ కెట్లుందు మదిన్. 33
క. ఇదె యిచ్చెద నదె యిచ్చెదఁ, బదపదఁ డని యాసఁ జూపి పలుదెఱఁగుల నా
హృదయము నొప్పించితి విఁక, గుది ద్రోసెద నేడు నిన్నుఁ గొంకక యిచటన్.
తే. అదనుపదనని కూర్చి మాయప్పు దీర్చి, పొమ్ము నీవన్నఁ బోమె యీపోరు మాని
బడలి జీతము పెట్టనిబంట నగుచు, వెఱచి నా కేల నీవెనువెంటఁ దిరుగ. 35

క. దారసుతాదులమోక్షము, గోరెడువారలకుఁ దగదు కూడఁగ నని వి
స్తారమతి సూరిజనములు, ధీరతఁ దన్మోహలతలఁ ద్రెంపుదు రనఘా. 54

మ. ప్రతికూలోక్తులు పల్కఁగా వలదు భూపాలాగ్రణీ యిత్తఱిన్
ధృతిఁ జిత్తంబున నిల్పి దిగ్భరితకీర్తిస్ఫూర్తితోఁ గూడి సూ
నృతవాక్సంపదఁ బొందు భూజనులు వర్ణింపంగ నామీఁది మో
హతమఃపుంజముఁ బాపు చిన్మయవివేకాదిత్యబింబంబుచేన్. 55

వ. అని దండప్రణామంబు లాచరించి కరకమలంబులు మొగిడ్చుటయు నగ్గంధగజగామినిం గనుంగొని వసుంధరావల్లభుం డుల్లంబున నొక్కింత ధైర్యం బవలంబించి యిట్లనియె. 56

తే. ప్రసవకోమలి విను నాఁడు భయద మగుచుఁ, బేర్చుకార్చిచ్చు చొరఁగఁబంపినవిశేష
దోషకారికిఁ గఠినచిత్తునకు నాకు, నిప్పుడీతెంపు సేయుట యెంత పెద్ద. 57

శా. ఏణీలోచన నానిమిత్తమున నీ కీపాటు పాటిల్లెనే
క్షోణీనాథులరాణివాసములు చక్షుఃకాంతు కావాదిని
శ్రేణీలాలితహర్మ్యవాటికలలోఁ గ్రీడావిశేషంబులన్
బ్రాణేశాన్వితలై నిరంతరసుఖప్రౌఢిన్ వినోదింపఁగన్. 58

తే. సకలరాజన్యకన్యకాజనము లపుడు, నీకుఁ బరిచర్య చేయుచు నెమ్మిఁ గొలుతు
రుత్పలేక్షణ యిపుడు ని న్నొక్కరునికి, దాసిఁగా విక్రయింపఁగఁ జేసె నజుఁడు.

మ. తనుమధ్యన్ హరినీలవేణి బిసహస్తం బక్వబింబోష్ఠిఁ జం
దనగంధిం బికవాణిఁ బీనకుచఁ గాంతామౌళిరత్నంబు నా
కనుసన్నన్ మెలఁగంగ నేర్పుగలరాకాచంద్రబింబాననన్
నినుఁ బాపె న్విధి నేటితోఁ గలువకంటీ నిర్దయస్వాంతుఁడై. 60

తే. తరుణి నామాట కడుగేఁడు దాఁట వెలితు, వలివ నామానసమునఁ బాయక వసింతు
వింతి నాకన్నపెన్నిధి వెన్నిచూడ, లలన నాపూజ్యసామ్రాజ్యలక్ష్మి వీవు. 61

సీ. మందిరారామసీమంబులై విలసిల్లు భయదాటవులు పద్మపత్రనయన
కనకహర్మ్యంబులై కనుపట్టు సానుమద్గహ్వరాంతరములు సింహమధ్య
పట్టెమంచముమీఁదిపఱుపులై శోభిల్లుఁ బూరిపానుపులు కర్పూరగంధి
శాల్యోదనంబులై చవులు పుట్టఁగఁజేయు శాకపాకాదులు సదమలాంగి
గరిమ నినుఁగూడి చరియించుకతన నాకు, నిందుబింబాస్య యిన్నాళ్లి కిపుడు నేఁడు
పొగడఁదగు నాదు రాజ్యవిభూతులెల్ల, నెరియఁ నెడఁబాసిపోవుటి యొలుకపడియె.

యాపుణ్యంబు దయంబ ప్రాప్త మగు నిత్యస్ఫూర్తిమై సత్యభా
షాపారీణులకున్ వివేకము మదిన్ సంధిల్ల నూహించినన్. 43

ఉ. కావున సత్యవాక్యగుణగౌరవసంపద లేశమాత్రమున్
బోవఁగనీక నెంతయుఁ బ్రభుత్వము మీఱఁగ నిత్యకీర్తిహా
రావళులం దిశాజలరుహాక్షిముఖీకుచకుంభపాళికల్
శ్రీవిలసిల్లుచుండఁ గయిసేయుము రాజులు సన్నుతింపఁగన్. 44

తే. అర్థమున కిప్పు డొండుపాయంబు లేదు, వినుము ధీరతతో నను విక్రయించి
తీర్పు సగమైన నేఁడు గాధేయుఋణము, కడమకొక్కయుపాయంబుగలుగు నెల్లి.

చ. అనవుడు నంతరంగమున నమ్ములు నాటినకంటె దుఃఖము
బ్బిన వెగ డొంది భూవిభుఁడు ప్రేయసిఁ జంద్రమతీసతీమణిం
గనుఁగొని పల్కె నశ్రువులు కన్నులఁ గ్రమ్మఁగఁ బద్మగంధి యి
ట్లనుచితరోషభాషణము లక్కట పల్కఁగ నీకుఁ బాడియే. 46

క. దురితంబు గట్టుకొంటివి, హరహర వినరానియట్టియతిపరుషవచ
స్స్ఫురదగ్నిశిఖలు నాక, ర్ణరంధ్రవిపినములఁ జొనిపి నలినదళాక్షీ. 47

చ. ఇలఁ బరికించినం బతుల కెట్టిప్రయాసముఁ బొంది యైనఁ గాం
తలఁ దగుభంగిఁ బ్రోచుటయె ధర్మము లేమల విక్రయించి యో
జలరుహనేత్ర భర్తలకుఁ జన్నె సుఖస్థితిఁ జెంది యుండఁగా
నలికులవేణు లిందులకు నందులకుం బరభోగహేతువుల్. 48

క. కులశీలరూపగుణములు, గలిగినసతి భార్య యగుచుఁ గనుసన్నల ని
చ్చలు మెలఁగ నుండుపురుషుని, చెలువము చెలువమ్ము గంధసింధురగమనా. 49

క. సతి నమ్మి బ్రతుకఁ బూనెడు, పతికంటెను దోసకారి పరికింపఁగ నీ
క్షితిలోన లేఁడు నావుడు, ధృతి మెఱయఁగ నపుడు సాధ్వి నృపునకు ననియెన్.

ఉ. అంచితసత్యవాగ్విభవ యాపదఁ జెందిన విత్త మెల్ల వ
ర్జించి కులాంగనం గరుణఁ జేకొనఁగాఁ దగు భార్య నైన న
ర్వంచన విక్రయించి యనివార్యవివేకకళాధురీణతా
భ్యంచితవృత్తి భర్తకు నుపద్రవముం బెడఁబాయఁగాఁ దగున్. 51

క. భూవర వివరింపఁగ భా, ర్యావిక్రయపాతకంబు నైనను బాయం
గా వచ్చుఁ గాని మఱి మి, థ్యావాగ్దోషంబుఁ బాయఁ దర మెవ్వరికిన్. 52

తే. అనృతభాషణుకంటె దోషాధికుండు, సత్యవాచాన్వితునికంటె నిత్యసుకృతి
వెతకి చూచినఁ బొడమఁ డుర్వీతలేశ, పవనభుజ్మానవామరభువనములను. 58

వ. ఇట్లు వినుతించి యతనిపిఱుందం జనుదెంచు నాత్రైలోక్యసుందరి యగుచంద్రమతిం
గనుంగొని. 72

సీ. అరుణాబ్జచరణ కాహళజంఘ కదళికాస్తంభోరువు పులినతలనితంబ
యావర్తనాభి పంచాననమధ్య చక్రస్తని బిసహస్త కంబుకంఠి
బింబోష్ఠి దాడిమీబీజరదన చారుతిలపుష్పనాస యిందీవరాక్షి
కార్ముకభ్రూయుగ కైరవాప్తశకలఫాల పురందరనీలవేణి
మత్తగజయాన చంద్రికామందహాస, ప్రవిమలస్వర్ణకేతకీప్రసవగర్భ
దళతనూవర్ణ పరిపూర్ణధవళకిరణ, వదన యీయింతిచెలువంబు వశమె పొగడ. 73

చ. అని కొనియాడుచుండ వినరయ్య కృపామతిఁ బౌరులార స
జ్జనసుతకీర్తులార గుణసాగరులార మదీయ మైనవ
ర్తనము సమస్తముం దెలియ దాఁచకఁ జెప్పెద నంచుఁ బల్కె ని
ట్లని జననాయకాగ్రణి ముఖాంబురుహంబున దైన్య ముబ్బఁగన్. 74

తే. జలజహితవంశజుఁ డను ద్రిశంకుధరణి, జానిసుతుఁడ హరిశ్చంద్రజనవిభుఁడను
ద్రుహిణనిభుఁ డగు గాధిపుత్రునకు ధాత్రి, దాన మిచ్చినవాఁడ నుదారమహిమ.

చ. అనిమిషలోకవర్ణితమహామహిమాస్పదమూర్తియైనయ
మ్మునికులచక్రవర్తి కటమున్న మఖార్థము ప్రేమ నిత్తు నే
నని యొడఁబడ్డవిత్తమునకర్థి నుపాయము లేమి నీవధూ
జనమణి నమ్మఁ బూనితి నసత్యముఁ బొంద మనంబు గొల్పమిన్. 76

ఉ. అత్రిసమానులు న్రవిసుధాంశుకులీనులు మన్మథద్విష
న్మిత్రనిభార్థవంతులు నమేయబలాఢ్యులు నైనబ్రాహ్మణ
క్షత్రియవైశ్యశూద్రకులసంభవులార మదీయభార్య స
త్పుత్రవతిన్ ధనార్థినయి పోకడఁ బెట్టెద రండు విల్వఁగన్. 77

సీ. నిద్దంపునునుమించుటద్దంబుఁ బ్రహసించుముఖమండలము గలమోహనాంగి
వెలిదమ్మిరేకులవిభ్రమంబులఁ గెల్చుకన్నులు గలకలకంఠకంఠిఁ
బూవుగుత్తులతోడఁ బోరాడ నోపువక్షోజము ల్గలమృగరాజమధ్యఁ
గొదమతుమ్మెదలకుఁ గొద ఘటింపఁగఁజాలు కుంతలంబులు గలగురునితంబఁ
బచ్చిపగడంపుఁదీఁగకు హెచ్చుఁ జూపు, కెంపువాతెఱఁ గలరాజకీరవాణిఁ
బ్రణుతిఁ గాంచిన నాపాలిభాగ్యలక్ష్మి, విక్రయించెదఁ గొనరయ్య వేగవచ్చి. 78

క. కులసతి నమ్మెదువేఁదుఱు, గలఁడే యని పరిహసింపఁగా వలవదు నా
పలుకులు విని ననుఁ గృపతో, వెలయఁగ రక్షింపరయ్య వేఁడెద మిమ్మున్. 79

క. ఏణాక్షి నిన్నుఁ బాసినఁ, బ్రాణంబులఁ బాసినట్లు భవదీయగుణా
క్షీణప్రతిభావిభవము, ద్రోణికగా నేఁ దరింపుదున్ విపదబ్ధుల్. 63

వ. అని చింతాపరంపరాయత్తచిత్తుండై యున్న యానృపోత్తముం గనుంగొని వెండి
యుఁ బ్రచండకోపంబునం దాపసకుమారుం డిట్లనియె. 64

శా. ఆలస్యం బొనరింప నేటికి నృపాలా తెమ్ము మాసొమ్ము స
త్యాలాపంబులు సెల్వ దేని మతి మోహం బిమ్మెడన్ మానుమీ
జాలిం బొందెద వాలి నమ్ముటను సంసారంబుపై భ్రాంతినో
యీలాగు ల్మనమెచ్చ గావు తుది నిన్నెంతైనఁ బోనిత్తునే. 65

క. ఇక్కాలువకంటి నమ్మక, దక్కిన వేఱొండు గలదె తర్కింపఁగ నీ
యక్కఱకు ధనము గూర్పఁగ, గ్రక్కున నంగడికి రమ్ము కాంతయు నీవున్. 66

ఉ. పోయిన యంతవట్టునకుఁ బోకడ పెట్టుచు శీఘ్రవృత్తిమై
నీయుడురాజబింబముఖి నేటికి నూరక మాటిమాటికిన్
మాయలు చేయ నీకు నిది మానవనాయక హేయమైన గా
ధేయునితోడ నొక్కపటి తెంపున నాడు మసత్యవాక్యముల్. 67

వ. అని కేలు గేలం గీలించి తివియ నుద్యోగించుటయును నమ్మునికుమారునిష్ఠురవచనంబు
లకుం గలంగి యయ్యాదిమచక్రవర్తి కులాంగనావిక్రయార్థం బప్పట్టణవిపణిమార్గం
బునకుం జనుదేర నయ్యవసరంబునఁ బౌరజనసమాజంబు లత్యంతసంభ్రమంబునం
జనుదెంచి. 68

సీ. ఆజానుదీర్ఘబాహాదండయుగళంబు మేరుసానువుఁ బోలు పేరురంబుఁ
బ్రాభాతజలజాతపత్త్ర నేత్రంబులుఁ జాలవెడల్పైనఫాలతలము
నాకాశమణిబింబనీకాశతేజంబుఁ గంబుబిబ్బోకంబు గలగళంబుఁ
బద్మరేఖాస్ఫూర్తి భాసిల్లుపదములు సింహంబుఁ దలపింపఁ జేయుగతియుఁ
గలిగి యొప్పారి రెండవకైటభారి, మాడ్కి నున్నహరిశ్చంద్రమనుజవిభుని
ననిమిషేక్షణముల విలోకన మొనర్చి, యుల్లమున సమ్మదంబులు వెల్లివిరియ. 69

ఆ. ఇమ్మహానుభావుఁ డెవ్వఁడో యెఱుఁగంగఁ, బోల దధికతుహినజాలపిహిత
కమలసఖుఁడుపోలెఁ గానంగ నయ్యెడు, నెచటినుండి యొక్కొ యితని రాక. 70

చ. శిరమునఁ బూపచందురుఁడు చెన్నువహింపని మేరుధన్వియో
యురమునఁ గౌస్తుభంబు చెలువొందని యిందిరప్రాణనాథుఁడో
కరమున శైలభేది యగుకైదువ లేనిశచీకళత్త్రుఁడో
తిరముగ నీతఁ డంచు వినుతించిరి హంసకులావతంసమున్. 71

సీ. కాపట్యమును దీర్ఘకోపంబు గర్వంబు యతుల కేటికి మహీపతులయెడల
నలఘువివేకశూన్యులు భూమిదివిజులు విపరీతములు నీరివృత్తు లెల్ల
విశ్వసింపఁగ రాదు వీరి వైయ్యైన నత్యంతమాయావాదు లరసి చూడ
నుపకార మొనరించినపరమపుణ్యుల కపకార మొనరింతు రదను వేచి
బలిదనుజుఁ జేరి వామనబ్రహ్మచారి, మును పదత్రయమాత్రంబు భూమి వేఁడి
పిదప నాతని బంధించి పెంపు డించి, పూని త్రోయఁడె పాతాళభువనమునకు.

చ. అరయఁగఁ గశ్యపాదివసుధామరవర్గము జామదగ్న్యుచే
ధరణితలంబు సర్వము నుదంచితలీలఁ బరిగ్రహించి యా
నిరుపమదానకల్పకము నీరధికోణమునందు నైన సు
స్థిరముగ నుండనీక నతిశీఘ్రముగన్ వెడలంగఁ ద్రోయరే. 92

ఉ. ఇన్నియు నేల కౌశికమునీంద్రుఁడు తొల్లి వసిష్ఠునింట ని
ష్టాన్నములన్ భుజించి తుది నాతని కెగ్గొనరించెఁ బూని నేఁ
డిన్నరనాయకోత్తము నహీనవితీర్ణనిధాను నిత్యస
త్యోన్నతుఁజాల లాఘవము నొందఁగఁ జేయుచు నున్నవాఁ డొగిన్. 93

తే. అనుచు బలుకుచు నుండఁగ నందులోన, నొక్కకొందఱు పాణిపయోరుహములు
కర్ణపుటములఁ జేర్చి దుఃఖము జనింప, విశ్వనాథునిఁ గాశికావిభునిఁ దలఁచి. 94

క. విత్తము గలదని నరనా, థోత్తమ కామినులఁ గొనఁగ నుచితం బగునే
యొత్తిలి వారల నడిగపుఁ, దొత్తులఁగా నేలఁ జాలుదురె మనబోఁటుల్. 95

క. మన మెక్కడ నివ్వనజా, నన యెక్కడ గర్వమున ధనం బిడి తెగువం
గొను టెక్కడ వరవుడుగాఁ, బనిఁగొను టెక్కడఁ దలంప భావ్యం బగునే. 96

ఉ. కోరి తలంప సింహమునకున్ మఱి సింహమె కాక దండ పెం
పారఁగ జంబుకం బవునె యట్టివిపరీతసమస్తధారుణీ
భారము పూని కీర్తిరమఁ బాయనియీతని కెందుఁ బ్రాపు కా
శీరమణుండు దేవగణసేవ్యుఁడు శంభుఁడు గాక మర్త్యుఁడే. 97

వ. అని యుగ్గడించుచు మన కిచ్చెలువ విలువం గర్తవ్యంబు కాదని పురజనంబులు నిజ
మందిరంబులకుం జని రంత. 98

సీ. గాధినందనునిచే బోధితుండై శనైశ్చరుఁ డటమున్న యప్పురికి నరిగి
వికృతమహీసురవేషంబు గైకొని కపటవృత్తిక్రియానిపుణుఁ డగుచు
గణన చేయఁ దరంబు గానిసమగ్రసంపద గల్గి యనుభవింపంగ లేక
పచ్చపైకంబైన విచ్చంబు చేయుట స్వప్నంబునను గానివావిగాఁగ

వ. అని యత్యంతదైన్యంబునం గులాంగనావిక్రయంబు గావించు నాచక్రవర్తిం గనుంగొని పౌరజనానీకంబులు శోకాతిరేకంబున. 80

చ. అకట వెడంగు గాఁడె ధర నారయ నీనరనాయకుండు కౌ
శికుకపటంపువాగురలఁ జిక్కి యొకింత యెఱుంగ లేక క
ల్పకనిభదానవిస్ఫురణఁ బాయక సర్వమహీతలంబు నా
రక యొసఁగంగ నేటికి విరక్తి జనింపఁగ వేగిరించుచున్. 81

క. అదియును గాక కులాంగన, సుదతీరత్నంబు నమ్మఁ జూపుచు నున్నాఁ
డిదె యాతనిబుణమునకై, వెదకిన ధరలోన నిట్టివేఁదుఱు గలఁడే. 82

తే. కొంతమాత్రపుటీవి గాకింత లేసి, దలము తప్పినయీవులు తగునె యియ్య
నిచ్చి మఱికోలుకొన లేక యేపుదఱిఁగి, పోవఁ దెగడరె జనులు దుర్బుద్ధి యనుచు.

క. దారసుతయుక్తముగ సం, సారం బంతయును విడిచి చరియించుమహా
వైరాగ్యనిధియె యీవసు, ధారమణుఁడు ధరణి యెల్లఁ దపసికి నొసఁగెన్. 84

ఉ. ఇంకొకనాటిమేలునకు నిప్పటిసౌఖ్యముఁ బాసి యింతయుం
బొంకము తూలి యుండుటయు బుద్ధియొకో పరికించి చూచినన్
శంక యొకింత లేక యతిసాధ్వి సరోరుహపత్రనేత్ర నే
ణాంకముఖిన్ విలాసవతి నమ్మఁగఁ బూనె వివేకహీనతన్. 85

క. నాలుక యెట్లాడెనొ యీ, నీలాలక విక్రయింప నృపతికి మోహం
బేలీల నుడిగె ధైర్యం, బేలాగునఁ బాదుకొనియె హృదయములోనన్. 86

ఉ. ఈయెలదీఁగఁబోఁడిఁ గృప యించుక కల్గక విక్రయించు ట
న్యాయము మేదినీపతికి నారయ నక్కట యెంత కల్గినం
బాయక స్వాపతేయ మొకభంగి మహిం బడయంగ వచ్చుఁ గా
కీయెడ నైన నిట్టిశరదిందుముఖిం బడయంగ వచ్చునే. 87

వ. అని పలుకుచుండ వెండియుఁ గొందఱు లోకో భిన్నరుచి యనువాక్యంబు నిక్కంబుగా నిట్లనిరి. 88

ఉ. ఈరవివంశదీపకుని నేటికి నేరము లెన్న భూపతుల్
ధారుణిఁ దొల్లివిప్రులకు దానము లియ్యరొ విత్తముల్ మహా
దారతతో నొడంబడరొ దర్పమునం జలపట్టి యీగతిన్
ఘోరవిపత్పరంపరలఁ గుందఁగఁ జేయరు గాక క్రూరతన్. 89

క. కడుభక్తి మొక్కఁ జనుచో, గుడి మీఁదం బడినయట్లు కువలయపతికిన్
బడిపడి దానము లియ్యఁగఁ, దొడఁబడఁ గౌశికునిచేత దొసఁగులు దగిలెన్. 90

దూరదేశము పోయి చోరమార్గంబున బలిమిమైఁ దెచ్చినపరవధూటిఁ
గలుషంబునకుఁ దలంకక భార్యయని బొంకి విక్రయించుట మాకు విశద మయ్యె
నారెకులు చూచి రేని మహాప్రమాద, మీవిలాసిని విడిచి నీ వెచటి కయిన
వేగ నుఱుకుము కాదేని విశ్వసించి, పూని నాయుపదేశించుబుద్ధి వినుము. 107

ఉ. బానిసెగాఁగ నీవికచపద్మదళేక్షణ ధారపోసి స
న్మానముమీఱ నాకొసఁగుమా భవదీయకృతాపరాధముల్
పూనిక నేను గైకొని ప్రభుత్వము గానఁబడంగ నిల్చి యె
వ్వానికి లోఁగ కెంతతొర వచ్చినఁ గాచెద నిన్నుఁ గూరిమిన్. 108

క. అని యీగతి బల్లఱపులు, గొనకొని యఱవంగ విప్రకులజానితో న
మ్మనుజేంద్రుఁ డధికధైర్యం, బున నిట్లని పలికె శంకఁ బొందక తెలివిన్. 109

మ. అవివేకంబున విప్రలాపముల నేలా పల్కెదీలాగునన్
రవివంశుండఁ ద్రిశంకునందనుఁడ నే రాజ్యంబు పాలించుచో
భువిలో నెన్నఁడుఁ జోరశబ్దము వినన్ భూదేవ యిన్నాళ్ళకున్
జెవి సోఁకెన్ మదిలో నసహ్యముగ నీచేతన్ మహాదోషముల్. 110

చ. అతిశయరోషసంయుతమహోహింభయంకరమండలాగ్రఖం
డితరిపుదంతికుంభతటనిర్మలమౌక్తికరాజిఁ బూని యా
యతజయలక్ష్మికిన్ బరిణయాంగముగాఁ దలఁబ్రాలు వోయుపా
త్రత గలక్షత్రవంశజాకరంబులు హాలికవృత్తి కోర్చునే. 111

చ. భయమును బొంది దైన్యమునఁ బాఱుఁడు వచ్చి మఱుంగుఁ జొచ్చినం
దయ దలకొత్తఁగా నభయదాన మనూనముగాఁగ నిచ్చి ని
శ్చయమతితోడఁ బ్రోచు టది క్షత్రియధర్మము గాక నాకు ని
న్నియును బరిత్యజించి మహినిర్జరుచాటున నుండఁ బాడియే. 112

క. ఆలాగునఁ జరియించిన, నేలా ధరియింప విల్లు నిషువుల పెల్లున్
వాలుఁ గరవాలు నసువుల, కీలు ఘనశ్రీలు విమలకీర్తుల మేలున్. 113

క. చెట్టి దను మోవవచ్చిన, పట్టున ధైర్యంబు వదలి పలుమఱు మిగులన్
రట్టుపడి తమకి మదిలో, నట్టిట్టనె నేని నవ్వరా సరివారల్. 114

సీ. సర్వసర్వంసహాచక్రంబు గాధినందనునకు నేర్పడ ధారపోసి
యాజటిలోకబిడౌజాన కటమున్న యజ్ఞకారణము నెయ్యమున నియ్య
కొనినవిత్తమునకు వనజాయతేక్షణ విక్రయింపంగ నుపక్రమించి
నాఁడ హరిశ్చంద్రనామధేయాంకుఁడ నీలీల దుర్భాష లేల నీకు

వడ్డి కడువెక్కసంబుగా నొడ్డి పెక్కు, చోటుల ఋణంబు లిచ్చి నిష్ఠురతఁబూని
కాలకౌశికుఁ డనుపేరఁ జాల దీన, భావ మెల్లను దనయందుఁ బాదుకొనఁగ. 99

ఉ. ఈభువిఁ బాముకుం బలియు నీఁగకుఁ గాటును నీక యెంతయున్
లోభపరాయణాత్మకులలోనఁ బ్రసిద్ధుఁ డితం డనంగ ని
ష్ప్రాభవవృత్తిఁ బూని కలుషంబున కోడక మానసంబునం
దాభయ మేది యుగ్రతరదానము లోలిఁ బరిగ్రహించుచున్. 100

తే. మెలఁగువాఁ డంగడికి వచ్చి మేదినీశు, మాట లాలించి మిగులసమ్మదముఁ బొంది
దమ్ముఁ డిఁక నేఁడు నాచేతఁ దగులువడియెఁ, గౌశికునిఁ బ్రీతినొందింపఁగలిగె నాకు.

సీ. ఎదురయ్యె నాఁడుఁబోయినతీర్థ మద్భుత మావహిల్లంగ నీయవసరమునఁ
గపటకృత్యంబులు కల్పించి వెఱపించి బెదరిపోవంగఁ జేయుదు నృపాలుఁ
గాదేని మదిలోనఁ గరుణారసము పుట్టునుచితవాక్యంబుల నూఱడించి
వక్రించి కులకాంత విక్రయించుతలంపు సర్వంబు నుడుపుదుఁ జతురలీల
నంతలో నేఁడు నెల్లియునరిగె నేని, కడచుమితి బొంకుపోరయు భూకాంతునుడువు
ననుచుఁ గృతనిశ్చయుం డయి యాక్షణంబ, నృపశిఖామణిముందఱ నిల్చుటయును.

సీ. దేవురించుచు వాజెదేఱెడుమొగమును బడఁ బాఱుచుండెడిబడుగుటొడలుఁ
బొలుపేది మెదుకకంపును నీనుసిగయును బల్లమీసములును బిల్లికనులుఁ
జింబోతుగడ్డంబుఁ జెడ్డచూపులుఁ జాలఁ జివికినకోలయుఁ జింపిగొడుగుఁ
బాఁతదోవతులును బంచాంగమును ఫాలతలమునఁ బట్టెవర్ధనముఁ గలిగి
ముష్టి యెత్తినధాన్యము లుమ్మడిచినట్టి, ముటికిబట్టలు మూఁపుపైఁ దఱచు వ్రేల
నేవ మొనరించుమాయామహీసుపర్వుఁ, గాలకౌశికుఁ జూచె భూపాలకుండు. 103

వ. చూచి యతనియఱుతం బెనంగొనియున్న యజ్ఞోపవీతంబులకతంబున మహీదేవునిం
గా నెఱింగి కరారవిందంబులు మొగిడ్చి వందనంబుఁ జేసిన మందహాసం బొనర్చి యా
రాజమందారునకు నతం డిట్లనియె. 104

తే. నీదువంశంబు నడకయు నిశ్చయముగఁ, దెలియునందాఁక నాశీర్వదింప రాదు
మాకు నెఱుఁగంగఁ జెప్పుమా నీకులంబు, వర్తనంబు నిజంబుగ వలయుఁ దెలియ.

క. ఎవ్వండ వీవు నీవా, రెవ్వరు నీనామధేయ మెయ్యది మిగులన్
నివ్వటిలుచులుకఁదనమున, నివ్వనితన్ విక్రయించె దేయక్కఱకున్. 106

సీ. వివరింప బందికాఁడవువలె నున్నాఁడ వవయవస్ఫురణచే నదటుగల్గి
కూలిపనులు చేయ హాలికవృత్తికి నోపుదు వీకృత్య ముచిత మగునె

బంతము తూలె నంచు మఱి పల్కక మిన్నక యున్న నిన్ను భూ
కాంత వధింపఁగాఁ జనునె కౌశికమౌనికి నింత యేటికిన్. 124

వ. అనుటయు దరహసితవదనుండై హరిశ్చంద్రుం డద్ధరిత్రీదేవునిం జూచి నీవంటిలోభగుణవర్తనులకు నేతత్ప్రకారంబు లుపన్యసింపం దగుఁ గాక, మాకుఁ బొందువడునే నీ వింక నేమియుం బలుకక తలంగి చను మనిన నక్కాలకౌశికుం డమ్మహీపాలుని సూనృతాలాపప్రభావంబునకు మనంబున నత్యాశ్చర్యంబు నొంది యసమీకనృపాలా నీకు నీయపాయవిమోచనంబునకు నుపాయంబులుగఱపినంగోపించెదవనిమఱియును.

శా. భార్యం బోకడఁ బెట్టి నీవు మదిఁ దాపం బేమియున్ లేక గాం
భీర్యం బొందఁగ నున్నవాఁడ వఁట యోపృథ్వీశ మాకేటికిన్
ధైర్యం బెంతయు వీఁటిబుచ్చి వగవన్ దర్కించి నీమీఁదితా
త్పర్యస్ఫూర్తిని బుద్ధిఁ జెప్పిన విరుద్ధం బయ్యె నీ కింతయున్. 126

తే. అనుచు నడిగినవిత్తంబు నాక్షణంబు, యింద మని పైఁడిటంకంబు లెన్ని పంక
జాప్తవంశజునకు నిచ్చి యమ్మహీసు, రాధముఁడు మానసమ్మునఁ గ్రోధ మెసఁగ.

క. ఆననపంకజసౌరభ, మానెడియలు లనఁగఁ బొల్చు నాచంద్రమతీ
మానవతికురులు వేగ న, హీనగతిం బట్టి తిగిచె నెంతయు బలిమిన్. 128

తే. కొంతద వ్వట్లు తిగుచుచు ఘోరభంగిఁ, బుండరీకంబు ధేనువుఁ బోలెఁ బోవ
దూడకైవడిఁ జని తల్లిఁ గూడముట్టి, యాఁగి వాపోవుసుతు లోహితాస్యుఁ జూచి.

మ. ధరణీనాథుఁడు దుఃఖితాత్ముఁ డగుచుం దైన్యంబుతో గద్గద
స్వగవాక్యంబులఁ గాలకౌశికుని దుష్టస్వాంతునిం బల్కె భూ
సుర గోవుం గొని క్రేపుఁ బాపుదురె మత్సూనుం గొనుం డిచ్చెదన్
శరదిందుప్రతిమానసుందరతనూసౌభాగ్యసంపన్నునిన్. 130

తే. జట్టి వీనికి హేమనిష్కములు కోటి, తెచ్చి యిమ్మనుటయు ధరిత్రీసురుండు
భానుకులమణిఁ జూచి భూపాల నీదు, పల్కు నిక్కంబ యింకొక్కపాటివినుము.

క. ధేనువుఁ గొనుచోఁ గ్రేపును, ధేనువుతో లివిలువలోనిదియ కాక మహిన్
ధేనువునకుఁ గ్రేపునకును, క్ష్మానాయక వేఱువేఱుజట్లుం గలవే. 132

వ. అనుటయుఁ గాలకౌశికునకు నమ్మహీపాలుం డిట్లనియె. 133

తే. ఇంక నోవిప్ర దుర్భాష లెల్ల నుడిగి, నాదువేఁడినవిత్త మంతయును నిచ్చి
సుతసమేతంబుగా నీప్రసూనగంధిఁ, దోడుకొని పొమ్ము కాదేనిఁ దొలఁగు మీవు.

వ. అని యివ్విధంబున నమ్మహీసురుండును నమ్మానవేశ్వరుండును గలహింప నక్షత్రకుండు నిరీక్షించి యోవసుంధరాధ్యక్ష మీ కిరువురకుఁ బరస్పరాక్షేపంబులఁ గోపంబు లేమి

మిన్నకుండుము కాదన్న మెలఁతఁ గొనఁగఁ, జాలితివయేని హేమనిష్కములకోటి
జట్టిగా నిచ్చి మన్మనస్తాప మెల్లఁ, బాపి కొనిపొమ్ము విప్ర యీపద్మముఖిని. 115

ఉ. నావుడు బ్రాహ్మణుండు నరనాథున కిట్లనుఁ గొంతసత్యవా
చావిభవంబు గానఁబడె జయ్యన నియ్యెడ మాకుఁ గర్ణసౌ
ఖ్యావహ మయ్యె నీవచన మారయ నీకు నభీష్టసిద్ధియౌ
భూవర యింతదైన్యమును బొందఁగ నేటికిఁ జక్రవర్తికిన్. 116

చ. విను మిఁక నొక్కబుద్ధి పృథివీతలనాయక నాదువాక్యముల్
మనమున వేఱె యుండుగఁ దలంపకు పౌరులు గేలి సేయ నం
గనఁ గొనరయ్య యంచు నధికం బగుదీనత వాడవాడలన్
గొనకొని పల్కుచుండు టిది కూళతనంబు తలంచి చూచినన్. 117

క. రేయును బగలును నయమునఁ, బాయక నడియాసఁ జూపి భ్రమయించుచుఁ దా
నేయెడల నప్పుదీర్పకఁ, ద్రోయుటయే జాణతనము తుదిఁ బరికింపన్. 118

క. గాసిలి యప్పులవారలు, తీసినకొట్లును గలవె ధృతిఁ బరికింపన్
వేసరి పలుమఱు నడిగి ప్ర, యాసమునకు నోడి తారె యరుగుదు రెందున్. 119

క. నేర్పున నప్పులు గొని తుదిఁ, దీర్పక దక్కించుకొనెడితెరువులు నే నీ
కేర్పడఁ జెప్పెదను విను మ, హార్పతికులతిలక మిగుల ననువుపడంగన్. 120

సీ. తనభూమి వదలక ధనవంతు లగువారియిండ్లకు నెడతాఁకు చెల్లప్రొద్దుఁ
జేరి మిథ్యానమస్కారము ల్చేయుచుఁ బ్రియములు నయములుఁ బెక్కు చూపి
విశ్వాస మొదవించి వృద్ధికి జడియక తఱచు పూఁటలను బత్రములఁ బెట్టి
యధికవిత్తముఁ గొని యరిగినపిదపఁ గొన్నాళ్ళకుఁ దనవర్తనములు తెలిసి
యంగడికిఁ దెచ్చి కోపించి యాన వెడిచి, యడ్డపెట్టినఁ దలఁకక యాసమీఁద
నిలిచి మానంబు సిగ్గును నెఱయవిడిచి,యుఱక మిసిమింతుఁడును గాక యుండవలయు.

శా. ఈరీతిన్ దల ఱాయి చేసికొని వా రేమన్న మార్మాటకున్
నో రొక్కింతయు నెత్తకున్నఁ గని మందుం డీతఁ డీకష్టునిన్
జేరన్ విత్తము పోయెఁగాక మరలం జేకూరునే యింక నే
లా రోఁతల్ వల దంచుఁ బోదురు నృపాలా తారె కొన్నాళ్ళకున్. 122

క. ఇమ్మహి నసత్యవాక్యం, బమ్మో తాఁ కెడినె వలవ దణుమాత్రంబున్
నెమ్మనమున శంకింపఁగఁ, బొవిమ్మ సతి నమ్మ వలదు బొంకినఁ జాలున్. 123

ఉ. ఎంత పెనంగినన్ గృహిణి యిప్పటి కమ్ముడు పోదు నా కుపా
యాంతర మేమియుం బొడమ దర్థము కూడదు కల్ల లాడితిన్

క. క్షితినాథ యతోధర్మ, స్తతోజయ యటన్న పలుకు సకలపురాణ
స్మృతులు దెలుపంగ విందుము, సతతము సుకృతంబు నిలుపు సదమలబుద్ధిన్.

మ. మకరగ్రస్తుని హస్తిరాజు ననుకంపాబుద్ధితో మున్ను బా
యకరక్షించినలీల నోధరణిపాలాగ్రేసరా నిన్నుఁ గౌ
శికమౌనీశ్వరపీడితున్ గుణనిధిన్ జేపట్టి రక్షించు న
బ్ధికుమారీగమణుండు చక్రధరుఁ డెంతే వత్సలత్వంబునన్. 145

శా. శ్రీకంఠుండు పినాకపాణి గిరిపుత్రీవల్లభుం డార్తర
క్షాకేళీనిపుణుండు బాలశశిలేఖామౌళి వేదాద్రిసీ
మాకంఠీరవమూర్తి శంకరుఁడు నేమంబార సంప్రీతితో
నీ కాశీపురవిశ్వనాథుఁడును నీ కిచ్చున్ మనోభీష్టముల్. 146

మ. విను నా నోముఫలంబునన్ మగుడ నీవిశ్వంభరామండలం
బనివార్యస్థిరకీర్తివైభవుఁడవై యాచంద్రతారార్క మిం
పునఁ బాలించెదు మౌనిసూనుఁ డిపు డీభూదేవుపక్షంబు లా
డె నటంచుం బరితాప మందకుము నీడెందంబునం దేమియున్. 147

క. నీరజబాంధవుఁ బొదివిన, ధారాధరతతులయట్ల ధరణీధవ నిం
డారంగ నిన్నుఁ బొదివిన, భూరివిపత్సముదయములు పోరిఁబోరిఁ బాయున్. 148

తే. మున్ను మఱవుము సత్యంబు మఱవ కెపుడు, నిను మృషావాదిఁ జేయుదునని చలమున
గాధినందనుఁ డొనరించు కపటకృత్య, ములకుఁ జలనంబు నొందక నిలువు మధిప.

వ. అని వెండియుఁ బ్రాణేశ్వరుచరణారవిందంబులకు వందనం బొనరింప నన్నీలవేణిం
గని కాలకౌశికుం డత్యంతరోషావేశంబున. 150

తే. కపటములుపన్ని యిపుడు నన్ను మొఱఁగి, సురుఁగఁ జూచెద వేమఱఁ జుమ్ము నిన్నుఁ
గనికరము మానసంబునఁ గదియనీక, దాసిఁగాఁ జేసి యేలుదు వాసి యుడిపి.

వ. అని యక్కాలకౌశికుండు. 152

తే. తిరిగి యింటింట ముష్టియెత్తినయు నేక, ధాన్యములమూట లన్నియుఁ దనదుమూఁపు
మీఁద నున్నవి తొలఁగించి మిగులబరువు, గాఁగ నాలేమతల మోపు గట్టి పెట్టె.

తే. వేగ మింటికిఁ బదపద జాగుమాని, నీటుసేయక నడువుము నెలఁత యనుచుఁ
గుంభినీసురుఁ డదలింపఁ గొడుకుచెట్టఁ, బట్టుకొని చాలదురవస్థ తొట్టుకొనఁగ. 153

చ. బడిబడిఁ గన్నులం దొరఁగుబాష్పజలంబులచే నురోజముల్
దడియఁగ గండపాలికల దట్టపుఘర్మకణంబు లుబ్బ నె

టికి మదీయవాక్యంబులు ప్రియంబు లగునేని మీ కిరువురకు మనంబు లైక్యంబుఁ
బొందునట్లుగా నేను మధ్యస్థుండనై యథావిధిఁ దగవుఁ గావించెద వినుం డని
యమ్మహీపాలకుం జూచి. 135

సీ. ఈచంద్రబింబాస్య నీభూసురేంద్రున కీవు మొదల విక్రయించు వేళ
నీవిల్వలోనివాఁ డీనందనుఁడు గాఁడు వేఱె పుత్రునికిని విలువ వలయు
నని తేటతెల్లఁగా నప్పుడు వివరించి పల్కకఁ దొడిఁబడఁ బడఁతి నతని
కమ్మితి వటుగాన నాత్మజసహితంబు కాలకౌశికున కీకాంత దక్కె
నింక నీ వేమిపల్కిన నృపవరేణ్య, పనికి రాదు గతోదకబంధనంబు
వలవ దిఁక నని యధ్వరావరునితోడ, వడుగు చెప్పినపాడికిఁ గడఁకఁ బొదలి. 136

వ. కాలకౌశికుం డత్యంతకుతూహలావేశంబున సత్పుత్రకునిఁ గదియఁ దిగిచి యుప
గూహనాదిసంభావనంబుల నాదరించినం గనుంగొని యారాజపురందరుండు తన
డెందంబున. 137

తే. తగవు ధర్మంబు విడిచి సత్యంబు వదలి, యితఁడు పిలువనిపేరంటమేగుదెంచి
పాడిఁ జెప్పెద ననుచు దబ్బఱలు పలికెఁ, గాలకౌశికునకు నిచ్చకంబుగాఁగ. 138

తే. కరుణ వర్జించి మృగశాబకంబుఁ గ్రోలు, పులికి నిచ్చినయట్లు యీపువ్వుఁబోఁడి
విక్రయింపంగ వలసెఁ బృథ్వీసురునకుఁ, దరమె యేరికిఁ గడవంగ దైవఘటన. 139

మ. అని చింతించుచు నున్న భూరమణుఁ డీనాకార మీక్షించి య
వ్వనితారత్నము ధైర్య మెంతయు నిజస్వాంతంబులో నిల్పి నం
దనుడుం దానును వచ్చి పాదములమీఁదన్ వ్రాలి శోకంబు నె
క్కొనఁ బల్కెన్ ఘనబాష్పబిందువులు దృక్కోణంబులం జాఱఁగన్. 140

శా. ఓప్రాణేశ్వర యోగభీరజలధీ యోధైర్యహేమాచలా
యోప్రాలేయమరీచిరూపవిభవా యోరాజచూడామణీ
యోప్రత్యర్థిమదేభపాటనహరీ యోనిత్యసత్యవ్రతా
యోప్రాభాతదినేశతేజ నిను నేయోజం బెడంబాయుదున్. 141

శా. దీపింపంగ నొనర్తు వెల్లపుడు నర్థిన్ మన్మనోమోదముల్
కోపం బింతయుఁ జూప నోడుదువు పెక్కుల్ నేరముల్ గల్గినన్
నాపూర్వం బగుకర్మ మెట్టిదియొ సంతాపంబు పాలంబడన్
బాపెం దైవము నేటితోడ నను నీపాదాంబుజద్వంద్వమున్. 142

క. కౌశికసంయమిమాయా, పాశంబులచేతఁ గట్టుపడితిమి మదిలో
లేశము ధైర్యము వదలకు, మీ శాశ్వతకీర్తి సత్యమే యొనఁగూర్చున్. 143

ఉ. ఓతరలాక్షి ధర్మగుణయుక్తచరిత్రవు గాన నీమనః
ప్రీతిగ నీదురాత్ముని నపేతవివేకుని క్రూరభాషణున్
బాతకలోకవర్తనుని బాధ యొనర్పక సత్కృపారసా
న్వితులమై భయం బుడిపి నేఁటికిఁ గాచితి మావు వేఁడఁగన్. 164

తే. అనుచు బ్రాహ్మణబాలకు లరుగుటయును, గొంతభయమేది విప్రుఁడయ్యింతిఁ జూచి
యెట్టకేలకు నొయ్యన నీరెలుఁగునఁ, బలికె నవివేకపరుషభాషలు చెలంగ. 165

ఉ. కొంచక నన్నుఁ బట్టుకొని క్రూరత నూరక యీసురేఁగి బా
ధించుచునున్న యీవడుగుఁ ద్రిమ్మరులం బురియూరెకుల్ విమ
ర్శించి మహోగ్రతం బొదివి శీఘ్రమ యందఱు నేపు దూల దం
డించక యుండ నీకుఁ దగునే యిటు వాండ్రఁ దొలంగఁ బంపఁగన్. 166

వ. అని కినిసి పలుకుచు మెల్లమెల్లనఁ జనిగృహప్రవేశంబు సేయు నెడఁ బురోభాగంబున.

సీ. పల్లచింపిఱితల ఫాలంబుసుడియును ముడిబొమ్మలును జప్పిముక్కు దొప్ప
చెవులుఁ బిల్లికనులుఁ జెక్కిటిపులిపిరి గొగ్గిపండ్లును ముదికోఁతిముఖము
కొంగమెడయు నిడుగూనివీఁపు నొలుగుపోయినరొండియు బొక్కిటొమ్ము
నింకుడుఁజన్నులు వంకచేతులుఁ గడువలమైనగానుగవంటినడుము
దొడ్డికాళ్ళును నల్లనిచెడ్డయొడలుఁ, గలిగి యత్యంతనీరసాకార యైన
కలహకంటకి నవ్విప్రుకాంతఁ జూచి, భయము జనియింప ధారుణీపాలుదేవి. 168

వ. బిడాలంబుం గనుంగొనినకీరకిశోరంబునుంబోలెఁ దల్లడిల్లుచున్న నప్పల్లవాధరం గనుంగొని యిది యెక్కడిమిటారిం గొనితెచ్చితి వని తుటారంపుమాట లాడుచు మగండునుం దానును గచాకచిం గడంగి. 169

చ. పొరిఁబొరి నిష్ఠురక్రియలఁ బూని పెనంగుచునున్న ధారుణీ
సురమిథునంబుఁ జూచి ధృతి సొంపు దలిర్పఁ బతివ్రతాగుణ
స్ఫురణము గానుపింపఁగ వచోనిపుణత్వము మీఱఁ బల్కె నం
బరమణివంశభూషణునిపట్టపుదేవి వివేక మేర్పడన్. 170

చ. కలరె ధరిత్రి నాలును మగండును నీక్రియ దారుణోద్ధతిన్
గలహ మొనర్చువార లది కల్మషకృత్యము గాదె చూచినన్
గెలనికి మెచ్చుగాదు పరికింపఁగ సిగ్గొకలేశమాత్రముం
దలఁపరు వాడలోపలిజనంబులు సారెకు నవ్వుచుండఁగన్. 171

తే. మగఁడు దనుమొత్తఁ దానును మాఱుమొత్తి, రాజముఖి గ్రామసూకరమైజనించు
భర్తకోపించి మఱియెన్ని పల్కె నేని, వలదుప్రతిభాషణంబులు వనజముఖికి. 172

న్నడు మసియాడఁ గొంకుచు మనంబున నార్తజనైకరక్షణున్
మృడునిఁ దలంచుచుం జనెడిమానవిలోచనఁ జేరి చూచుచున్. 155

వ. కాశికాపురవీథులం దొలంగక సందడిఁగొను పురంధ్రీజనంబులు డెందంబుల వగలం
బొంది తమలో నిట్లనిరి. 156

చ. కలితశిరీషపుష్పమునకంటె మృదుత్వము గల్గి యున్న దీ
లలనశరీర మిట్టిశశలాంఛనబింబనిభాస్య నక్కటా
తలపయి మోపు మోవ నిటు తామరచూలి యొనర్చె నాత్మ ను
మ్మలికము లేక యీబరువు మానవతీమణి యెట్లు పూనెడిన్. 157

క. సంపూర్ణపూర్ణిమాశశి, సొంపు దలంపింపఁజాలు సుకుమారతనూ
సంపద గలయీబిడ్డఁడు, కంపింపక యెట్లు నేర్చు గమనింపంగన్. 158

క. ఈవిప్రాధముఁ డతికలు, షావహవర్తనుఁడు ధూర్త హరహర వీరిన్
దా విలిచి నిర్దయుండై, కావించుచు నున్నవాఁడు ఘనతరబాధల్. 159

ఉ. ఈతని విప్రుఁ గాఁగ విధి యెట్లు సృజించెనొ లేశమాత్రమున్
భూతదయావిశేషమును భూసురతేజము శాంతభావమున్
బూతచరిత్రమున్ సుకృతబుద్ధియు లేదు తలంచిచూచినన్
వీతవివేకు లోభగుణు వృక్షచరాభకురూపు నెంతయున్. 160

వ. అని యీలాగునఁ బౌరవిలాసవతీజనంబులు తన్ను నుపలంభింప నక్కుంభినీసు
రుండు కోపించి నిజకరావలంబితయష్టిదండంబునఁ బ్రచండంబుగా నప్పుండరీకలో
చనలం గదిసి వ్రేసినం గలకలం బెసంగఁ గలంగి తొలంగి చనుచుండి రప్పుడు
ధూర్తవిప్రాంగనాప్రేరితులై బ్రహ్మచారిజనంబు లక్కాలకౌశికుం బొదివి. 161

సీ. కరయష్టిదండ మొక్కఁడు తీసి పోవైచె నంజ కొక్కఁడు సిగ గుంజి యడిచె
నొడిసి గడ్డముపట్టి యొక్కఁ డుయ్యల లూఁగెఁ జెదరక దోవతిఁ జించె నొకఁడు
తవిలి యొక్కఁడు జన్నిదంబు లన్నియుఁ ద్రుంచె వెసనాతపత్రంబువిఱిచె నొకఁడు
కినిసి యొక్కఁడు పుచ్చుకొనియెఁ బంచాంగంబు వెలికిలఁబడఁద్రోచె నలుక నొకఁడు
ఓలిఁ గుక్కల నుసికొల్పె నొక్కరుండు, పెనఁగి యొక్కఁడు పట్టెవర్ధనము నాఁకె
లుమిసెఁ దుప్పున మొగముపై నొక్కరుండు, బెట్టునవ్వుచు దౌడలఁగొట్టె నొకఁడు.

వ. ఇట్లు బహువిధంబులం బిఱువీఁకులు సేయుబ్రహ్మచారిజనంబులకుఁ బ్రియంబున వం
దనం బొనర్చి నాకుం బ్రియంబుగా నీభూదేవునిం బ్రోవం దగు నని పలుకుచంద్రమ
తిం గనుంగొని తదీయగంభీరభాషణంబులకు నక్కుంభినీసురకుమారు లనురాగసం
భరితాంతరంగులై. 163

వ. అటు హరిశ్చంద్రనరేంద్రుండు పురంధ్రీరత్నంబు విక్రయంబు గావించినవిత్తంబు సమస్తంబును సమర్పించుటయుఁ గైకొని యమ్మునికుమారుం డత్యంతసమ్మదంబున నాసార్వభౌము నాశీర్వదించి. 182

తే. కౌశికునియాజ్ఞ నీవెంటఁ గడుఁ బ్రయాస, మునఁ జరించినవాసరంబులకు నెల్ల బత్తెమెల్ల వయ్యె ధారుణీపాల యిపుడు, నీవు నాకిచ్చినధనంబు నేటితుదకు. 183

చ. ఇనకులవర్య కౌశికమునీంద్రుఋణంబును వేగఁ దీర్చి మ
న్మనిచి సమగ్రసూనృతమహత్త్వముఁ జెందుము నీవు నావుడున్
జనపతి నవ్వి యిట్లనియెఁ జయ్యన నయ్యనుఁ జూచి పల్మఱున్
దనతల యూఁచుచున్ మిగుల దైవముచేఁతకు నాత్మ దూఱుచున్. 184

తే. నిన్ను నామీఁదఁ దరువుకానికఁ నొనర్చి, యనుపుచో నీకు బత్తె మిమ్మనుచు గాధి తనయుఁ డేమియు నాతోడ ననఁగలేదు, పాడియే నీకు నను నేఁడు బత్తె మడుగ.

క. సారం బైనవివేకవి, చారం బింతయును లేక సారెకు నాపై
నూరక మిథ్యావాదము, లీరీతిం బలుక భావ్యమే మునితనయా. 186

క. నావుడు నక్షత్రకుఁ డో, భూవర నీవెంట నన్నుఁ బుత్తెంచుతఱిన్
భావించి నన్ను డగ్గఱి, రావించి రహస్యవాక్యరచన చెలంగన్. 187

క. దినమును నీచే బత్తెముఁ, గొను మని కౌశికుఁడు చెప్పఁ గోపం బేలా
మనుజేశ యేను మిన్నక, పనివడి నీవెంటఁ దిరుగ బంటనె చెపుమా. 188

ఉ. ఆతపశీతవాతముల కంజక నే నినుఁ గూడి పర్వత
వ్రాతము లెక్కి వాహినుల వారణ దాఁటి మహాటవీస్థలుల్
భీతి తొలంగి చొచ్చి కడు బేలతనంబున డస్సితిన్ ధరి
త్రీతలనాథ నాకు వలదే దినబత్తెముమాత్ర మియ్యఁగన్. 189

ఉ. సంతతవేదపాఠమును సంధ్యయు వ్రేల్మియు నుజ్జగించి నే
నెంతయు మూఢవృత్తి ధరణీశ్వర పాపముఁ గట్టుకొంటి నీ
చెంత వసించి కౌశికునిశిష్యులలోపల నేటిదాఁక ని
శ్చింతమతిన్ యథావిధిగఁ జేయుదుఁ దప్పక నిత్యకృత్యముల్. 190

సీ. విను నృపాలక యూళ్లవెంబడి దేవరగుళ్లపంచలఁ జేరి కుతిలఁ గుడిచి
యడిగి తెచ్చిననీరసాన్నముల్ భుజియించి బడలితి నెంతయుఁ బదను తివిసి
యెంచంగ నేటి కామంచితనం బీవ యెఱిఁగెద వని యుంటి నిచ్చలోన
నే నొందినప్రయాస మెఱుఁగంగ లేవైతి వించు కంతయును నిం కేమి యనఁగ

చ. కలశభవాత్రిగౌతములకాంతలు భర్తృపదాబ్జసేవ ని
ర్మలతరభక్తిఁ జేయుచు సమస్తజనంబులుఁ బ్రస్తుతింపఁగా
వెలసిరి గాన భామలకు వేడ్కఁ బతిప్రియహేతుకృత్యముల్
సలుపుచు నుండఁగా వలయు సంతతముం గడుఁ బ్రేమతోడుతన్. 173

సీ. కుసుమకోమలులకు గుజ్జుమామిడిపండు ప్రాణనాయకుపాదపద్మసేవ
శాతోదరుల కలచేతిమాణిక్యంబు ప్రాణనాయకుపాదపద్మసేవ
కీరవాణులకు ముంగిటిపెన్నిధానంబు ప్రాణనాయకుపాదపద్మసేవ
కుటిలకుంతలులకుఁ గొంగుబంగారంబు ప్రాణనాయకుపాదపద్మసేవ
వలవ దేనోములును నోమ వనరుహాక్షు, లకు మనోహరుపదకమలంబు లెపుడు
ముదముతోడ భజించిన నదియె చాలుఁ, దలఁచి చూచిన నభిమతార్థంబు లొసఁగ.

తే. అనుచుఁ బెక్కువిధంబుల మనుజవిభుని, వనిత పల్కు సతీధర్మవాక్యములకుఁ
గనలి మోమున నరుణిమ గ్రమ్మ విప్రు, డెలఁత భీషణగార్దభనిస్వనమున. 175

ఉ. మించినకాలకౌశికునిమీఁదిమహాగ్రహ మెల్ల భూమిభృ
చ్చంచలనేత్రపై నిలిపి చాలఁగ నిష్ఠురభాషణంబులన్
గొంచక పల్కెఁ గన్గొనలఁ గోపహుతాశనకీల లుబ్బ న
క్తంచరిపోలెఁ జూపఱకు దారుణలీల భయంబుఁ జూపుచున్. 176

తే. తగవుఁ జెప్పంగ నిన్నుఁ బ్రార్థన యొనర్చి, యెవ్వ రిచటికిఁ దెచ్చి రోచివ్వలాఁడి
నీవు చెప్పకయుండిన నే మెఱుఁగ మె,పుడమివర్తించుమగనాలినడత లెల్ల. 177

చ. పతిహితచర్య లీకరణిఁ బాయక నీ వుపదేశ మియ్యఁగా
సతతము నింక నీ నొడువుచందమున న్విహరించుదాన నే
యితరులయట్ల సైఁపు మొకయించుక సేపు సమస్తకార్యసం
గతులును లెస్స చేసెదను గ్రక్కున నేటికి వేగిరింపఁగన్. 178

తే. నన్నుఁ జెప్పంగ నెఱుఁగవు మున్ను నీవు, మృత్యు వైనను వెఱచు నాయెదురనిల్వ
నిరుగుపొరుగులవారికి నెల్లఁ జొక్క, యెదురు నాయిల్లు వేయును నేల యింక.

చ. ననుఁ గనుఁగొన్నయప్పుడె ఘనం బగుభీతి వడంకుచుండినా
పెనిమిటికిన్ భయం బుడిపి బీరము నెక్కొన మాఱుమొత్త నొ
య్యన సమకట్టి తెచ్చి కలహంబునకుం బురికొల్పి తంచు భూ
జనసుత పుణ్యశీల యగు చంద్రమతిం దలపట్టి యీడ్చుచున్. 180

క. వ్రేసి పదతాడనంబుల, వాసిం దొలఁగించి నొంచి వదలక మఱియున్
గాసిం బెట్టుచు నుడిగపు, దాసింగా నేలుచుండె దయ లేక నృపా. 18

క. ఏపగిదిఁ దీర్తు నిఁక నేఁ, డాపసవరుఋణము నిజము తప్పక యుండన్
నాపలికినమితిదినముల, లోపల నె సమస్తజనములుం గొనియాడన్. 201

వ. అని చింతాక్రాంతుఁడై యున్నయమ్మహీకాంతునిం గనుంగొని కపటక్రియానిపుణుం డగునక్షత్రకుం డిట్లనియె. 202

క. ఊరక చింతించుచు నీ, వీరీతిం గదల కున్న నృప మావిత్తం
బేరీతి వచ్చు వేగమ, రా రమ్మ ధనమ్మ దెమ్మ రసికత వెలయన్. 203

సీ. అనిన నిట్లని పల్కె నవనీకళత్రుండు నక్షత్రకునియాననంబుఁ జూచి
మునిపుత్ర యే నొనర్చినయపరాధముల్ పెక్కులు గల వేల పేర్కొనంగ
నరవిందలోచన నమ్మినవిత్తంబు తోడఁబడ సర్వంబు దొరకె నీకు
మునిఋణం బిఁకఁ దీర్చుకొనఁ దగుస్వాపతేయంబున కొండుపాయంబు లేదు
కాన వేగంబ నన్నుఁ గింకరునిఁగాఁగ, వీటిలో నెవ్వరికి నైన విక్రయించి
నిరవశేషంబుగా నప్పు నేటితోడ, నంతయును దీఱునంతద్రవ్యంబుఁ గొనుము.

వ. అనుటయు నట్ల కాక యని సమ్మతించి నక్షత్రకుం డవ్వసుంధరాధ్యక్షుని దక్షిణహస్తంబు నిజపుస్తకసూత్రంబున బంధించి. 205

తే. రమ్ము నీవని కొంపోయి నెమ్మనమున, శంక యేమియు లేక యాసార్వభౌముఁ
బట్టణములోన విక్రయింపంగఁ దొడఁగెఁ, బౌరజనహారవంబులు ప్రబలుచుండ. 206

సీ. క్ష్మాచక్రమెల్ల విశ్వామిత్రమునిశిఖామణికి నర్పించినమంచిదాత
నేడుదీవులను విజృంభించి బహుజయస్తంభముల్ నిల్పినశౌర్యశాలి
భేతాళుఁ డనుపేరిభూతంబుఁ దెగటార్చి మునులభయంబు మాన్పినమహాత్ము
నిత్యసత్యవ్రతస్తుత్యుఁడై కీర్తివిస్ఫూర్తిచే వెలసినపుణ్యమూర్తి
నర్కకులవార్ధిపూర్ణేందుఁ డగుత్రిశంకు, కూర్మిపట్టి హరిశ్చంద్రకువలయేశు
విక్రయించెద నడిగినవిత్త మొసఁగి, గరిమఁ గొన రండు పౌరలోకంబులార. 207

వ. అని యిప్పగిది నప్పట్టణవిపణిమార్గంబుల నమ్మసమయంబున నటమున్న నిజతపస్సామర్థ్యంబున విశ్వామిత్రుండు మణికర్ణికానికటంబునం దొక్కపితృవనంబు నిర్మించి సమవర్తిం దలంచిన. 208

ఉ. దండము కేలఁ బూని జలదప్రతిమానతనుప్రభావళుల్
మెండుకొనంగఁ గింకరులు మిక్కిలి భక్తి భజింపఁగాఁ గృతాం
తుం డరుదెంచి తత్పరత ధూర్జటిసన్నిభుఁ డైనమౌనిమా
ర్తాండున కెంతయున్ దృఢతరం బగుభక్తి నమస్కరించినన్. 209

దాల్మి దిగనాడి యలుకమై తరువుకాని, చేత లన్నియుఁ బలుమాఱుఁ జేసి నీదు
వాసి యుడుపక మొగమోటవలనికూర్మి, నూర కుండిన నపరాధ మొదవె నాకు.

ఉ. నావుడు భూమిపాలుఁడు మనంబునఁ గోపము సంభవింపఁగా
నావటుధూర్తుఁ జూచి వసుధామర యీగతి నిష్ఠురోక్తు లే
లా వచియింపఁ నీకు మొదలన్ దినబత్తెము నే నొడంబడన్
నీవు గురుప్రయోజనము నెమ్మి నొనర్పఁగ వచ్చి తిమ్మెయిన్. 192

క. ఎల్లెడఁ బరదేసులకును, గుళ్లుం బంచలును రచ్చకొట్టంబులు నం
గళ్లును గాక తలంపఁగ, జల్లనిసున్నంపుమల్లసాలలు గలవే. 193

ఉ. నీ కిటు నన్ను దూఱఁ జను నే పలుచోటుల నీరసాన్నముల్
గాక సుఖప్రకారమునఁ గల్గఁగ నేర్చునె పాయసాన్నముల్
చేకొని యిండ్లవెంట నిరసింపఁగ బిచ్చము లెత్తువారి క
య్యో కరుణింపఁగా వలదె యోపిక గల్గి మనంబులోపలన్. 194

క. అమృతము ద్రావిననోరనె, దమకంబునఁ గినిసి విషముఁ ద్రావినరీతిన్
మమత మును మేలు గావిం, చి మఱిమిటి కిప్పు డెగ్గు చేసెద వనఘా. 194

సీ. పరుషభాషణములు పలుమాఱు పలుకక యెల్లియు నేఁడు సహింపు మాత్మ
నరసి నే నేయుపాయంబుననైనను మితిలోనఁ జెల్లింతు మీధనంబు
నిప్పు డిచ్చినవిత్త మప్పులోపలిదియకాఁగఁ గైకొనుము నిష్కపటబుద్ధి
ననఘ నీచిత్తంబు హర్షించునట్లుగా బత్తెంబు నిత్తు నేపాటి యైనఁ
దొలుతఁ గౌశికసంయమీంద్రుని ఋణంబు, మొదలు ముట్టంగఁదీర్చి యామునికుమార
కీర్తిఁ బొందెద ననుఁ గటాక్షింపవయ్య, కరుణ యుల్లంబులోపల నిరవుకొనఁగ.

వ. అనిన మందహాసంబు చేసి యమ్మునినందనుండు నృపసంక్రందనుం జూచి. 197

క. భూపాల యిపుడు రొక్కము, చేపడినధనంబు విడిచి సీమాంతరముల్
నీపజ్జఁ దిరుగుచుండఁగ, నాపాపమె యింత యేల నలి పెట్టంగన్. 198

తే. క్షితితలేశ్వర నన్ను నీచేతి హేతిఁ, బూని వధియించి మఱి కొనిపొమ్ము ధనముఁ
బచ్చపైకంబు నిందులో వెచ్చపఱుప, నెన్ని చెప్పిన మాట లింకేటి కనిన. 199

ఉ. ఓపరమేశ్వరా యని పయోరుహబాంధవవంశవర్ధనుం
డాపరుషోక్తికిం గడురయంబున వీనులు మూసి యాత్మ సం
తాపము నొంది యువ్వడుగు దా నతిపాతకుఁ డిట్టికట్టిఁడిం
జేపడె మున్నుగా ధనము చేరునె క్రమ్మఱ నాకు నేమియున్. 200

క. ఏనెక్కుడ నీ వెక్కుడ, మౌనికుమారునకు నిష్టమతి కడుఁబొదలం
గా నొసఁగెదు ధన మెక్కుడ, హీనకులుఁడ తొలఁగు మనిన నిట్లను వాఁడున్.

సీ. దండహస్తుండవై తప్పు లారసి మనుష్యుల నెల్ల శిక్షింతు వలసినట్లు
యనిమిషులకు నైనఁ గినియంగ రాదు నాయెడ నీకు నిట్టేల హేయపడఁగఁ
జండాలుఁ డని సారెసారెకు నన్ను నీ విసడించుట పాటియే తలంప
ధర నుతి గన్న మీతండ్రివంశమునకు నాదువంశమునకు భేద మెద్ది
మునిశిఖామణిబుణ మెల్ల మొదలుముట్టు, నేన తీర్చెద నెవ్వఁడ వైన నేమి
దురభిమానంబు మాని యీదొసఁగు వెడలఁ, గోరి నాచేత విత్తంబు గొనుము వేగ.

క. ఇంతదొరవరుసవాఁడవు, పంతంబున నుండ కేల ప్రాభవ మెడలన్
వంతం బొందుచు నోభూ, కాంతా యివ్వడుగుచేత గాసిం బడెఁగన్. 222

క. పలుమఱు నీతో నాకున్, గలహింపఁగ నేల ధనము గలవారికి దా
సులు లేరె యరసి పిలిచినఁ, దొలఁగుము చెప్పకుము నీదుదొడ్డతనంబుల్. 223

వ. అని హరిశ్చంద్రనృపుండును నాచండాలుండునుం బట్టియాడ నట్టియెడం గదిసి
నక్షత్రకుండు. 224

మ. మును నాతోడుత నీవు పల్కినక్రమంబుం గాదె భూపాల యె
వ్వని కైనన్ నను విక్రయింపు మని గర్వస్ఫూర్తి వర్జించి నీ
వనవే యీగతి నేటికిన్ దిరుగ సత్యప్రౌఢిఁ బోనాడి యీ
తని హీనుం డని మాటిమాటికిని నింద ల్పల్క నీ కేటికిన్. 225

క. ఇతఁ డెవ్వఁడైన నేమగు, క్షితినాయక ధనము మాకుఁ జెల్లించినవాఁ
డ తగినమాన్యుఁడు తలఁపఁగ, నతివేగమ విత్తమునకు హరు విఁకఁ జెపుమా. 226

శా. ఈచండాలునిచేత మాధనము నేఁ డిప్పించెదో కాక నీ
వాచాడంబర మెల్ల మాని యనృతవ్యాపారశీలుండవై
యాచంద్రార్కము ధాత్రిపై నిలుచుసత్యస్ఫూర్తి వర్జించెదో
ధీచాతుర్యము మీఱ నిం దొకటి నర్థిం బూనుమా చెచ్చెరన్. 227

మ. వినుమీ నాదుప్రతిజ్ఞ యింకొకటి యీవిత్తంబుకున్ రెట్టి యి
చ్చిన నొండొక్కని కమ్మ నీతనికి నిన్ శీఘ్రంబ నే నమ్ముదున్
బెనఁగొన్నట్టిచలంబుతోడ ననుచున్ బృథ్వీశ్వరుం బల్కఁగా
విని చండాలుఁడు సంతసిల్లి పలికెన్ విప్రోత్తమున్ జూచుచున్. 228

తే. అవుర మెచ్చితి నోబాఁపనయ్య నిన్నుఁ, దిరుగ కీమాట నీమదిఁ దిరము సేయు
హీనకులుఁ డని యితఁడు నన్నేవగించి, పలికె నాయాత్మ కదియంపములికి యయ్యె.

క. కౌశికముని వైవస్వతు, నాశీర్వాదం బొనర్చి యాదరమొందా
వేశం బొదవంగ నిట్లను, వైశారద్యానవద్యవాచాగరిమన్. 210

సీ. మార్తాండనందన మన్మనఃప్రీతిగా నీవు మహాద్భుతం బావహిల్ల
మాయాశ్వపచవేషివై యతివేగ నీపురిపరేతనికేతమునకు సాధి
పత్యంబు గైకొని నిత్యసత్యమునకై నా కొడంబడినధనంబు లేమి
నమ్ముడు వోయెడు నాదిత్యకులవార్ధిచంద్రు హరిశ్చంద్రసార్వభౌము
పిలిచి హంకార మెల్లను వీటిఁ బుచ్చి, కింకరునిఁగాఁగఁ నేలి నిశ్శంకలీల
ననుదినంబును హేయంబు లైనపనులు, చేయ నియమింపు ధైర్యంబు చెదర నందు.
వ. అనిన నట్లకాక యని యాక్షణంబ. 212

సీ. నడునెత్తిఁ గొప్పఁ గర్ణములఁ గీలించినతెల్లనిముడుసుఁ జెందిరపుబొట్టు
మొలఁగానెఁ బోసినముటికెపాఁతయు నందు నడుము బిగించిననరపవాలుఁ
దల నిట్టునట్టుగా నలసి యొల్లమిగాఁగఁ బెనఁచిచుట్టినకావిప్రేలికయును
బైఁద్రిప్పి కప్పినప్రాఁదోలుపాయయుఁ జే నున్ననీలయష్టియును గలిగి
కోరి పసరపుసంజాటిగుడియుఁ గల్లు, బుంగయును బూని తనమేనిపొలుసుకంపు
లలముకొన వీరబాహునాహ్వయమునఁ, గపటచండాలవేషసంకలితుఁ డగుచు.

మ. మదిరాపానవికారచేష్టలఁ గడున్ మత్తిల్లి రక్తాక్షుఁడై
యెదురుం దన్ను నెఱుంగలేక మిగులన్ హేయంబు వాటిల్లఁగాఁ
బదముల్ తొట్రుపడంగఁ జొక్కుచు మతిభ్రాంతిన్ బడం బాఱుచున్
గుది గొంచున్ వెడపాటఁ బాడుచు దురుక్తుల్ ప్రేలుచున్ సోలుచున్. 214
తే. మొగముపైఁ జిమ్మచీఁకటి ముడివడంగ, మాటిమాటికి మీసాలు దీటుకొనుచుఁ
జనియె సంబళి సంబళి యనుచుఁ బంక, జాప్తకులపుంగవుఁడు వచ్చునంగడికిని.
వ. ఇట్లు చని యయ్యంత్యజుం డత్యంతహేయంబుగా మొగంబునఁ గల్లుకంపు వెల్లు
బ్బి తబ్బిబ్బు లగుపల్కుల నిట్లనియె. 216
తే. ఓరియోరంతప్రొద్దునాయొద్దఁ గదల, కుండియుడిగంపుఁబనులు సేయుచుఁ బ్రియంబు
చెలఁగ మెలఁగెదవేని యీచిఱుతబాఁపఁ, డడిగినంతధనంబు నేఁ దడయకిత్తు. 217
వ. అనుటయుఁ గోపారుణితలోచనుండై భూపాలుం డాచండాలుం జూచి. 218
శా. ఓరీ మాల దురాత్మ నీమనములో నొక్కింతయున్ శంక లే
కీరీతిన్ దురహంకృతిన్ బలుక నోరెట్లాడెరా నీకు నా
హారాజీవసఖాన్వయున్ విలువ నీ వర్హుండవే పొమ్ము నన్
జేరన్ రాకుము మద్యపానకృతదుశ్చేష్టావికారంబునన్. 219

యుదు మఱిసేయ కుండిన మహోగ్రత నాదుశిరంబుఁ ద్రుంచి నీ
పదములమీఁద నిల్పెదను బాలసుధాకరమౌళి సాక్షిగన్. 239

వ. అని యమ్మహీపతి యతులప్రతిజ్ఞావచనంబులు పలుకుటయు విశ్వసించి వీరబాహుం
డు నిజానుచరవ్యూహంబుచేత నగణితం బగు ధనంబు దెప్పించి యమ్మునికుమారు
సమ్ముఖంబున. 240

ఆ. కొండపొడవుగాఁగఁ గొనకొని ప్రోగు వో, యించి ప్రియ మెలర్ప నిచ్చి వినతుఁ
డగుచు నరుగఁ డనిన నగుఁగాక యనుచుఁ గ్రొ,న్నిమునీంద్రసుతుఁడు సతుక మొదవ.

వ. సంకల్పసిద్ధి యగుంగాక యని ప్రియపూర్వకంబుగా నాశీర్వదించి చనియె ననినఁ
గాంతేయాగ్రజుం డటమీఁది వృత్తాంతం బెఱింగింపు మనుటయు. 242

శా. సాధుస్తుత్యచరిత్ర బంధుజనతాస్వర్భూజ గాంభీర్యవా
ర్ధ్యాధుర్యాధరితాబ్ధితాంబునిధినైర్మల్యోర్మి సంఘాత ది
క్సాధ వ్రాతసుధాంశుతోజ్జ్వలయశస్సౌభాగ్య యోగ్యక్రియా
బోధానందమయాంతరంగ పురజిత్పూజాకళాకుంభజా. 243

క. వ్రతియతిజనసంరక్షా, చతురమనీషావిశేష సాగరతనయా
సతతావాసికృతదృ, క్శతపత్ర యమిత్రజైత్ర శౌర్యాటోపా. 244

వనమయూరవృత్తము. ఉల్లసితకీర్తిమహిమోన్నత దివౌక
స్తల్లజమహావిభవ ధర్మగుణభూషా
వల్లభ సుధామధురవాక్చతుర యీడూ
రెల్లన నృపాలసచివేంద్ర రుచిచంద్రా. 245

గద్యము. ఇది శ్రీమదాపస్తంబసూత్రపవిత్ర కౌండిన్యమునిచక్రవర్తిగోత్ర సకల
సుకవిజనానీకమిత్ర దేచనామాత్యకుమార వినయవివేకవిద్యాలం
కార శంకరకవినామధేయప్రణీతం బయినహరిశ్చంద్రో
పాఖ్యానం బనుమహాప్రబంధంబునందుఁ
జతుర్థాశ్వాసము.

—ంంంంం—

ఉ. నీఋణ మెల్లఁ దీర్చి యవనీపతిఁ గింకరుఁగాఁగ నేలుదున్
గోరము నీదుచిత్తమునకున్ మితి యెయ్యది యన్న సమ్మదం
బారఁగఁ బల్కె వానిసుతుఁ డంత్యజుఁ గన్గొని యింతవట్టు నీ
పేరుగఁ జేసి నామదికిఁ బ్రీతి యొనర్పుము నీవు దాతవై. 230

తే. జనుఁడు దంతావళము నెక్కి చాల నిక్కి, గగనతలమునకై రత్న మెగ్గిరి పోవ
వైచినంతయుఁబోడవు ద్రవ్యంబుఁ దెచ్చి, రాశిగాఁ బోసి మా కిమ్ము రాజుఁగొనుము.

క. నావుఁడు నంత్యజుఁ డిట్లను, నీ వడిగినవిత్త మెల్ల నేనీకిత్తున్
వేవేగ యడుగు తిరుగక, యోవడుగ జనించె శంక యొక్కటి నాకున్. 232

క. తనదేశం బెడఁబాయక, జను లెఱుఁగఁగ నాలు బిడ్డ సంసారము గ
ల్గినవానిఁ గాక యొంటరి, ననుమానము లేక నమ్మ నగునే నాకున్. 233

చ. పగలును రేయుఁ దత్పరతఁ బాయక నా కుడిగంబు సేయుచున్
దగవరివై మదాజ్ఞ గుఱి దాఁటక నుండఁగఁ బూఁట యెద్ది నె
వ్వగఁ బొరలంగ నోప నొకవంక కితండు తొలంగి పోయినన్
మిగులఁ బ్రమాద మౌఁ బిదప మిన్నక యేగతి విశ్వసింపుదున్. 234

వ. అనినఁ దాపసకుమారుం డమ్మహీపాలుం గనుంగొని నీ విమ్మాత్రంబునకు సమ్మతంబగు నట్లుగా నమ్మఁ బలికి మాధనంబు సమస్తంబును ద్వరితంబ తెప్పించి యిప్పింపవలయు నని బహువిధంబుల మనంబు నొవ్వం బలికి నెవ్వగం బెట్టు నవ్వడుగునిష్ఠురకృత్యంబులకుం గలంగి హరిశ్చంద్రుం డెవ్విధంబుననైనఁ బూని యాతనివిత్తంబొక్కచిన్నంబునుం గడమ కాక యుండ సమర్పించి నేటితోడన కౌశికుని మాయాపయోరాశి యుత్తరింతు నని చిత్తంబున నిశ్చయించి వీరబాహుం జూచి యిట్లనియె. 235

క. నామీఁద నవిశ్వాసం, బేమిటి కనుమాన మడుగు మే సూనృతవా
చామహిమ నిల్పఁ గోరి ధ, రామరునకు దక్కినాఁడ నమ్ముఁడు పోవన్. 236

క. జననీజనకులు సత్యం, బును సుజ్ఞానంబు వినయమును ధైర్యంబున్
దనయుఁడు మిత్రుండును నా, కనుజుఁడు సుకృతంబు శాంతి యాలుదలంపన్. 237

ఉ. వాసరవల్లభాన్వయుఁడ వర్జితదోషుఁడ సార్వభౌముఁడన్
భాసురసూనృతప్రతిభఁ బాయఁగఁ జాలక చేరి నీకు నే
దాసుఁడ నయ్యెదన్ వినుము తప్పనిమాటయ నాఁకు బూఁటయీ
భూసురబాలకాగ్రణికిఁ బొందుగ నిమ్ము ధనమ్ము సర్వమున్. 238

చ. హృదయములోపలన్ గపట మించుక యేనియు నిల్ప కెంతయున్
సదమలభక్తియుక్తి ననిశంబును బాయక నీదుసేవ సే

మక్షికాచ్ఛాదితమాంసతోరణరాజి చత్వరాస్తరణార్ద్రచర్మపటలి
ప్రబలవిట్ఖరఘుర్ఘురధ్వానపూర్ణంబు సవిధకుమాభాగసంభృతాస్థి
వారుణీపానకృత్యదుర్వారజనిత, మదభరాలసచండాలమండలేత
రేతరానర్థకలహసంజాతరవము, గనియె మాతంగవాటను మనుజవిభుఁడు. 8

ఉ. కనుఁగొని చొచ్చి ధైర్యగుణగౌరవము ల్చెదరంగ నీక సె
మ్మనమున సేవగింపకఁ గ్రమంబున నంత్యజు నింటి కేగి వాఁ
డనుదినము న్మదోద్ధతిఁ నహంకృతిఁ జెప్పెడు నష్టకష్టపుం
బను లొడఁగూడఁ జేయుచును బార్థివసత్తముఁ డుండె భృత్యుఁడై. 9

వ. వీరబాహుండును బ్రతిదినంబును గృతాపరాధంబు లెన్నుచు నొక్కయుపాయంబుం గాంచి సూనృతజ్ఞానంబు వదల వీని ప్రతిజ్ఞాభంగంబు గావించి గాధినందనునకు మనస్సంతోషం బొనర్తు నని నిశ్చయించి యొక్కనాఁటినిశాసమయంబున నద్ధారుణీపతి యూరుపీఠంబునఁ జరణంబులు చేర్చిన నతం డంతఃకరణంబున భక్తి నివ్వటిల్లఁ బదంబు లొత్తుచున్న ముదంబునం గనుంగొని. 10

తే. ఓరి నీమీఁద విశ్వాస మొదవె నాకు, నే నొనర్చుప్రయోజనం బీవు చేయు
నేఁడు మొదలుగ నాయాజ్ఞవాఁడ వగుచు, వినుము చెప్పెద నీకుఁ దద్విధముఁ దెలియ.

క. ఈవీటిపరేతక్షితి, నావశమై యుండుఁ గొన్ని నాళ్ళుగఁ బ్రీతిన్
నీ వచటియాధిపత్యము, లేవం గైకొనుము సంఘటితకార్యుఁడవై. 12

గీ. వినుము నీనామధేయంబు వీరదాసు, వదల కేఁదాల్చు నీముద్రగుదియఁ బూను
మనుచుఁ దనచేతి కిచ్చిన నాదరమునఁ, బుచ్చుకొని వేడ్క రంజిల్లవచ్చి యెదుర.

వ. అత్యంతభయంకరం బగుపరేతనికేతనంబు విలోకించి కించిన్మాత్రంబును జిత్తంబున భీతిల్లకఁ బ్రవేశించి యమ్మహీవల్లభుం డహీనధైర్యంబున నిజకృపాణప్రభావిభాసమానుండై నానాభూతవ్రాతంబులం గూఁత లిడం బట్టి కొట్టి యిట్లనియె. 14

సీ. అనుదినంబును మీర లత్యంతసంభ్రమంబున నేగి వీరబాహునిగృహమునఁ
బగ లెల్ల నడిగపుఁబనులు చేయుచు రాత్రిఁ గడఁక నీభవభూమిఁ గాచుచుండుఁ
డస్మదీయం బైనయాజ్ఞ నుల్లంఘించి నడచితి రేని దండన మొనర్తు
నిన్నాళ్ళవలెను గా దింతటనుండియు మీకు విచ్చలవిడి మెలఁగ రాదు
హీనకులుఁ డని యనక మదీశ్వరునకు, నాయురారోగ్యపుత్రపౌత్రాభివృద్ధి
మించునట్టుగ నాశీర్వదించి రండు, మోదమున బ్రహ్మరాక్షసముఖ్యులార. 15

వ. అని యిత్తెఱంగున భూతసంచయంబుల నియమించి సమీపవర్తియు సమున్నతమూర్తియు నగునొక్కబేతాళునిం బిలిచి నీ వింక మదీయకింకరుండవై యచ్చోటి

# హరిశ్చంద్రోపాఖ్యానము.

## పంచమాశ్వాసము.

క. శ్రీరూపధృతివితీర్ణి, స్మారితవారిరుహనాభశంబరవిద్వి
ణ్మేరునిశావల్లభ యీ, డూరెల్లామాత్య బుధపయోజాదిత్యా. 1

వ. ఆకర్ణింపు మప్పాండవాగ్రజునకు మార్కండేయుం డిట్లనియె నట్లాశీర్వదించి నత్పు
త్రకుం డమ్మహీకళత్రునిం జూచి. 2

తే. ఇనకులాధీశ నీవు మా కియ్యకొనిన, విత్త మంతయు నేఁడు ప్రవేశ మయ్యె
శంకరుఁడు విశ్వనాథుండు సాక్షిగాఁగ, నిలుపుకొంటివి సత్యంబు నిత్యముగను. 3

క. అని హస్తాహస్తంబో, ప్పన చేసె మహీశు వీరబాహునకుఁ దనూ
జనితాతిహేయకారణ, ఘనదుర్గంధాత్తమక్షికావ్యూహునకున్. 4

సీ. ఆసమయంబునం దాకాశపథమున వసియించి సర్వగీర్వాణవరులు
కరుణాకటాక్షవీక్షణములఁ జూచుచు నత్యంతవాత్సల్య మంకురింపఁ
జండాలగృహమున నుండు నన్నాళ్ళకు నాఁకలి డప్పులు లేక యుండ
శీఘ్రంబ చండాలసేవానివృత్తిగా వరము లిచ్చిరి మహీవల్లభునకు
నంత నిజమందిరమ్మున కరుగఁ దలఁచి, వీరబాహుండు కడునహంకారలీల
మదము కన్నుల నిండారఁ బొదువుకొనఁగ, క్షత్రకులపుంగవుండని శంక లేక. 5

క. తనచేతిమాంసభారం, బును మదిరాపూర్ణకలశమును జతనమునం
గొని రమ్మని యదలించుచుఁ, గనుఁగొని ధరణీకళత్రుకరమున కిచ్చెన్. 6

వ. ఇచ్చినం బుచ్చుకొని పొరపొచ్చెంబు లేనిమచ్చికం దరణికులపుంగవుం డంతరంగం
బున నొక్కింత హేయతం బొందక లజ్జింపక వానిపజ్జన తదీయపూర్వకింకరులం
గూడి చని చని ముందట. 7

సీ. బహువిధపశుకళేబరసమాకీర్ణంబు దుర్గంధలహరికానర్గళంబు
పలలభక్షణకుతూహలసారమేయంబు కాకగృధ్రానీకకలకలంబు

నిమిషార్థ మైనను నినుఁ బాసి మదిలోనఁ దాలిమి నిలుపంగఁ జాల నేను
వనమున కేగతిఁ బనుపుదుఁ గౌశికుమాయ ని న్నింక నేమి చేయఁ గలదొ
యరయ నిది యెంతపనియైన నయ్యెఁగాని, యోసరిలవచ్చునే మన కొడయఁడైన
బ్రాహ్మణుఁడు కోరి చెప్పినపనుల కెల్లఁ, బూని వేగంబ యరుగక మానరాదు. 22

వ. అని యత్యంతచింతాభరంబును జెంది యప్పురంధ్రీరత్నం బతిప్రయత్నంబున సకల దేవతాప్రార్థనంబుం జేసి వియచ్చరనిశాటపన్నగభూతదుష్టమృగపక్షివ్రాతంబులవలనం గుమారునకుఁ బ్రాణభయంబు వొదవ కుండునట్లుగా నాశీర్వదించి యభిమంత్రించి దక్షిణకరంబున నొక్కరక్షాబంధనం బొనర్చి యనుపుటయుఁ గాననంబునకు నమ్మానవతీసూనుం డరుగ నుద్యోగించుసమయంబున. 23

సీ. చలము కోపము మానసంబులో దళముగా గాధినందనుఁ డహంకారలీలఁ
దనమంత్రసామర్థ్యమునఁ దక్షకాఖ్యపన్నగరాజు నాకర్షణంబు చేసి
దక్షత నీవు తక్షక మాకొక్కహితకార్య మొనరింపు మటియనుగ
సార్వభౌముఁడు హరిశ్చంద్రుఁ డరుంధతీపతిపూన్కి యూఁదెర్ప మతిఁ దలంచి
విదితసత్యంబు నిర్వహించెద నటంచుఁ బ్రతిన తాఁబూనియున్నాఁడు ధృతి దలిర్ప
నతని నన్నృతంబు లాడింప ననువు పడక, వెరవు వెదకుచు నున్నాఁడ వినుము నేను.

చ. బహువిధమాయ లెల్లెడలఁ బన్ని యనూనవిపత్పరంపరా
సహితునిఁ జేసి ధైర్యగుణసాహసము ల్లొలఁగంగఁ జేసి యా
మహిగకులేంద్రువాక్యములు మిథ్యలు చేయఁగఁ బూనినాఁడ నో
యహివర నాకు నిప్పుడు సహాయము గావలయుం బ్రియంబునన్. 25

క. భవదీయవిషాగ్నులచే, నవనీధ్రము లైనఁ బగులు నారసి చూడన్
భువిలోపలఁ దక్కినమా, నవులకు నిలువంగ వశమె నాగకులేంద్రా. 26

ఉ. కావున నామనఃప్రియముగా నతివేగమ నీవు పోయి త
ద్భూవరపుత్రుని న్విపినభూమికిఁబోయినలోహితాస్యునిన్
జీవము పోవునట్లుగ నశేషవిషానలభూత్కృతిస్ఫుటా
రావమహోగ్రతం గటిచి రమ్మని పంచినఁ దక్షకాహియున్. 27

సీ. పనిపూని యప్పుడ చని యల్లపిత్రువనసీమాసమీపంబుచెఱువుపొంత
వటమహీరుహమున వల్మీకరంధ్రంబు శీఘ్రంబ తాఁ బ్రవేశించియుండెఁ
దదనుకూలముగాఁగఁ దనశిష్యవితతుల బోధించి పలికె నగ్గాధిసుతుఁడు
వటుశిఖామణులార వారక మీ రేగి నృపకుమారునిఁ గూడి విపినభూమిఁ

నొక్కుమంచె పెట్టించు మనుటయు నట్లుకాక యని కృతనమస్కారుండై యతం డరిగి యతిత్వరితంబున సముత్తుంగమృణ్మయవేదికాబంధురంబును ఘనశిలాస్తంభసంభృతంబునుం గామంచె గల్పించి విచ్చేయుం డని విన్నవింప నప్పంచజనాగ్రగణ్యుం డమ్మంచెపై నిలిచి విపక్షహరణదక్షుం బగునిజభుజాకౌక్షేయకంబు సహాయంబుగా మహాశౌర్యంబునఁ గావలి యుండె నంత నక్కడ. 16

సీ. అతిధైర్యమతి యగు నాచంద్రమతియును సర్వంసహాసుధాశనునియింటి
హంసనారి యనెడునభిధానము వహించి దాసియై తొంటివిలాస మెడలి
చెందినవగ నుదాసీనకృత్యంబుల నత్యంతదీనత యావహిల్లి
తనలోనఁ బలుమాఱు దైవంబు దూఱుచుఁ గొడుకును దానును నిడుమ బడలి
పొడము నాఁకలిడప్పుల కడచిపడక, కలహకంటికి మనసురా మెలఁగుచుండ
నరిగె ద్వాదశమాసంబు లంత నొక్క, నాఁడు విప్రుండు రాజనందనునిఁ జూచి.

సీ. ఓరోరి లోహిత యీరీతి రేయును బగలును బానిసఁ బాసి రాక
యేపని చేయక యిట్లుండెదవు నిన్నుఁ గనుఁగొన్నఁ గోపంబు గదుర కున్నె
యని చిన్నకూఁకటిఁ బెనఁచినజడ పట్టి గుంజి యీడిచి చెంపఁ గొట్టి తిట్టి
నేఁడు మొదలుగాఁగ నీవింక నిత్యంబు నీయీడువడుగుల నెమ్మిఁ గూడి
యర్కుఁ డుదయించుతఱి నరణ్యమున కరిగి, కుశసమిత్పర్ణఫలములు గొంచు రమ్ము
కడుఁ బ్రయత్నముతో నని నుడువుటయును, దైన్యమునుబొందియేడ్చుచుఁదల్లిఁగదిసి.

చ. కనుఁగవ బాష్పబిందువులు గ్రమ్మఁ బదంబులమీఁద వ్రాలుచుం
దనుఁ గినుక న్మహీసురుఁ డదల్చిననిష్ఠురభాష లెల్లఁ జె
ప్పిన విని యాత్మలోనఁ గడుభీతి వహించుచు నార్తనాదయై
తనయుని జంకఁ బెట్టుకొని తామరసానన చింత నొందుచున్. 19

చ. అకటకటా విహీనదయ నర్భకు నిన్నును జూచి కాలకౌ
శికులకు రోషభంగిఁ బని చెప్పఁగ నేగతి జిహ్వ యాడెఁ గా
నకు నిపు డీవు పోయిన మనంబున ధైర్యము నిల్ప నేర్తువే
వికచపయోజతుల్యముఖవిభ్రమ భానుసమప్రభానిధీ. 20

క. జనపాలతనయు లెంతయు, వినయంబునఁ జేరి కొల్వ విహరించెడునీ
కనయము నొకవిప్రాధము, కినుకకు లోఁబడఁగ వలసెఁ గింకరవృత్తిన్. 21

సీ. అనపాయభాగ్యరేఖాన్వితయైనట్టి రాజముఖీశిరోరత్నమునకుఁ
బుట్టిక ప్రాతరంభోజబాంధవతేజ పట్టి నా కేటికిఁ బుట్టితయ్య.

కజనయనాశిరోమణియుఁ గల్మషదూరయు నై ధరిత్రిపై
సుజనతఁ గన్న తజ్జనవిశుద్ధపవిత్రచరిత్ర మెట్టిదో. 36

వ. ఇవ్విధంబున మూర్ఛిల్లినమహీవల్లభుతనయునిం గనుంగొని యక్కుమారులు మహా
ద్భుతంబును బొంది. 37

ఉ. ఈవసుధేశనందనుఁ డహీంద్రమహావిషవహ్ని కీలలన్
జీవములం దొఱంగక విచిత్రగతి న్గరళంబు మ్రింగి మూ
ర్ఛావశుఁ డైనహేమగిరిచాపునిరూపున నున్నవాఁడు మై
చేవయు మోముకాంతియును జెన్నటియుండ వొకించు కేనియున్. 38

తే. గాజువాఱదు చరణపంకజయుగంబు, హస్తతలములకెంజాయ లడఁగి పోవు
కాదు వేఱొక్కరూపంబు కన్నదోయి, యొడలిలోఁ బ్రాణములు దాఁగియుండఁబోలు.

తే. కొడుకువలకేల నెంతయుఁ గుశలనియతి, యమర నీరక్ష గట్టెడుసమయమునను 39
దెలివి నేమని యాశీర్వదించినదియొ, తల్లి లోకైకవినుతకాంతామతల్లి. 40

వ. అని యతిత్వరితంబునం బురంబునకుం జని మిథ్యావృత్తరవంబున నవ్వార్త మార్తాండ
కులచక్రవర్తిదేవికిం దెలియ నెఱింగించుటయు నమ్మెఱుంగుంబోఁడి కాదంబినీ
గర్జానినాదంబు విన్నమరాళియు నిషాదకోదండమౌర్వీనాదంబు వినినసారంగియు
దాశరథిశాపాక్షరరవంబు వినినపికాంగనయు బిడాలరవంబు వినినబాలశుకియుఁ
గంఠీరవంబుకంఠశబ్దంబు వినినకరిణియునుం బోలె నుల్లంబునఁ దల్లడిల్లి హా కు
మార యని ఖండితకదళీతరుకాండంబుచందంబున మహీతలంబునకు వ్రాలి మూ
ర్ఛిల్లి కొండొకసేపు చేష్టావిహీనయై యుండి యెట్టకేలకుం దెలిసి బెట్టువగం
బొంది బాష్పజలధారాపూరంబులఁ బాలిండ్లు తొప్పఁదోఁగ నేడ్చుచుఁ దనలో
నిట్లనియె. 41

తే. అక్కటా లోహితాస్య బాలార్కతేజ, ఘోరశోకంబుచే నన్నుఁ గుందఁజేసి
తేమిచేయుదు నాకు ది క్కెవ్వ రింక, నెట్లు నినుఁ బాపె విధి కృప యింత లేక. 42

క. పతిఁ బాసియు నీకతమున, మతిలో దుఃఖంబులెల్ల మాని చరింతున్
ధృతి యాత్మ నిలిపి యిఁక నే, గతిఁ గడతున్ శోకవార్ధి కడముట్టంగన్. 43

క. భీకరఫూత్కారంబున, నాకాకోదరము గవియునప్పుడు మదిలో
నేకరణిఁ దల్లడిల్లితొ, రాకానీహారకిరణరమ్యశరీరా. 44

వ. అని శోకించునమ్మహీకాంతుకాంతపయిం గినిసి విప్రవనిత యిట్లనియె. 45

తే. తొలుతఁ బుత్రుని నెచటికో తోలఁగఁబెట్టి
యడవిలోఁ బాము మూర్కొన్నదంచు మొఱఁగి

గలయఁ జరియించి వాని నేకరణి నైనఁ, బూని ప్రేరేఁచి తోడ్కొనిపోయి తక్ష
కాహివల్లభక్రూరవిషాగ్ని శిఖల,పాలుగా ద్రోచిరండని పనుచుటయును. 28

వ. అత్యంతరయంబునం జని లోహితాస్యునిం గనుంగొని. 29

ఉ. ఓనృపపుత్ర మద్గురునియోగమునం జని యేము నిత్యముం
గాననభూముల న్వెలయుకాయలు పండ్లును దర్భ లిధ్మముల్
మానుగఁ గోసి తెత్తుము క్రమంబున నీవును మమ్ముఁ గూడి ర
మ్మా నిఖిలంబు చూపెదము మక్కువతోడుత వానియిక్కువల్. 30

వ. అని యొడంబఱిచి యమ్మహీవరకుమారునిం దోడ్కొని చని కాననమార్గంబులు దఱి
సి తత్ప్రదేశంబులఁ గొంతసేపు మనోహరవిహారంబులు సలిపి వివిధమధురఫలంబు
లు దర్భలు నిధ్మంబులుతృణంబులునుంగోసిమోపుకట్టిశిరంబునంబెట్టిచనుమనుటయు.

చ. పొడవగుడప్పిచే మిగులఁ బొల్పఱి కుత్తుక యెండుచుండఁ బె
ల్లుడుగక ఘర్మబిందుతతు లొక్కట మోమున నంకురింపఁగా
వడఁకుచుఁ జిన్నిచుంచు చెలువం బెడలంగఁ బదాంబుజాతము
ల్తడఁబడ దేహ మంతయుఁ గళంకము నొందుచు ధూళి బ్రుంగఁగన్. 32

సీ. నడచి బిట్టలసి పన్నగ మున్నయామఱ్ఱి మొదల నొయ్యన తలమోపుఁ జేర్చి
డప్పికి నచటితటాకతోయంబులు గ్రోలి రాకొమరుండు కొంతదడవు
తద్వటచ్ఛాయ నిద్రాముద్రితాక్షుఁడై పవళించి సహచరబ్రహ్మచారు
లెఱఁగింప మేల్కని యిందాఁక మఱచితి ననుచు నాకులు గోయుననువు వెదకి
యొక్కపాదంబు పుట్టపై నునిచి యొండు, పాద మవనీరుహంబుపై నూఁదిత్రొక్కి
క్రిందికొమ్మకు మెల్లన కేలు చాఁచి, యందికొని కోయఁ బూనునయ్యవసరమున. 33

మ. ప్రళయారంభకృతాంతభీకరకరాబ్జస్థూలపాశంబుతోఁ
దులఁదూఁగం గలయాకృతిం బొదివి వాతూలాశనస్వామి నా
ల్కలు పెల్లార్చుచుఁ బుట్టలో వెడలి యుగ్రస్ఫూర్తిమైఁ గోప మ
గ్గలమై పర్వఁగ రాసుతుం గఱచె ఫూత్కారంబు తోరంబుగన్. 34

ఉ. భూతలనాథనందనుఁడు భూరివిషానలకీల లుబ్బ సం
జాతశరీరవేదనకుఁ జాలక ధారుణిమీఁద వ్రాలి లా
లాతతి నోరఁ గ్రమ్మ మిగుల న్మరణాతతమూర్ఛ నొందె హా
మాత యటంచుఁ దత్క్షణమ మఱ్ఱియు రూపఱియె న్రయంబునన్. 35

చ. నిజవిషవహ్నిచేత నవనీధ్రము లైనను నీఱు సేయు నా
భుజగవిభుండు భూరమణపుత్రుని జంపఁగ నోపఁ డయ్యెఁ బం

జెమటచే నవయవములు చెమ్మగిలఁగ, దలఁచు దుస్స్వప్నముల మతి దడఁబడఁగ
గలవరించుచు నోడ లెఱుఁగక పెలవుల, జొల్లు గాఱఁగ బ్రాహ్మణిసుప్తిఁ బొందె.

వ. అప్పు డప్పల్లవాధర చరణంబులు చప్పుడు గాకయుండఁ గదలి సదనంబు వెలువడి నిజహృదయాభ్యంతరంబునం బొదలుశోకధ్వాంతంబునకుఁ దోడు బాహ్యతిమిరం బసహ్యంబై పొదివికొన బ్రహ్మచారులు చెప్పినచొప్పునఁ బతిభక్తియే తనకు సహాయంబుగా మహాధైర్యంబునం జని వటభస్మపుంజంబునకై చరణంబులు వల్మీకంబునకై శిరంబునుం గా వసుంధరం బడి కించిదున్మీలిత నయనుండై విచారదూరమానసుండై యూరక మున్ను నిద్రించువిధంబున నున్న గారాబుకుమారు లోహితాస్యుం గనుంగొని. 56

తే. తరుణి యోర్వంగఁ జాలక తత్క్షణంబ, ధరణిపైఁ బడి మూర్ఛిల్లి ధైర్య మూఁది
కొంతవడి కింత దెలిసి నిజాంతరంగ, భరితశోకాగ్ని కీలలు ప్రజ్వరిల్ల. 57

ఉ. హాసుకుమార హావరగుణాకర హాచిరపుణ్యశీల హా
వాసరవల్లభప్రకటవంశమనోహరకీర్తిమూర్తికా
పాళీసరసీరుహారిసదృశాంగవిభాసిత లోహితాస్య నిన్
బాసి చరింప నోప ననుఁ బాయఁగఁ బాడియె నీకు నక్కటా. 58

సీ. మొలకనవ్వుల నునుముద్దులనీమోము గూర్మి రెట్టింపఁ గన్గొనక యున్న
నమృతంబు చిలుకునీవిమలవాక్యంబులు వీనులు చల్లఁగా వినక యున్న
సంపూర్ణపూర్ణిమాశశిఁ బోలునీ మేను చెలువారఁ గౌఁగిటఁ జేర్ప కున్న
నిరుపమానము లైననీచిన్నిచెక్కులు ప్రేమతోఁ గదిసి చుంబింప కున్న
నిమిషమాత్రంబు ప్రాణము ల్నిలుపఁజాల, నేనుఁ జను దెంతు నెటఁబోయితే తనూజ
చేరి నాతోడ నొకమాట చెప్పవయ్య, పలుమఱును నిన్నుఁ బిలువంగఁ బలుక వేల 59

క. రాహుగ్రహముఖకబళిత, నీహారమరీచికరణి నీవదనము క్రూ
రాహీంద్రవిషానలకీ, లాహతిచేఁ జెలువు దఱిగె ననుఁగుఁగుమారా. 60

ఉ. బాలిక లూఁచుచుం గదిసి పాడఁగ మేడలలోన రత్నశో
భాలలితంపు టుయ్యెలలపై సుఖ ముండెడునీవు నేఁడు తా
నేల నరణ్యమధ్యమున నిర్భరలీలల నిద్రఁ బోయె దా
భీలసృగాలరావములు పెల్లుగ నెల్లెడ నుప్పతిల్లఁగన్. 61

వ. అని తనూభవునిం బాయం జాలక మోహపరవశత్వంబున నక్కునం జేర్చి పేర్చు శోకోద్రేకంబునం గఱచిన కాకోదరంబుం దలంచి.

కల్లయేడుపు లేడ్చుచుఁ గపటవృత్తి
వెదకుసందున సురుఁగఁ జూచెదవు నీవు. 46

క. నాముందఱ నెటు కరిగెద, వీమాయలు మాకుఁ దెలియు నిన్నియు నిను నే
నేమఱుదునె నీకంటెను, నే మించినజాణఁ జుమ్ము నెలఁతలలోనన్. 47

తే. కొడుకుఁ బలుమాఱుఁ దలఁచుచు నడుగ కిట్లు, మిగులశోకంబుఁ బొందుచు మిన్నకున్న
నీవు గావించుపను లెల్ల నెవ్వ రింకఁ, జేయువారలు రా రమ్ము శీఘ్రముగను. 48

వ. అని యిత్తెఱంగున నంబరుషంబు లగు దురాలాపంబులు పలుకు నక్కాలకౌశికుని
యాలిం గనుంగొని యాలీలావతి యాఱనిదుఃఖంబు లోలో నడంచుచు. 49

సీ. అమ్మ యీవేళ నన్ననుకంపఁ జూడంగఁ దగుఁ జిత్తమున నొండుతలఁపు మాని
నాకుమారుఁడు కాననంబులో విష మెక్కి యేరీతి నున్నాఁడొ యెఱుఁగ రాదు
తెప్పించి యౌషధం బిప్పించి పుత్రదానము సేయ వలయుఁ బుణ్యంబు మీకు
నని వేఁడికొనుచు దైన్యంబున నడుగులపై వ్రాలి లేవకఁ బలువరింపఁ
గొంతకనికర మాత్మ నంకురము నొందఁ, గలహకంటికి యిల తేనికలువకంటి
తలపదంబున నొక్కింత దొలఁగఁ ద్రోచి, పలికెఁ గర్ణకఠోరసంభాషణముల. 50

ఉ. బాలురయేడ్పు మాన్పుటకుఁ బండులు దెమ్మని పంచిన న్మహా
ఖీలభుజంగసంఘములు పెల్లుగ నుండెడుపుట్ట లెక్కఁగా
నేల భవత్తనూజునకు నే మొనరించినయట్టి దేమి యా
పాళము దప్పఁ గ్రొవ్విన యభాగ్యుల కూరక యేడ్వ వచ్చునే. 51

తే. ఒడలెఱుంగక తిని మసరుటికె వాఁడు, కావరము పట్టి యున్నాఁడు గాక పుట్ట
లెక్కఁ బోవంగ నేటికి నింతలోన, నట్లు కాఁదగు వానికి నడల నేల. 52

తే. కాననంబులఁ బుట్టలలోనఁ దిరుగు, పన్నగంబుల కెల్ల వాగ్బంధనమ్ము
చేయఁ దగు మాకు నిది మేముచేసినట్టి, తప్పు లోఁగొమ్ము మాయమ్మదయ దలిర్ప. 53

చ. పలుమఱు నేమి పల్కి లిఁకఁ బల్కక మిన్నక యేగుదెంచి నీ
వలవడఁ జేయునట్టిపను లన్నియు నుంగొఱ గాక యుండ ని
శ్చలమతితోడఁ జేసి మఱి సత్తుగ నీసుతువార్త యంతయుం
దెలియుము పోయి నావుడు సతీతిలకం బతిశోకచిత్తయై. 54

సీ. మఱి యేమియును మాఱుమాటలు పల్కంగ లేక ధీరత నట్లకాక యనుచు
బాములఁ బడి సందెజాము పోయినఁదాక వరవుడుపనులు సర్వంబుఁ దీర్చి
యలసియు విసువక యరుదెంచి భక్తిమై నొయ్యన చరణంబు లొత్తుచుండ
బెట్టుగఁ బలుమాఱు నిట్టూర్పు లిచ్చుచు భీకరంబుగ గుఱు పెట్టుకొనుచుఁ

చాననంబునుంబోలె నారాజపంచాననం బామంచెపైనుండి వసుంధర కవతరించి
మెల్లన చనుదెంచి. 70

సీ. నిబిడశోకారుణనేత్రకోణంబులఁ బలుమాఱు దొరఁగెడుబాష్పములను
జెక్కుపైఁ జేర్చినచిగురుకెంగేలును వట్టిపోయినయట్టివాతెఱయును
వేఁడిమైఁ బలుమాఱు వెడలునిట్టూర్పులు గొదకొని వెక్కుచుకుత్తుకయును
గడుఁ జిక్కుచీఱుగా విడిసక్రొమ్ముడియును నవనీరజోలిప్తమైనమేనుఁ
దొలఁగి పోయినచనుకప్పు మలినపటము, మిగుల వాడినమోముఁదమ్మియును గలిగి
దీనదశ నున్నచంద్రమతీ పురంధ్రి, కట్టెదుర నిల్చె నత్యంతకరుణ పొదల. 71

చ. నిలిచిన భీతియు న్వడఁకు నివ్వెఱపాటును భూరిలజ్జయుం
గళవళము న్జనింప నధికం బగుశోకముఁ బొంది కుందుచుం
దొలఁగినపయ్యెద న్వలుదతోరపుఁజన్నులు కప్పుచున్నయా
నళినదళాక్షిఁ జూచి నరనాయకవంశలలాముఁ డిట్లనున్. 72

సీ. ఈనట్టనడురేయి యీరుద్రభూమిలో నీవెనుచీఁకటి నేవిధమున
నొక్కింత శంకింప కున్నసాహసురాల వేటికి వెఱపు నీ కెత్తెఱంగున
నేకారణమున నీ కిట్టిదుర్దశ వచ్చె నెఱిఁగింప వలయు మా కివ్విధంబు
నీభర్త యెవ్వఁడు నీనామ మెయ్యది యెచ్చోట వసియింతు వెపుడు నీవు
బాలుఁ డేటికి మృతిఁబొందె వాలుగంటి,యనిన వదనాంబుజము వంచి యశ్రుధార
లొలుక గద్గదకంఠయై పలికె ధరణి, కాంతుమానసమున కనుకంప వొడమ. 73

ఉ. ఓనరలోకవంద్య విను ముజ్జ్వలభూరికృపాపిధేయ నే
నీనగరంబులో నొకమహీసురపుంగవుమందిరంబునన్
బానిసనై వసింతు నను భర్త ఋణంబునకై ధనార్థియై
మానితసత్యవాఙ్నియతి మానక పోకడ వెట్టెఁ దాలిమిన్. 74

తే. నాదునామంబు విను మంసవారి మత్కు, మారుఁ డీతండుభూమిబృందారకుండు
కోరి పుత్త్రేరఁగా సమిత్కుశఫలార్థ, మడవి కేతెంచి ఫణిదష్టుఁ డగుచు నీల్గె. 75

క. మీరెవ్వ రనఘ సత్కృప, నారని నాదుఃఖ మెల్ల నడఁపఁగ మదిలోఁ
గోరి ప్రియంబు జనింపఁగఁ, జేరం జనుదెంచినట్టిసిద్ధాగ్రణివో. 76

తే. కాక బహుభూతనివహము లక్కడిసి కొలువ, భీతిఁ బుట్టించు నేతత్ప్రేతభూమిఁ
బ్రీతి విహరించుచుండెడిభూతపతివొ, యాన తియ్యంగ వలయు దయానిధాన. 77

చ. త్వరితమ మత్కుమారున కవార్యకృప న్విషవైద్య మిచ్చి యో
చిరతరపుణ్య క్రమ్మఱ సజీవునిఁ జేసి మదీయమానసాం

ఆ. వక్రగతిన యెప్పుడు వర్తించు రంధ్రముల్, వెదకుచుండు మిగుల విషము గూరియు
నోర పడఁగఁ బెట్టు నోయన్న యేమందుఁ, జిట్టు బుస్సు మనెడిచెడుగుఁబురుగు. 63

క. ఏమందు నిన్ను లోహిత, యేమందుల మాను నందు నిఁక నెవ్వరితో
నేమందు నిన్నుఁ గఱచిన, పామందే కూడి యుండెఁ బాపపువిధియున్. 64

వ. అని యక్కుంభీనసంబు నుపలంభించి యారంభోరువుహృదయాంభోరుహంబుం దన కుం దాన యూఱడించుకొని ధైర్యవివేకంబుల నలవరించి యింక వీనికిం బుణ్యలోకప్రాప్తి యగునట్లుగా నుచితసంస్కారంబు లొనర్చి కలహకంఠకి మేల్కానకమున్న రయంబునం జని సముచితకృత్యంబు లొనర్పం దగు నిచ్చోట నాలస్యంబు గర్తవ్యంబు గాదని పట్టిం దనమూఁపునం బెట్టుకొని కొంతదవ్వు చని పరేతనికేతనంబుం బ్రవేశించి యందు భూతప్రేత పిశాచశాకినీఢాకినీబేతాళ కలకలస్వరంబుల నతిభయకరం బైనయారుద్రభూమిం దనపాతివ్రత్యధైర్యంబులు సహాయంబులు గాఁ బుత్రుని డించి దందహ్యమానంబు లైన శుష్కకాష్ఠంబులు కొన్ని గూర్చి పుత్రు నందు నిడి యింగలంబు తగుల్పం బూని పూనలేక శోకావేశంబున నిట్లనియె.

సీ. మాతామహుండును మాతామహియుఁ జేయుగారాము గైకొనఁ గాన వైతి
వానందమున నెత్తి యర్మిలి ముద్దాడుమేనమామలమేలు గాన వైతి
గరిమ నక్కునఁ జేర్చి శిరము మూర్కొనుతండ్రి కౌఁగిటి మెలఁగంగఁ గాన వైతి
వుత్సంగమున మించి వాత్సల్యమున దాదిగా సేయుమోహంబు గాన వైతి
పరిజనంబులు సఖులును బ్రమద మెసఁగఁ, బూని యొనరించుప్రియములు గాన వైతి
చుట్టముల కెల్ల వెలిపడి రట్టుపడిన, నాకు జనియించి యిట్లైతివే కుమార. 66

తే. ఇవ్వసుంధరలోపల నెన్నఁదగిన, భాగ్యసౌభాగ్యవతు లైనపడఁతు లుండ
సకలదుర్లక్షణములకు సదన మైన, నాకు నేటికిఁ బుట్టి తరయా కుమార. 67

వ. అని యిత్తెఱంగున. 68

ఉ. పంచమనాదయుక్తిఁ బికభామిని కూయుతెఱంగు దోఁప నా
చంచలనేత్ర హస్తజలజంబులు మోమునఁ జేర్చి యేడ్చె నే
త్రాంచలబాష్పబిందునివహంబుల దోఁగునురోజకుంభము
ల్మంచునఁ దోఁగుపద్మముకుళంబులతోడుతఁ జెల్మి సేయఁగన్. 69

వ. అయ్యార్తరవంబు విని హరిశ్చంద్రుండు మహాశ్చర్యంబునం బొంది యాయర్ధరాత్రంబిచ్చోట నేకతంబ శోకించు వనితానిస్వనంబు వినంబడియె నిస్సందేహంబు గాఁ గనుంగొన వలయు నని ముద్రగుదియ భుజంబునం బూని కరఖడ్గంబు కటిబద్ధాంబరంబునఁ గీలించి కులకుధరశిఖరంబుననుండి మహీమండలంబునకు లంఘించుపం

చ. కదురు మెఱుంగునిబ్బరపుగుబ్బలపై నయనాంబుపూరముల్
చెదరఁగ నేలయేడ్చెదవు చెల్వ దురంతవిషాదవేదనా
విదళితమానసంబునను వేమఱు నాయువు శాశ్వతంబె సం
పదలు స్థిరంబులే విధివిపాకము దాఁటఁ దరంబె యేరికిన్. 87

వ. అనినఁ జంద్రమతి యిట్లనియె. 88

ఆ. సుజనవినుత గోరుచుట్టుపై రోఁకటి, పోటు దాఁకినట్లు పో తలంప
మొదల శోకజలధి మునుఁగంగ నందుపై, నీవు పల్కినట్టినిష్ఠురోక్తి. 89

మత్తకోకిల. ఓమహాత్మక మిమ్ము దూఱఁగ యుక్తమే వివరింప మా
రేమి చేయుదు రయ్య మాటికి హెచ్చి కౌశికవశానిమా
యామయం బయి వెంటవెంట నహర్నిశంబులుఁ బాయ క
ద్దామశక్తిని నాదుకర్మము దాయకైవడి నుండఁగాన్. 90

వ. అనుటయు నవ్వాక్యంబు లాకర్ణించి హరిశ్చంద్రనృపపుంగవుం డంతరంగంబునం గలంగి యిక్కురంగనయన మదీయభార్య యగునని యంతలోనం దనమనంబు మగుడ్చ ద్దిగిచికొని నిశ్చయంబుగా నెఱుంగ కిత్తెఱంగునం దలం పేల పుట్టెనొకో యని పశ్చాత్తాపంబును బొంది యమ్మందగమనం గనుంగొని మఱియును. 91

చ. హరపదపూజనం దొలఁగి యంత్యజుఁ గొల్చి కులాభిమానముల్
సరగున వెచ్చపెట్టి హరిచందనకీర్తులు వీటిఁబుచ్చి దు
ష్కర మగువల్లకాటి కధికారము వచ్చినదుష్టబుద్ధికిం
గరుణ దలంప నెక్కడిది గంధగజేంద్రసమానగామినీ. 92

చ. అలికులవేణి వీఁడు చతురబ్ధిపరీతమహీతలేశుఁడై
యలరునృపాలశేఖరునియాత్మజుఁ డంటివి మున్ను నీవు త
త్కులసతి వింతదైన్యమునకుం బనిలే దొకమాడమాత్రముం
గలుగదె నీకు నిట్లు పలుకం దగునే విపరీతవాక్యముల్. 93

క. మాడకు మిక్కిలి యడుగము, చేడియ మత్స్వామి మున్ను చేసినమేరల్
జూడగ నడపఁగఁ దగు మొగ, మోడంగారాదు మాకు మొగి నెవ్వరికిన్. 94

తే. నీకు మఱియొండుపాయంబు లేకయున్న, నెలఁత మాకిచ్చుమాడకు నెలవుగాఁగ
నెమ్మిఁ గైకొనియెద నిమ్ము నీదుకంఠ, సూత్రమున నున్నమిను కైన శోక ముడిగి.

చ. సరసిజనేత్ర జీవితము సత్యము గాదు శరీరధారికిన్
మరణము నిశ్చయంబు పలుమాఱుఁ గుమారునిఁ జూచి యేడ్చిన

బురుహాము సమ్మదస్ఫురణఁ బొందఁగఁ జేయు మహానుభావ త
త్పరమతిఁ బుత్రదానసుకృతంబు సమస్తము నీకుఁ గల్గెడిన్. 78

వ. అనుటయు నమ్మందగమన ప్రియవచోవిశేషంబులవలనఁ దనకులాంగన యగుట నిక్కంబుగా మనంబునం దెలియక సందేహంబున నారాజపురందరుండు వెండియుం జంద్రమతిం జూచి. 79

తే. పంకజానన నే భూతపతిని గాను, దురితహరుఁ డైనయట్టిసిద్ధుండఁ గాను
దగినవిషవైద్యమంత్రతంత్రముల నెఱుఁగ, బాలుప్రాణంబు మగిడింపఁ జాల నేను. 80

సీ. వనజాక్షి యిప్పురేతనికేతనక్షోణి తనగుత్తగాఁ జేసికొని వసించు
చండాలకులపాలకుండు నాయేలిక వీరబాహుం డను పేరివాఁడు
సదయుఁడై యీముద్రగుదియ నాచేతికి నిచ్చి యాతఁడు నన్ను నిచటి నుండఁ
బనిచిన నుండుదు భక్తి మీఱఁగఁ దదాజ్ఞాయత్తచిత్తుండ నగుచు నెపుడు
వినుము నానామధేయంబు వీరదాసు, నే నెఱుంగక యుండఁగ నీవు నీవ
నట్టనడురేయి వచ్చి యీపట్టిఁ దెచ్చి, యిచటి నునుపంగఁ బాడియే యిగురుబోఁడి.

సీ. ఆడుదానవు గాన ననుకంప జనియింపఁ బరుషోక్తులను నేమి పలుక నోడి
యూరక యుంటిఁ దక్కొరుని నెవ్వని నైన శిరము ఖండింతుఁ గౌక్షేయకమున
సాద పేర్వఁ దగునంతచోటికి నొకమాడ తెచ్చి నా కిత్తురు మచ్చెకంటి
యీచొప్పు దప్పక యియ్యంగ వలయును దొరకక యుండినఁ దొలఁగి పొమ్ము
మాట లింకేల యిచ్చోటి మసలి తేని, యంత్యజాగ్రణి మత్స్వామి యైనవీర
బాహుపదములయాన యోభామ యనిన, మిగులశోకంబు నిగుడ నమ్మగువ పలికె.

చ. పరహితమార్గవర్తన శుభంకర నన్నొకకొంత నీదయా
సరణిఁ గనుంగొన న్వలయు సంపద గల్గినదానిఁబోలె ని
ష్ఠురగతి మాడ వేఁడెదవు చూడఁగ నే నిరుపేదరాల నె
వ్వరు మఱి దిక్కు లేరు తగవా నను శోకపయోధి ముంపఁగన్. 83

క. శ్రీలున్ దైవాఱ జలధి, వేలావలయితధరిత్రి విమలయశుండై
యేలున్నృపసూతి యడుగెడు, నేలకుఁ బాత్రుండు గాఁడె నీ కిటు తగునే. 84

వ. అని మఱియును. 85

మ. అకటా చేరెడు నేలకుం దగఁడె సప్తాంభోధివేష్టితభవ
త్సకలద్వీపకలాపభూపమకుటాంచత్పద్మరాగోజ్జ్వల
ప్రకటానర్గళనిర్గళత్కిరణశుంభత్పాదుఁ డైనట్టిరా
జకుమారుం డని యేడ్చెఁ గన్నుఁగవ నశ్రుల్ గ్రాల్వలై పాఱఁగన్. 86

వ. అని బహుప్రకారంబుల శోకించు నాతలిరాకుబోఁడిం గనుంగొని యమ్మహీకాం
తుండు మూర్ఛాగతుండై కొండొకసేపునకుం దెలిసి ధైర్యంబు తూలఁ బుత్రశోకం
బునం గుంది కుమారుని యశేషవయోరూపగుణవిశేషంబు లంకించుచున్న జీవితేశ్వ
రునిం జూచి వివేకంబు మీఱ నూఱడించి చంద్రమతి యిట్లనియె. 104

చ. ఇనకులసార్వభౌమ మన మిద్దఱము ధృతి దూలి యీగతిన్
ఘనతరశోకవహ్నిఁ బడి క్రాఁగుచు నుండుట బుద్ధిగాదు నె
మ్మనమునఁ దాల్మి నిల్పుఁ డిఁక మానుఁడు దుఃఖము వేకువయ్యెఁ బ్రొ
ద్దును బసలేదు కుక్కుటతతు ల్వెసఁ గూయఁగఁ జొచ్చె నెల్లెడన్. 105

తే. ఇచటఁ దడయంగ రాదు నా కినుఁడు పూర్వ, గిరికి నేతేకమున్న సత్వరమ యరిగి
సమయసముచితకృత్యముల్సలుపకున్న, నలుగు నామీఁద మిగులబ్రాహ్మణునిగృహిణి.

తే. తనయుపైఁ బర్వుమోహలతావితాన, మాత్మసుజ్ఞానమయనిశితాసిఁ గోసి
ధూనతిం డింక నేమిసేయంగ నుచిత, మనిన నూహించి తగవరియగుచు నృపుఁడు.

సీ. ఆకాంతతోడ నిట్లనియె నోరాకేందుముఖి స్వామికార్యంబు ముఖ్య మరయ
నేలిక మనమున కెడసి సత్యము దప్పి యిప్పని కొడఁబడ నెట్లు వచ్చు
నిఁక నొండు మాని నిన్నేలినయట్టిధాత్రీదేవు నడిగి యేరీతి నైన
మాడ యొక్కటి దెమ్మ మసలక వేగంబ తగవు నౌచిత్యంబు దలఁపు మనినఁ
బ్రాణవల్లభుసత్యప్రభావమునకు, మిగుల నచ్చెరు వంది యమ్మీననయన
యాత్మజుని భర్తకడ నిడి యప్పగించి, యధికభక్తిప్రణామంబు లాచరించి. 108

తే. మఱలి పురవీధి నేగెడుతఱి నెఱింగి, కపటకృత్యధురీణుండు గాధిసుతుఁడు
నృపవధూటిని వధియింప నుపమ యొకటి, యాత్మలోపల యోచించె నద్భుతముగ.

ఆ. తత్క్షణంబ యొక్కతస్కరుఁ గల్పించి, యార్యవినుతశీల యైనయట్టి
జనవరేణ్యుదేవి సమయింపఁ దగునుపా, యంబు గఱపి యరుగు మనిన వాఁడు.

క. మొల నీలి కాసెయును బద, ముల నోరచ్చులు ధరించి ముదము దలిర్పన్
సెలగోలయు ములుబంతియు, బలపముఁ గత్తియును బూని పటుసాహసియై. 111

సీ. ఆవారణాసిపురాధీశునగరిలో భీకరంబుగఁ గన్న పెట్టి చొచ్చి
భర్మహర్మ్యాంతరనిర్మితమణిమయడోలాగ్రమున సుఖలీల దాది
ప్రక్క నిద్రితుఁ డైనరాకొమరునిఁ జేరి బిగియారఁ గుత్తుక పిసికి కెడపి
తత్కర్ణకంఠహస్తవ్యస్తమణిమయాభరణము లైకొని భయము లేక
వెడలి చని చంద్రమతి కడువేగ వచ్చు, పథమునకు నడ్డమై నిల్చి ప్రాభవంబు
గర్వమును మీఱఁ బల్కెఁ దస్కరుఁడు కపట, మృదులగంభీరవాచాసమేతుఁడగుచు.

స్మరలు నా వీని ప్రాణములు మంగళసూత్రసువర్ణ మిచ్చి నీ
వరసుతునిం దహించు మగువా యన మూర్ఛిలి శోకమగ్నయై. 96

వ. తెప్పిరిలి యప్పలుకుల కులికిపడి యమ్మత్తకాశిని చిత్తంబున మత్పాతివ్రత్యవిశేషంబునం జేసి మదీయగళంబున నున్న మంగళసూత్రంబు మిన్కుఁ బరపురుషుల కెన్నండును లోచనగోచరంబు గాదు గావున నిమ్మహానుభావుండు హంసకులావతంసం బగు హరిశ్చంద్రనరేంద్రుండు సందేహంబును బొందవల దని యారాజపురందరుం డున్న దురవస్థకుం దనయంతరంగంబునం గలంగి యక్కురంగనయన తన్నుం దా నెఱుంగక మహీతలంబునకు వ్రాలి మొక్కుంచుక ధైర్యంబున నెట్టకేలకుం దెలివి నొంది. 97

తే. ఓహరిశ్చంద్ర నీపుత్రు లోహితాస్యుఁ, జేరి చూడుము మున్ను నీయూరుపీఠి
నిద్రఁ జెందిన కైవడి నేఁడు దీర్ఘ, నిద్ర నొందుచు నున్న నిర్నిద్రతేజ. 98

వ. అని పలికి ప్రాణేశ్వరు చరణకమలంబులకు నమస్కరించి కరంబు శోకంబున నిట్లనియె.

సీ. పృథుశిలాస్తంభసంభృత మైనయీమంచె నవరత్నసింహాసనంబె నీకు
నగశిరఃకఠినబంధురకపాలంబులు మంగళాచారకుంభములె నీకు
శూలాగ్రమానవస్థూలకేశంబులు రమణీయ మగుచామరములె నీకు
భూతబేతాళజంబుకనినాదంబులు కవిగాయకప్రసంగములె నీకు
నురుచరిత్ర మహాస్మశానోపకంఠ, శాకినీలోకభయదస్మశానభూమి
సకలరాజ్యరమానివాసంబె నీకు, సత్యగుణసంపదభిరామ సార్వభౌమ. 100

సీ. గుమిగూడి యున్న యీకొఱవిదయ్యంబులు పంజులవారలె పార్థివేంద్ర
దారుణఫేరవధ్వని కంచుకవ్రాతసాంద్రహుంకారమే సార్వభౌమ
ప్రీతిఁ జేరి భుజించు బేతాళనివహంబు మంత్రిసందోహమే మనుజనాథ
సందడి చేయుపిశాచములు నుడిగంపుటతివలె భానుకులావతంస
రుద్రభూమి యయోధ్యయే భద్రమూర్తి, మంచె సింహాసనమె జగన్మాన్యవీర్య
శౌండరి దైవంబు నేమని దూఱుదానఁ, గటకటా యోహరిశ్చంద్ర కాంతిచంద్ర. 101

శా. ఆభాగ్యోన్నతి యాసమగ్రవిభవం బారాజసం బాతనూ
శోభాడంబర మాభుజాబలకళాస్తోమంబు లాప్రాభవం
బాభూమీశ్వర యెందుఁ బోయె నిది దానో హా మహైశ్వర్య మిం
కేభంగిం దరియింతు వెల్లి గొని పెల్లేతెంచు శోకాంబుధిన్. 102

క. వైణికకరనఖముఖరిత, వీణానాదములు వేడ్క వినియెడు నీవో
ప్రాణేశ యెట్లు వినెద, క్షీణశివారవము చెవులు చిందఱ నోవన్. 103

చ. అని ధరణీశ్వరుండు హృదయంబున శోకము పొంగ భీషణుం
గనుఁగొని దీనిఁ జూచిన నఘం బొదవుం గడువేగ బాలఘా
తిని దలఁ ద్రెవ్వ నేయు మని తెంపునఁ జెప్పుము వీరబాహుతోఁ
గనికర మింతయు న్నిలుపఁగా వల దియ్యెడ వేయు నేటికిన్. 123

తే. ఇంకఁ బ్రత్యుత్తరంబు నీ కెద్దియైనఁ, బూని చెప్పితి వేని నాయాన నీవు
నిదియ ముమ్మాటికిని సెల వేగు మనిన, నట్లకా కని భీషణుం డనుమతించె. 124

తే. అపుడు చంద్రమతీదేవి యాత్మలోన, లేశమాత్రంబు చలనంబు లేకదైవ
మెల్లవగపులు సేయంగ నిచ్చెవరము, తగదు చింతింప నింక డెందమున ననుచు.

చ. తెలివి ఘటిల్ల నెంతయును ధీరతతోఁ దల వంచి యేమియుం
బలుకక మై వడంకఁగను బల్మఱు మిన్నక నేల వ్రాయుచున్
నిలిచి కృతాపరాధకరణి న్ధరణీపతిమ్రోల నుండె హృ
జ్జలజమునం ద్రిలోకనుతు సత్యధనుం బ్రియునిం దలంచుచున్. 126

వ. అంతటఁ బ్రభాతసమయం బగుటయు. 127

శా. సత్యశ్రీనిధి నేఁడు క్రమ్మఱ హరిశ్చంద్రక్షమానాయకుం
డత్యంతస్థిరరాజ్యపీఠము ముదం బందంగ నీరీతి నౌ
చిత్యం బొప్పఁగ నెక్కు నన్నగతి నక్షీణప్రభాస్ఫూర్తి నా
దిత్యుం డయ్యుదయాద్రి నెక్కె ధరణీదేవోత్తము లొమ్మిక్కఁగన్. 128

వ. అంతట నాభీషణుం డత్యంతరోషంబునఁ గాంతాశిరోమణి యగు చంద్రమతిం
దోడ్కొని పోవం గదిసి రాజవీధిం బౌరకాంతాజనంబులు గనుంగొని. 129

తే. కటకటా చిన్నినెత్తురుగందు రాచ, పట్టి చక్కనిపాపనిఁబట్టి చంప
నేటి మృత్యుస్వరూపయై యెచటనుండి, వచ్చె నీపడుచులతిండి యిచ్చటికిని.

క. పొదిగిళ్లలోన బిడ్డల, ముదమున నిడి యాద మఱచి ముందటిరీతిం
గొదకొని నిద్రింపఁగ రా, దిది మిగులఁ బ్రమాద మయ్యె నిఁక నివ్వీటన్. 131

క. ధర మీఁద నాఁడుదొంగలు, పరికింపఁగ లేరు తొల్లిపన్నిదమునకుం
గర మాశ్చర్యముగా నీ, పురిలోనం గలిగి రిట్టిబూమెలు గలవే. 132

చ. కలుషము బాలఘాతకము గాదని యాత్మ నొకించుకేనియుం
దలఁకక యిట్టిసాహసము దారుణలీల నొనర్చె నింక నీ
యిల నిటువంటివారలకు నెల్ల భయంబుగ దీని నిర్దయన్
వలయు వధింప దోషము లవంబును జెందదు భూమిభర్తకున్. 133

వ. అని పలికిన వెండియుఁ గొందఱు దమలో నిట్లనిరి. 134

క. ఎటు కేగెద వీవెనుచుం, గటి నొంటిమెయి న్లతాంగి కలతెఱఁ గెల్లం
దటుకునఁ జెప్పుము నావుడుఁ, గుటిలాలక వానిఁ జూచి గురుతరభీతిన్. 113

తే. వంతఁ బొందుచుఁ దనదువృత్తాంత మెల్ల, నెఱుఁగఁ జెప్పుటయును మృషాకృపదలిర్ప
నాసహోదరివీవుకాంతాలలామ, యేడ్వఁగా నేమిటికి నీకు నివ్విధమున. 114

సీ. అని పల్కి తనచేతిమనుజేంద్రసుతసొమ్ము లన్నియు ముడిగట్టి యందియిచ్చె
నాసమయమున భయంకరాకారులు యమకింకరులమించునట్టివార
లవ్వీటితలవరు లత్యుగ్రకరవాలహస్తులై పద పదం డనుచు నిగిడి
చేదివియలు పూని చెచ్చెర నేతేర వారికంటెను మున్న చోరకుండు
దొంగఁ బట్టితి రండని సంగతిగను, దలవరులలోనఁ గలసి యత్తలిరుఁబోఁడిఁ
బట్టికొని భూరితరముష్టిఘట్టనముల, పాలు వఱచుచు నత్యంతభయదభంగి. 115

క. కొని చని వేగమ భీషణుఁ, డనుతలవరి మ్రోలఁ బెట్టి యద్భుత మడరం
గనుఁగొనుఁ డని తొడవులు దర్శనముగ నిడి దొంగ దనియె సాహసలీలన్. 116

ఉ. అంతట భీషణుండు హృదయంబున రోషకృశానులీల ల
త్యంతసముగ్రమై పెరుఁగ నక్షులఁ గెంపు జనింప మేదినీ
కాంతుసిరాణివాసము నకల్మషపావనశీలఁ జూచి గో
యింతి నృపాత్మజా న్శిశువు నెట్లు వధించితి సాహసంబునన్. 117

తే. కాంత యిటువంటిబిడ్డలఁ గన్నకడుపు, గాదె నీకు నొకింతయుఁ గరుణలేక
యిట్టిపాతకమున కొడిగట్టి తేల, చిత్ర మయ్యెను మాకు నీచేఁతఁ దలఁప. 118

వ. అని పలుకుచు నమ్మహీకాంతునిసమ్ముఖంబునం బెట్టిన నతండు. 119

చ. కలుషవిహీనఁ జంద్రమతిఁ గన్గొని యిట్లని పల్కె నక్కటా
నెలఁత మహాదురాత్మకుఁడు నిర్దయుఁ డెవ్వఁడు నిన్నుఁ బంపె ని
ట్లలుకను బాలుఁ జంపు మని యాభరణంబులవాంఛ నీమదిం
గలిగిన నిత్తు నిందు కయి గాదిలిపుత్రు వధింప నేటికిన్. 120

ఉ. పున్నమచందమామ సరిపోలెడుచక్కనిపట్టిఁ బట్టి సం
పన్నమహోగ్రసాహసము పర్వఁగఁ జంపఁగఁ జేతు లాడెనే
యెన్నఁడు నిట్టిపాతకము లెచ్చట నేము ధరిత్రి మున్న గ
న్గొన్నది లేదు నీకతనఁ గ్రొత్తలు పుట్టె మహోగ్రకర్మముల్. 121

క. పురుషులకంటెను సాహస, మిరుమాఁడుగుణంబు లరయ నెక్కుడు బింబా
ధరలకు ననియెడువాక్యము, తరుణీ వివరింప నేఁడు తథ్యం బయ్యెన్. 122

క. ఈహరిణనయనఁ గెడపిన, స్త్రీహత్యయుఁ గెడప కున్నఁ జెచ్చెర స్వామి
ద్రోహంబును బాటిల్లెడు, నూహించిన నాకు నెద్ది యుచితము చేయన్. 143
వ. అని బాష్పపూరితనేత్రుండై మొగంబు వంచి యున్నయన్నరేంద్రునకుం జంద్ర
మతి యిట్లనియె. 144
క. ఓవసుధాధిపశేఖర, యీ వెలుఁగనిధర్మమార్గ మెందును గలదే
భావింప ధైర్య మెడలక, గావింపఁగ వలయు స్వామికార్యం బెపుడున్. 145
క. ఊహించి చూడ స్వామి, ద్రోహ మమితభార మనుచుఁ దొల్లి గరుత్మ
ద్వాహనునితోడ నిస్సం, దేహంబునఁ బలికె ధరణిదేవి ప్రియేశా. 146
చ. అదియును గాక నాకొమరు నర్భకుఁ జంపె మహాదురాత్మురా
లిది యనునిందఁ బొందితి నరేశ్వర కావున నింక న న్వధిం
పఁ దగుఁ దలంచి చూడ నణుమాత్రము నొందుతలంపు మానుఁడీ
హృదయములోపలం గరుణ యేటికి నిల్పెద రిట్టిపట్టునన్. 147
తే. మానవులు దేవతలును విస్మయము లొదవ, నిచట నచటను బొగడ మహీతలేశ
శంకఁ బొందక మిగుల నిశ్చలత నిలిచి, తెంపు మీఱఁగఁ దెంపు మదీయశిరము.

వ. అని యమందధైర్యంబునం జంద్రమతి ప్రాణేశ్వరుపదంబుల కెఱఁగి ముదంబునఁ
గృతప్రదక్షిణయై కరకమలంబులు మొగిడ్చి దరహాసవికాసంబులు వదనంబునం
బ్రకాశింప నిరంతరరక్తపంకసంసిక్తంబై చూపట్టు వధ్యశిలోపరిభాగంబునం బద్ధా
సనంబునం గూర్చుండి మార్తాండమండలంబుపైఁ జూడ్కి నిలిపి. 149

తే. నిఖిలలోకైకవంద్య యోనీరజాప్త, నాకుఁ గృపతోడ జన్మజన్మములయందు
సత్యసంశీలుఁ డగుహరిశ్చంద్రనృపతిఁ, బ్రాణనాయకుఁగా నొనర్పంగవలయు. 150
వ. అని యత్యంతతాత్పర్యంబున నాదిత్యుం బ్రార్థించి ప్రాణవల్లభు నుల్లంబునం జేర్చి
యుండుటయు నవ్వాలుఁగంటిం గనుంగొని మహీపాలుండు తదీయధైర్యవివేకంబు
లకు మనంబున విస్మయంబును బొంది సకలజగదాశ్చర్యంబుగా నిశ్చలత్వంబునం
గదిసి సింధువేలావలయితవసుంధరాభారభరణసామర్థ్యంబున నొప్పువామేతర భు
జాదండంబునఁ బ్రచండరిపుశిరఃఖండనోగ్రం బగుమండలాగ్రం బమర్చి చంద్రమతి
కంఠభాగంబునం గదియించి యున్నసమయంబున. 151

తే. భానుబింబసముజ్జ్వలప్రభలు పర్వఁ, గదిసి గ్రక్కున నెడఁ జొచ్చి గాధిపట్టి
చేతిఖడ్గంబు పట్టి ధాత్రీతలేశుఁ, బలికె రోషాతిరేకసంభాషణముల. 152
ఉ. చాలుఁ బురే నరేశ్వర ప్రచండతరం బగునిట్టిసాహసం
బేల యొనర్చె దీవు నిను నీక్షణ సేయఁగఁ బాతకంబు చం

క. ఎంతయపరాధ మొదవిన, నింతిం జంపంగఁ బాడియే పరికింపం
గొంతదయ చూపఁ దగు భూ, కాంతునకు వివేకబుద్ధి కలిమి దలిర్పన్. 135

క. సొమ్మొకచో నుండఁగ నప్పు, నమ్మిక యొకచోట నుండు నరులకు నెప్డు
న్నెమ్మదిఁ బరికించి వివే, కమ్మునఁ దెలియంగ వలయుఁ గల్లయు నిజమున్. 136

మ. జలజాతాక్షికి శక్యమే మనమునం జర్చింప నిర్భీతిఁ గో
టలు లంఘించి కవాటము ల్దెఱచి చండవ్యాఘ్రక్రమై నుండుకు
క్కల వా కట్టి నృపావరోధగృహభాగంబు ల్ప్రవేశించి ని
శ్చలత న్సాహసలీల రాకొమరు నాశ్చర్యంబుగాఁ జంపఁగన్. 137

సీ. కపటమార్గమునఁ దస్కరుఁ డెవ్వఁడో ద్రోహకారి యొక్కఁడు తెంపు గానిపింప
శిశువుఁ జంపి తదీయచిత్రభూషణరాజిఁ గొనిపోవఁ దలవరు ల్గూడఁ దఱుమఁ
బొదివిన భయమున ముదితపై మచ్చంబు గాఁగ నాతొడవులు కట్టివైచి
చొప్పు దప్పక వాఁడు సురిఁగిన నపరాధ మెల్లను దాన వహించి యాత్మ
సిగ్గుపడి రాజసభల భాషింప నోడి, లేనిదొంగతనంబు నాఁ బూని యాత్మ
లోన నొక్కింతయును శంక నూన నీక, పోవుచున్నది కాఁబోలుఁ బువ్వుఁబోఁడి.

వ. అని యనేకు లనేకప్రకారంబులం బలుక నక్కీరవాణి వీరబాహుపాలికిం గొనిపో
యి మహీనాయకుం డానతిచ్చినవిధంబు దెలియం జెప్పి యప్పడఁతి నొప్పనంబు
చేసి భీషణుండు తలవరులుం దానును నిజగృహంబున కరిగె నిట వీరబాహుండును
నిజాధీశ్వరు నాజ్ఞోల్లంఘనంబు చేయం దలంకి భయంబున నత్యంతక్రూరవృత్తులును
భయంకరకరవాలహస్తులు నగునిజకింకరులం గనుంగొని మీరు లిందఱుం గూడి
మందగమన నమందగమనంబునం బరేతనికేతనంబునకుం గొని చని యచ్చటం గదల
కున్న వీరదాసునిచేతి కిమ్మచ్చకంటి నిచ్చి చంపింపుం డనుటయు వారునుం బని
పూని చంద్రమతిం దోడ్కొని పోయి వీరదాసునిముందఱం బెట్టి 139

క. క్షితివరునానతియును దమ, పతి యగునవ్వీరబాహుపంపును గడున
ద్భుతముగఁ జెప్పిన నది విని, ధృతి దూలి కలంగి యులికి దీనాననయై. 140

క. మిగుల వెఱఁ గంది హాహా, జగమున నెవ్వార లింక శరణ్యులు పతిచేఁ
త గడవ ధైర్యము నిలుపఁగఁ, దగు నుల్లములోన వగవఁ దగ దించుకయున్.

చ. అరసి రణాంగణంబునఁ దృణాంకురసంగతవక్త్రులన్ భయా
కరమతుల న్నిరాయుధుల గర్వము సర్వము నుజ్జగించుచున్
శరణము వేఁడు వైరులను సారకృపామతిఁ బ్రోచు నేను ని
ష్కరుణఁ గృపాణధారఁ గులకాంత వధింపఁగ నెట్లు పూనుదున్. 142

మ్మతి భయ మేది మీ కెదిరి మాఱ్పలుకంగఁ దగంబు గాదు దు
ష్కృతనిబిడాంధకారసరసీరుహబాంధవ నాకు శక్యమే. 163

క. అనఘాత్మ మీరు మును నుడి, వినబుద్ధులె కాక నేఁడు వింతలు వివరిం
చిన నిందులోన లే విఁకఁ, జనుఁ డేమియుఁ బలుక వలదు సారెకు నన్నున్. 164

తే. పలుమఱును మీకు నిన్ని చెప్పంగ నేల, చేతిఖడ్గంబు విడువు కౌశికమునీంద్ర
యిట్టితటి నుండఁ జనదు మీ కిచట నిట్లు, వేగ విచ్చేయుఁ డిది నాదువిన్నపంబు.

వ. అనుటయు నాహరిశ్చంద్రనరేంద్రునినిత్యసత్యప్రభావంబునకు నత్యాశ్చర్యంబును
బొంది మృషావాదిం జేయుదు ననుతలంపు ముద్రించి విశ్వామిత్రుండు తపోవనంబు
నకుం జనియె నప్పు డంబరంబునం బ్రమోదంబునం జెలంగి నిజాంగనాసమేతఖేచర
వ్రాతంబు లసమానంబు లగు విమానంబు లెక్కి క్రిక్కిఱిసి విస్మయంబు పొదువం
గనుంగొనుచుండ నఖండసాహసంబున నమ్మహీమండలేశ్వరుం డాఖండలకరవజ్ర
ప్రచండం బగుకరవాలంబున నాకోలంబవేణి కంఠనాళంబు వ్రేయుటయు నవ్వేటు
ప్రసూనదామకంబుగతి నభిరామం బగుచుఁ బురంధ్రీశిరోమణిగళంబునం గీలు
కొనిన శిరఃకంపంబు జేసి మహీవల్లభుండు. 166

క. కలహంసగమన త్రెవ్వని, గళము నిరీక్షించి వివిధగర్వితరిపుభూ
తలపతులమెడలు దునుమం, గలకనఖడ్గంబు చూచి కడువిస్మితుఁడై. 167

తే. దారి తప్పెనొ గంటి యీతమ్మికంటి, శిల మెట్టిదొ కాక కౌశికమునీంద్రు
జాలమో మదుభజాశక్తి దూలి చనెనొ, పొంగి యింకొక్క మాటు వ్రేయంగవలయు.

క. అసిపోవఁగ వచ్చునె నా, యసిపోవక యంచు మిగుల నాగ్రహలీలం
గొసరక మఱియును హుమ్మని, యసమగతిం బూని వ్రేయునాసమయమునన్.

శా. పక్షీంద్రధ్వజపద్మజప్రముఖు లాబర్హిర్ముఖు ల్గొల్వఁగా
నుక్షాధీశ్వరు నెక్కి శైలతనయాయుక్తంబుగా భక్తసం
రక్షాదక్షుఁడు విశ్వనాథుఁడు సువర్ణగ్రావకోదండి దా
సాక్షాత్కారముఁ బొందె సత్కృప హరిశ్చంద్రక్షమాభర్తకున్. 170

సీ. ఆకాశగంగతో నమృతాంశురేఖతోఁ బల్లవారుణజటాభరముతోడ
ఫాలలోచనముతో ఫణికుండలములతోఁ గాలకూటవినీలగళముతోడ
హరిణడింభంబుతో నజగవధనువుతో డమరుశాతత్రిశూలములతోడ
నజశిరోమాలికాగజచర్మములతోడ భసితాంగరాగవిభ్రమముతోడ
సౌరభోజ్జ్వలపుష్పవర్షంబుతోడ, దివిజసందోహగణితవాదిత్రశబ్ద
సహితనారదవల్లకీస్వనముతోడ, శివుఁడు గిరిరాజకన్యకాధవుఁడు పొలిచె. 171

డాలున కైనఁ గొంత కరుణారస ముబ్బు మనంబులోన నీ
బాలికఁ జూచినం గినిసి పాయకఁ జంపుతలంపు పుట్టునే. 153

క. దానవుఁడవు గా కరయఁగ, మానవుఁడవె నీవు నిన్ను మగువలఁ జంపం
గా నియమించెనె మీగురు, వైనవసిష్ఠుండు గడుదురాత్ముఁడె యెందున్. 154

క. బలవద్గర్వితవైరుల, గళములు దునుమంగ శక్తి గలనీఖడ్గం
బెలతీఁగఁబోఁడులను బి, ట్టలుక వధింపంగఁ దొడఁగె హా యిటుఁదగునే. 155

తే. సరవి ధర్మార్థకామమోక్షములు నాల్గు, నీకు నొసఁగంగఁ జాలువర్ణితచరిత్ర
నీపురంధ్రీశిరోమణి నెట్లు చంపఁ, బూనినాఁడవు నీబుద్ధిపోఁడి మిదియ. 156

ఉ. పావనమై నుతింపఁ దగుభానుకులంబున నుద్భవించి ధా
త్రీవరవర్తనం బుడిగి దీనగతిన్ వెలివాడవానికిన్
సేవ యొనర్చి ప్రేతవనసీమ వసించుట నీకు ధర్మమే
భావములోఁ దలంచిన నపాత్రము నీదుచరిత్ర మెంతయున్. 157

చ. కులసతిఁ గ్రూరఖడ్గహతిఁ గూలిచి పొందెదుసౌఖ్య మెల్ల ని
ష్ఫలము దలంచిచూడ నరపాలక భార్యకునై మహోగ్రతం
దొలఁగక దక్షునిం గినుకతో వధియించినశూలపాణికిన్
వెలయఁగ నీకుఁ గల్గినవివేకము బుద్ధియుఁ లేకయుండెనే. 158

ఉ. కావున నిట్టియుగ్రతరకర్మము సాహసవృత్తిఁ జేయ ధా
త్రీవర నీతి గాదు భవదీయవివేకవిశేష మిట్టిదే
భూవలయంబులోన నినుఁ బుణ్యచరిత్రుఁడె వంచుఁ బూని నా
నావనినాథపుంగవసభాంతరసూరిజను ల్నుతింపఁగన్. 159

మత్తకోకిల. నాకుమారికలం ద్రిలోకజనస్తుతోజ్జ్వలరూపరే
ఖాకళానిధు లైనయంత్యజకన్యల న్వరియించినన్
నీకుమారుని ప్రాణము ల్మటి నీసముజ్జ్వలరాజ్యము
న్నీకులాంగనతోడిపొందును నీకు నిప్పుడ కల్గెడిన్. 160

వ. అని బహువిధంబులం బోధించు నగ్గాధినందనుం గనుంగొని యమ్మానవాధీశ్వరుండు దరహసితాననుండై. 161

క. ఓఋషినాయక యీసం, సారపయోరాశితీరసంప్రాప్తునిగాఁ
జేరిచి యీకాశీపురి, గౌరీపతి నన్నుఁ బ్రోవఁ గరుణఁ దలంచెన్. 162

చ. ఇతరునిఁ బోలెఁ బల్కెదు మునీశ్వర న న్భ్రమియింప నేల యీ
గతి బహుభంగులం గమలగర్భున కైనను బూని నిల్పి స

పద యెల్లం దెలియంగఁ గోరి చలముం బంతంబు రెట్టింప ని
ట్టిదశం గుందఁగఁ జేసె మాని తనకౌటిల్యంబు పాటిల్లఁగన్. 180

సీ. ఇది ప్రేతభూమి గా దినకులేశ్వర పావనం బగుయజ్ఞవాటంబు గాని
యస్థిప్రోవులును గా వమితసూనృతవచస్సౌభాగ్యబహుసమిత్సమితి గాని
ఘనకపాలములు గా వనవద్యసాహసవిమలోపకరణపాత్రములు గాని
రక్తపూరము గాదు రాజన్యలోకైకనాథ హయ్యంగవీనంబు గాని
కడిఁదికొఱ్ఱులు గావు సంగరజయాంక, పాదుకొల్పినభూరియూపములు గాని
చికురజాలంబు గాదు శిక్షితసమస్త, విమతనరపాల నవకుశవితతి గాని. 181

క. ఓలి నిను భృత్యునిం గా, నేలినయవ్వీరబాహుఁ డిలలోపలఁ జం
డాలుఁడు గాఁడు కృతాంతుఁడు, నాళీకహితాన్వయాబ్ధినక్షత్రేశా. 182

క. నీసతిఁ బిలిచి తలంకక, దాసింగా నేలునతఁడు తర్కింపంగా
భూసురుఁడు గాఁడు మాయా, వేసపుఁగలిరాజు గాని విమలచరిత్రా. 183

తే. నీకు డెందంబులోన సందేహ మేల, చేరి విశ్వాస మొదవ వీక్షింపు మనుచు
శుద్ధమతి దివ్యదృష్టి యిచ్చుటయు సర్వ, మునుఁగనుంగొని వెఱఁగందిమనుజవిభుఁడు.

వ. ఆనందకందళితహృదయారవిందుండై చంద్రమతియునుం దాను నమ్మందాకినీమౌళికిఁ
బునఃప్రణామం బాచరించి వినయవినమితోత్తమాంగుండై. 185

ఉ. శ్రీనగజేశ మీకరుణఁ జేసి మదీయము లైనయట్టియ
జ్ఞానమహాంధకారములు సర్వము నాకుఁ దొలంగి పోయె సు
జ్ఞానదివాకరోదయము చాలఁగ సొంపు వహించె నీభవాం
భోనిధి నేఁటితోడ ననుఁ బూని తరింపఁగఁ జేయుఁడీ దయన్. 186

క. మీపదపంకజసేవా, నైపుణమానసునిఁ జేసి నను సత్కరుణం
జేపట్టి ప్రోవు భూధర, చాప జగద్భరితరూప చంద్రకలాపా. 187

తే. నిన్ను హృదయాంబుజంబున నిండువేడ్క, గొలుల సద్భక్తి నిల్పఁగల్గుట యెదక్క
వరము లొం డెవ్వియును నొల్ల వరమునీంద్ర, సముదయార్చిత నీదుపాదములయాన.

వ. అని పలుక నప్పు డమ్మహాదేవువామాంగంబున నున్నసర్వమంగళ చంద్రమతిం గనుం
గొని. 189

ఉ. ఓపికవాణి నీకుఁ గలయోపిక వాణికి లేదు వార్ధివే
లాపరివేష్టితక్షితితలంబున నీసరి లేరు భామినుల్
నీపతిభక్తియుక్తియును నీమతిశుద్ధియు నీవివేకవా
గ్నైపుణము న్భుజంగకులనాథున కైన నుతింప శక్యమే. 190

వ. ఇవ్విధంబునఁ జంద్రశేఖరుండు ప్రత్యక్షం బగుటయు నవ్వసుంధరాధ్యక్షుం
డత్యంతభక్తితాత్పర్యంబును సంభ్రమంబును బ్రియంబును భయంబును విన
యంబును విస్మయంబును నయంబును నుల్లంబున నొక్క మొగిం బిక్కటిల్ల దేహం
బునం బులకాంకురసమూహంబు లసమానంబులై జనియింప నానందబాష్పబిందు
బృందంబులు నయనారవిందంబులం దొరంగ సాష్టాంగదండప్రణామం బాచరించి
లేచి నిలిచి ముకుళితకరకమలుండై. 172

సీ. జయ పార్వతీమనోజలజాతమార్తాండ జయ రసాతలవిభూషణకరండ
జయ గజాసురగర్వజలదజగత్ప్రాణ జయ భక్తలోకరక్షాధురీణ
జయ ఫాలలోచనజ్వలనజితానంగ జయ పాణిసంభృతోజ్జ్వలకురంగ
జయ వియద్వాహినీశశికళాకోటీర జయ కుందచందనసమశరీర
జయ రమాధీశభారతీప్రియపురంద, రాదిగీర్వాణమకుటవిన్యస్తరత్న
పటలశోభావిభాసితపాదపద్మ, జయ మనోహరకలధౌతశైలసదన. 173

క. అని బహువిధముల భక్తిని, వినుతించుచు నున్న భూమివిభుఁ జూచి కృపా
వనరాశి భక్తజనశో, భనదాయి మహానురాగభరితాత్ముండై. 174

ఉ. భూపకులాగ్రగణ్య నినుఁ బోలు నృపాలురు లేరు చూడఁగా
నీపదునాల్గులోకముల నెంతయు మేలు నితాంతసూనృతా
లాపవిశేషధైర్యగుణలక్షణసాహసవైభవక్రియా
దీపిత మయ్యె నీనడత దివ్యమునీశ్వరవర్ణనీయమై. 175

క. అచ్చముగ మూఁడు మెచ్చులు, మెచ్చితిఁ జిత్తమునఁ గరుణ మిక్కుటి మయ్యెన్
నిచ్చలముగ నడుగుము నీ, కిచ్చెద వలసినవరంబు లెయ్యవి యైనన్. 176

తే. అనుచు డాయంగ నమ్మని యాదరించి, మృదులకరపంకజంబున మేను నిమిరి
గౌరవం బొప్ప డాపలికంటిచూపు, పరఁగ నిగిడించుటయు మహీపాలవరుఁడు. 177

వ. లజ్జావనతవదనుండై యేమియుం బలుకనేర కూరకున్నం దదీయమనోభావం బెఱింగి
యబ్జభవజారాతి సెలవిఁ బొఱఁగ నవ్వి యిట్లనియె. 178

చ. దలముగ మేన నెల్ల భసితం బెసలారగ నలంది చర్మ మి
మ్ముల మొలఁ గట్టి భూతగణము ల్భజియింపఁగ నిప్పరేతభూ
ముల వసియించినట్టి నినుఁ బోలినవాఁడవు నీవు నీకు నో
నలినపితాన్వయాభరణ నాన వహింపఁగ నేఁటి కిమ్మెయిన్. 179

మ. ఇది గాధేయుమహేంద్రజాలము ధరిత్రీశా సమస్తంబు స
మ్మద మొప్ప న్వినిపించెద న్వినుము యుష్మత్సూనృతాలాపస

క. మిగులఁ బ్రయాసము నొందితి, వగణితసూనృతవచస్సమంచిత నీధై
ర్యగుణప్రాగల్భ్యంబులు, జగదాశ్చర్యంబు లార్యసంస్తుత్యంబుల్. 201

తే. నిత్యమైయొప్పుభవదీయసత్యమహిమఁ, దెలియఁ గోరి మనంబునఁ దలఁక కేను
వితతకపటక్రియావృత్తి సతిని నిన్ను, బాధ నొందించి కడు నపరాధి నైతి. 202

క. క్షమియింపుము నాయపరా, ధము లన్నియు దయ దలిర్పఁ దావకసామ్రా
జ్యము గైకొని యేలుము పూ, జ్యముగా నిఁకఁ బ్రోవు భూప్రజల సిరి దొలఁకన్.

చ. అన విని నవ్వి యాకరణి నానతి యియ్యఁగ నీకుఁ బాడియే
మునికులచంద్ర మీరు జగముల్గొనియాడఁగ నుండువారు మీ
కును నపరాధము ల్గలవె కోరిక లీరిక లెత్త మీకతం
బునఁ గడు మించె నాయశము పొందుగ నెల్లెడ నేఁటితోడుతన్. 204

క. నామనవి యొకటి విను మిఁక, నోమునికులతిలక మఱచియును రాజ్యము న
న్నే మఱి మగుడఁగఁగొను మని, యేమియుఁ బలుకకుఁడు నాకునింతియచాలున్.

ఆ. హీనమతి స్వదత్తమైనను బరదత్త, మైన ముల్లు మోపునంత మేర
భూమి యపహరించి పోవంగఁ ద్రోచిన, యతఁడు నరకగామి యండ్రు బుధులు.

శా. నీ[illegible]ష్టుం డగుపార్థివేశ్వరునిచే నిత్యప్రసన్నుండవై
యేకచ్ఛత్రముగాఁగ నీక్షితితలం బేలించి పాలింపు మ
స్తోకప్రాభవలీల నేలుము జయశ్రీణీతలేశుం డరి
క్ష్మాకాంతధ్వజినీవనీచయమహాదావానలస్ఫూర్తివై. 207

ఉ. నావుడు లెస్స యయ్యె నరనాథశిరోమణి యట్ల చేయుదున్
నీవె మదిష్టభూపతివి నిన్నుఁ బ్రియంబున నిల్పెద న్ధరి
త్రీవలయంబు సర్వమును దేజము పర్వఁగ నేలుచుండుమీ
నావచనం బమోఘము మనంబున సంశయ మింక నేటికిన్. 208

తే. ఇందు కొడఁబడ కుంటివే నృపవరేణ్య, పూని బొంకితి నని పొమ్మ పోవ కున్న
నరసి నే నెట్లు చెప్పితి నట్లచేసి, కీర్తిఁ బొందుము సత్యవిస్ఫూర్తి మెఱయ. 209

క. మును దేవసభామధ్యం, బున నాచేసినప్రతిజ్ఞ భూవర తప్పం
జను నె ప్రతిజ్ఞాభంగం, బునకం టెను దురిత మెద్ది బుద్ధిఁ దలంపన్. 210

చ. నలినసుహృత్కులీన పదునాల్గుమహాయుగము ల్వసుంధరా
స్థలికి నధీశుఁగా నిను ముదంబున నిల్పెద నంచుఁ బూని నేఁ
బలికినవాఁడ నాప్రతిన ప్రౌఢి వహింపఁగ నంతకాలమున్
జలధిపరీతభూతలము సర్వము నేలు ప్రజానురాగివై. 211

క. కళమున నొప్పెడునీమం, గళసూత్రము పెంపు గాదె గణుతింపంగఁ జె
క్కులు భయాదోపద్రవములు, దొలఁగించె భవత్ప్రియునకుఁ దోయజగంధీ. 191

మ. చిరకాలంబు సమగ్రరాజ్యవిభవశ్రీఁ జెంది వర్ధిల్లి యీ
ధరణీమండల మేలు నీదుప్రియభర్తం గూడి యేతెంచి సుం
దరి మాయొద్దనె యుండు మంతయుఁ గృతార్థత్వంబుమై నిప్పు డే
వర మైనం దగ వేఁడు మిచ్చెదఁ గడు న్వాత్సల్య ముప్పొంగఁగన్. 192

వ. అనుటయుం జంద్రమతి యగ్గిరీంద్రనందనచరణారవిందంబులకుం బ్రణమిల్లి యోతల్లీ యిప్పటిభేదనం బేలుమహీవల్లభకుమారుని సజీవునిం జేసి నాకుం బ్రాపించిననింద తొలంగం జేయు మనిన నమందసంతోషితస్వాంతయై యమ్మహీపాలబాలకుం డింతకుమున్న బ్రతుకు భవత్తనూజుఁ బ్రాణంబు లిచ్చితిఁ బరమహర్షంబునం బొందు మను సమయంబున. 193

చ. పొలుపుగ నిద్రమేల్కనినపోలిక నల్లన లేచి వచ్చెఁ గో
మలపదపద్మసంఘటితమంజులనూపురకింకిణీరవం
బులు గడుఁ బర్వ లేనగవు ముద్దుల చెక్కులఁ దొంగలింప ను
జ్జ్వలమతి లోహితాస్యుఁడు నిశాకరతుల్యుఁడు సంభ్రమంబునన్. 194

తే. ఇట్లు వచ్చిననందను నెలమి దొలఁకఁ, జంద్రమతి చూచి యానందజనితబాష్ప
కణము లుప్పొంగ నక్కునఁ గదియ నొత్తి, యమరఁ గౌఁగిటఁ జేర్చి ముద్దాడు చుండె.

క. ఆవేళఁ గౌశికుఁడు ల, జ్జావనతశిరస్కుఁ డగుచు నాగ్రహ మెల్లం
బోవంగ విడిచి యతిదై, న్యావహముగఁ జింత నొంది యద్భుత మడరన్. 196

క. చిరకాలార్జిత మగుమ, త్పరమతపోధనము గంటి వడి కడుఁదలిగెన్
దురహంకృతి నేఁ బలికిన, నిరుపమ ఘోరప్రతిజ్ఞ నెపమున నకటా. 197

ఉ. పాకవిరోధి యేమిటికిఁ బ్రశ్న మొనర్చె సమస్తతాపసా
నీకము నూరకుండ నతినిర్భరగర్వము పూని బేలనై
నోకొని యవ్వసిష్ఠమునితోడుత నేటికి నాగ్రహించితిన్
నాకు వివేకహీనత మనంబున నేటికిఁ బుట్టె నయ్యెడన్. 198

ఆ. కమలభవునితోడ గర్వించి ప్రతిసృష్టిఁ, జేయఁ జాలినట్టి నాయశేష
మతివిశేష మెల్ల మందీభవింపంగ, వట్టిజగడ మేల పెట్టుకొంటి. 199

వ. అని పశ్చాత్తాపంబును బొందుచు నమ్మహీపతిం గదిసి నిల్చి యమ్మునివల్లభుండు కృతనమస్కారుం డగుమహీరమణుం గనుంగొని రారమ్మని యాలింగనాదిసంభావనంబుల మనం బలరించి యిట్లనియె. 200

మాల్యాదివస్తుసామగ్రిచే నెంతయు శ్రీలు మీఱఁగ నలంకృతు లొనర్చి
చంద్రకాంతశిలావిశాలవితర్దికోపరిభాగమునఁ జాలఁ బ్రభుత మీఱ
మేరుశిఖరంబుతో డుత మేల మాఱు, భద్రసింహాసనంబునఁ బరఁగ నునిచి
యగ్రజన్ముల నుచితదానాదివిధులఁ, బ్రీతచిత్తులఁ గావించి ప్రియము వెలయ. 228

వ. ఇందుశేఖరుకృపావిశేషంబున నవ్విశ్వంభరామండలంబు సమస్తంబును మోదంబున నేలు మని సమగ్రవైభవంబునఁ బట్టంబు గట్టె నాసమయంబునం గమలాసనాది గీర్వాణులు వసిష్ఠ విశ్వామిత్రాదిసంయమిజనంబులు ననేకప్రకారంబుల నాశీర్వదించి మంత్రాక్షతంబు లిడి రప్పుడు. 224

సీ. దివి నాదితేయవాదిత్రము ల్ఘోషించెఁ గురిసెను గుప్పగా విరులవాన
గంధర్వకామినీగానము ల్విలసిల్లె నప్సరస్త్రీలనాట్యములు చెలఁగె
నత్యంతసౌరభశైత్యమాంద్యంబుల మలయానిలము వీచెఁ గలయ దిశల
దహనుఁ డొప్పారెఁ బ్రదక్షిణార్చులచేత నినచంద్రదీధితు లేపు చూపె
భుజగవంశాధినాథదిగ్గజవరాహ, కూర్మకులపర్వతంబులు కుతలభార
మెడల విశ్రాంతి వహియించె నెలమి దోలఁక, సకలజీవులు పొదలిరి సమ్మదముల.

వ. తదనంతరంబ. 226

తే. చంద్రశేఖరుఁ డాహరిశ్చంద్రుఁ జూచి, యీవు సాకేతపురమున కేగు మనుచు
హరివిరించిపురందరాద్యమరవరులు, గొలువ వేంచేసెఁ గైలాసకుధరమునకు. 227

క. అంతటఁ దద్వృత్తాంతం, బంతయు నారదునివలన నమరఁగ విని య
త్యంతప్రమోదభరిత, స్వాంతుండై సత్యకీర్తి సంభ్రమ మొప్పన్. 228

క. క్ష్మాకాంతవరాళిరత్నము, రాక పురిం జాటఁ బంచె రయమునఁ దద్వా
ర్తాకర్ణనసంజనితమ, హాకౌతుకములఁ జెలంగి యప్పుడ పౌరుల్. 229

వ. బహుప్రకారంబుల నత్యంతరమ్యంబు గాఁ బురం బలంకరించి రాసమయంబున నపరిమితకరిహయరథపదాతిసమేతుండై మంగళతూర్యరవంబులు చెలంగ నుప్పొంగి సమగ్రవైభవంబున. 230

ఉ. పున్నమనాఁటిరేయిపరిపూర్ణసుధాకరురాకఁ గాంచి సం
పన్నకుతూహలస్ఫురణ పర్వఁగ నంబుధిరాజు దా నెదు
ర్కొన్నవిధంబున న్నృపశిరోమణిరాకకు సత్యకీర్తి య
త్యున్నతభక్తియుక్తి చెలు వొంద నెదుర్కొనిసం బ్రియంబునన్. 231

తే. ఎదురుకొని సంభ్రమంబున నినకులేశు, నంఘ్రిపంకజములకు సాష్టాంగ మొఱఁగి
కేలుఁదమ్ములు శిరసుపైఁ గీలుకొలిపి, పలికె నిట్లని వినయసంభాషణముల. 232

క. మరి మీఁదఁ బాకశాసను, పరిగద్దియ నొగిఁ జతుర్దశమహామన్వం
తరములు నిల్పెద ననుచుం, దిరముగ నేఁ బల్కినాఁడఁ ద్రిదశులు వినఁగన్. 212

క. అరదాఁక నుండు మధికా, నందంబును బొంది నీవు నాకంబున సం
క్రందనుమాఱటగద్దియ, నిందుకళాధరునియాన యిఁక నేమనినన్. 213

ఆ. అనిన నొండు పలుక నాత్మలోఁ శంకించి, యినకులాధినాథుఁ డేమి యనఁగ
నేమి యగునొ యనుచు నెంతయుఁ జింతించు, చున్న యంత శిష్యకోటిఁ గొలువ.

ఉ. తోయజగర్భసన్నిభుఁడు దుష్కృతపర్వతవజ్రపాణి యా
మ్నాయరహస్యవేది యసమానతపోవిభవప్రభావధా
రేయుఁడు శైవమార్గసుచరిత్రుఁడు పాత్రుఁ డరుంధతీసతీ
నాయకుఁ డవ్వసిష్ఠమునినాథుఁడు వేడుక వచ్చెఁ జెచ్చెరన్. 215

గీ. వచ్చి రాజీవబాంధవవంశతిలకు, నెదుర నిలుచుటయును జూచి హృదయ మలర
మ్రొక్కి యిట్లని పలికె నోమునివరేణ్య, మిగులఁ బుణ్యుండ నైతి నే మీకతమున.

చ. పరుసముసోఁడ సోఁకి సులభంబుగ లోహముఁ గాంచనంబుగాఁ
బరువడిఁ జేసినట్లు నిరపాయతపోమహిమానుభావబం
ధురుఁ డగు గాధినందనునితోఁడుత నన్నలయించి సత్యసు
స్థిరతరకీర్తిమంతునిఁగ జేసితి రెంతయు సత్కృపారతిన్. 217

క. భూతలనాథులలోపల, నాతత మగుకీర్తి నేఁ గృతార్థుఁడ నైతిన్
మీతలఁ పానతి యిం డిఁక, నేతెఱఁగున నడతు నుచిత మెయ్యది యనినన్. 218

ఉ. శ్రీకరసత్యవైభవవశీకృతచంద్రకళావతంస యి
క్ష్వాకులకీర్తి నీకతన వన్నియ మించె ధరిత్రిమీఁద సు
శ్లోకుఁడ వీవు నీకుఁ గలసూనృతధైర్యవివేక దానరే
ఖాకలితప్రతాపములు గన్గొన మెవ్వరియందు నెచ్చటన్. 219

క. అనఘాత్మ నాపురోహితుఁ, డని యెంతయు నాదరించి యరుదుగ నాచే
సినప్రతిన దప్పకుండఁగ, నను గెలిపించితివి త్రిభువనంబు లెఱుంగన్. 220

క. ఈకౌశికమునిపుంగవుఁ, డేకరణి న్మెలఁగు మనియె నేపారంగా
నాకరణిన మెలఁగం దగు; నాకాధిపసదృశ యిదియ నాదుతలంపున్. 221

క. నావుడు గురువాక్యంబులు, ద్రోవక గాధేయునాజ్ఞ తోరపుభక్తిన్
గావింప ననుమతించె మ, హీవల్లభుఁ డంత నిర్జరేంద్రుఁడు కడఁకన్. 222

సీ. మదనారిపనుపున మణిస్తంభముల వియన్నదివారిఁ దెప్పించి నరవరేణ్యు
జానొంద మంగళస్నానంబు చేయించి వరవస్త్రబహువిధాభరణగంధ

క. మునిపతిమార్కండేయుం, డనఘుండు యుధిష్ఠిరునకు ననురాగమునన్
వినిపించె హరిశ్చంద్రా, వనినాథుకథాక్రమం బవార్యప్రౌఢిన్. 241

శా. వాగ్భోగీంద్రసుపర్వసింధురశరద్వార్వాహతారాసుధా
రుగ్భర్మాచలచాపగోపగరుడత్రోటిచ్ఛటామల్లికా
స్రగ్భావిభ్రమశుభ్రకీర్తిరుచిహారశ్రేణికావిస్ఫుర
ద్దిగ్భామాకుచమండలాగ్ర విహితార్థివ్రాతచింతామణీ. 242

క. అలఘుప్రతాపకుతుబన, మలకేంద్రకృపాసమగ్రమహిమాన్విత కో
ర్కొలనిగ్రామనికేతన, జలసీమాగతుల్యైకచాతుర్యనిధీ. 243

ఉత్సాహ. రాట్సభాంతరాళధీధురంధరప్రశస్త ప్రా
వృట్సమాగమాంబుభృన్నవీనదాన గర్విత
ద్విట్సమాజదంతిసింహ ధీరతామరాచలా
షట్సహస్రవంశదుగ్ధసాగరక్షపాధిపా. 244

గద్యము. ఇది శ్రీమదాపస్తంబసూత్రపవిత్ర కౌండిన్యమునిచక్రవర్తిగోత్ర సకల సుకవిజనానీకమిత్ర దేచనామాత్యకుమార వినయవివేకవిద్యాలంకార శంకరకవినామధేయప్రణీతం బయినహరిశ్చంద్రోపాఖ్యానం బనుమహాప్రబంధంబునందు సర్వంబును బంచమాశ్వాసము.

ఉ. సాంద్రయశోరమావిభవ సత్యవచోమణిహార యోహరి
శ్చంద్రనరేంద్ర వంశవనచైత్ర యమిత్రజయప్రతాపని
స్తంద్ర పురందరాదివిబుధవ్రజరంజితపట్టభద్ర భో
గీంద్రున కైన శక్య మగునే నుతియింప భవత్పవిత్రభావముల్. 283

మ. అనఘుం డైనవసిష్ఠుతో నొఱసి లోకాశ్చర్యధుర్యంబుగాఁ
దనయక్షీణతపోవిశేషగరిమ న్దర్పించి బ్రహ్మర్షియై
వినుతిం బొందినవేదమూర్తి త్రిజగద్విఖ్యాతుఁ డగ్గాధినం
దనుఁ డెంతే వెఱఁగంద నిల్పితివి నిత్యం బైనసత్యం బిలన్. 284

తే. మహిమతో నింకఁ బూజ్యసామ్రాజ్యలక్ష్మి, వెలయఁ గైకొని భూప్రజావితతిఁ బ్రోవ
వేగ విచ్చేయుఁ డని విన్నవించుటయును, హర్ష మొదవంగ దగహసితాస్యుఁడగుచు.

చ. సముచితవాగ్విశేషముల సంతస మొందఁగ సత్యకీర్తి ను
త్తమసచివాగ్రణి న్నిజహితస్థిరకార్యరహస్యవేది దు
ర్మిమతసమూహసంహరణవిక్రమునిం దగ నాదరించి ర
త్నమయవినూత్నకాంచనరథంబు ముదంబున నెక్కె నున్నతిన్. 286

సీ. అమలంబు లగుచతురంగబలంబులు గరిమ దీపించి నల్గడలఁ గొలువ
హృద్యంబులై బహువాద్యరవంబులు మ్రోయ మాగధగానములు చెలంగ
వందిబృందములు కైవారము ల్గావింపఁ జేరి పుణ్యస్త్రీలు సేస లిడఁగఁ
గంకణఝుణఝుణత్కారము ల్చెలరేగ రమణులు వింజామరములు వీవఁ
గలికికన్నులవారకాంతలు పసిండి, పళ్లెరంబుల రత్నదీపములు నించి
నిండువేడ్క నివాళింప నిజపురంబు, మంచిశుభలగ్నమునఁ బ్రవేశించె నృపతి. 287

వ. ఇవ్విధంబునం బురంబుం బ్రవేశించి రాజమార్గంబునం జనుదెంచునప్పుడు. 288

సీ. అరవిందనాభుఁ డీయవనీతలేశ్వరుఁ డిందిర యీశరదిందువదన
పాకశాసనుఁ డీదివాకరాన్వయభర్త పౌలోమి యీపురంధ్రీలలామ
నీహారకిరణుఁ డీనిత్యసత్యధనుండు రోహిణి యీపంకరుహదళాక్షి
ప్రసవకోదండుఁ డీరాజదేవేంద్రుండు రతిదేవి యీలోకనుతచరిత్ర
యని హరిశ్చంద్రసార్వభౌమాగ్రగణ్యుఁ, జంద్రమతిఁ జూచి యానందజలధిఁ దేలి
పౌరజనబృందములు సుధాసారమధుర, చిత్రవాగ్వైఖరులఁ బ్రశంసించి రెలమి.

వ. ఇవ్విధంబునం బౌరజననికాయసంస్తూయమానుం డై హరిశ్చంద్రుండు మహానందంబు
ను బొంది నిజమందిరంబుం దఱిసి సముచితవర్తనంబునం బ్రవర్తించుచు నయమార్గం
బునం బ్రజాపరిపాలనశీలుం డై స్వారాజ్యం బగురాజ్యంబు సేయుచుండె నని. 24